మే 2013

రూ. 10/-

# చతుర



# అరుదైన సాహిత్య పత్రికలకు అభినందనలు



సాహిత్యం సమాజంపైన తప్పక ప్రభావం చూపుతుంది. కాబట్టి సాహిత్యం కూడా ఒకరకమైన సామాజిక సేవే. తరతరాల నుంచీ సాహిత్యం ప్రజల్ని చైతన్యపరచడంలో ప్రముఖ పాత్ర వహిస్తోంది. అందువల్లనే సాహిత్య పత్రికల ప్రచురణా సామాజిక సేవలో ఒక భాగమే. ఇలాంటి సేవ చేసిన సాహిత్య పత్రికలు ఒకప్పుడు 'భారతి', 'చిత్రగుప్త', 'కృష్ణా పత్రిక'. అయితే భారతి తర్వాత దీర్ఘకాలం సాహిత్య సేవ చేసిన, ఇంకనూ చేస్తున్న అరుదైన పత్రికలు 'చతుర', 'విపుల' మాస పత్రికలు. బహుశా ప్రపంచ సాహిత్యంలోనే ఇటువంటి విశిష్ట పత్రికలు లేవేమో! నెలనెలా ఓ నవలనందించే పత్రిక 'చతుర'. తెలుగు అనువాదంలో ప్రపంచ కథాసాహిత్యాన్ని పరిచయం చేసే అరుదైన పత్రిక 'విపుల'. ఇవి ఎలాంటి వ్యాపార ప్రయోజనాలను ఆశించకుండా కేవలం మంచి సాహిత్యాన్ని అందివ్వాలన్న దృష్టితోనే ఇన్నేళ్లుగా వస్తూనే ఉన్నాయి. పైగా సాహిత్యంలో నాణ్యతా ప్రమాణాలను నిర్దిష్టంగా అనుసరించే పత్రికలు కూడా ఇవే. రచయితలు లబ్ధప్రతిష్టులా, కొత్తవారా అనే పట్టింపు లేకుండా, పక్షపాతం లేకుండా, రాశిని కాకుండా వాశినే పరిగణనలోకి తీసుకుని ప్రచురించడం కూడా వీటి విశిష్టతే. అందువల్ల కొత్త రచయితలెందరినో పరిచయం చేసిన ఘనత కూడా వీటిదే. అంతేకాదు, తక్కువ ధరకే ఎక్కువ కాపీలు ప్రచురితమవుతున్న పత్రికలూ ఇవే.

ఈ పత్రికలకు గతంలో చలసాని ప్రసాదరావులాంటి ప్రతిభాశాలురు సంపాదకులుగా ఉండి, వీటి దిశ, దశను నిర్దేశించారు. ఆ కారణంగానే మారుతున్న కాలానికనుగుణంగా కొత్త పుంతలు తొక్కుతూ ఒకవైపు రోజురోజుకీ దిగజారిపోతున్న తెలుగుదనాన్ని కాపాడే ప్రయత్నం చేసుకుంటూ, మరోవైపు తమ ప్రామాణికస్థాయిని కోల్పోకుండా కాపాడుకుంటూ ప్రజల మన్ననలను పొందుతూనే వున్నాయి.

ఇటువంటి గొప్ప పత్రికలతో నాకు సాహిత్యానుబంధం చాలానే ఉంది. నేను హైస్కూలులో చదువుతున్నప్పటి నుంచే ఈ మాసపత్రికలకు మంచి పాఠకుణ్ణి. వీటిలో నా రచనలు ఎప్పుడొస్తాయా? ఆ స్థాయిలో రాసే స్థితికి నేనెప్పుడు చేరుకుంటానా? అని తపించేవాణ్ణి. ఆ తపనను సరైన మార్గంలో మలచినవారు చలసాని ప్రసాద్‌రావు. వారు 1995లో పెట్టిన నవలల పోటీలో నేను రాసిన 'మట్టి బతుకులు' నవలను బహుమతి నవలల్లో ప్రచురించారు. ఈ విషయంలో నాపైన తొలి నవలతో అభిమానం చూపించి చలసానివారు చూపిన ప్రోత్సాహం మరువలేనిది. ఆ తర్వాత నా నవలలు 'చీకటి ముడులు', 'ముద్ర', 'పరస' నవలల్నీ ప్రచురించారు. 2006లో ప్రచురితమైన 'ముద్ర' నవల అదే ఏడాది కన్నడంలోకి అనువాదమై, ఒక సంచలనాన్నే సృష్టించింది. అది తెలుసుకున్న ప్రస్తుత సంపాదకులు చంద్రప్రతాప్ ఈ నవల కథవెనుక కథను కూడా నాతో రాయించి, తర్వాత చతురలో ప్రచురించారు.

అదేవిధంగా ఆ మధ్యన 'విపుల' కథల పోటీలో నా కథ 'పయనం'కు ద్వితీయ బహుమతి పదివేల రూపాయలు వచ్చింది. ప్రపంచానికి పెద్దగా తెలియని నక్కలవాళ్ల జీవన పోరాటాన్ని ఆ కథలో చిత్రించాను. ఇలాంటి నూతన కథావస్తువులకు 'చతుర', 'విపుల'లు మొదటినుంచీ పెద్దపీటనే వేస్తున్నాయి.

ఎంతో మంచి సాహిత్యాన్ని అందిస్తూ, సామాజిక చైతన్యానికి కారణమవుతున్న 'చతుర' 'విపుల' మాసపత్రికలు చిరకాలం వర్ధిల్లాలని ఆశిస్తూ, వీటి ప్రధాన సంపాదకులైన రామోజీరావుగారికీ, ప్రస్తుత సిబ్బందికీ నా హృదయపూర్వక అభినందనలు తెలియజేస్తున్నాను.

— డా. వి.ఆర్. రాసాని,

కథ, నవల, నాటక రచయిత, తిరుపతి

# పాఠకమహాశయులకు మనవి!




మూడున్నర దశాబ్దాలుగా నెలనెలా
ఒక మంచి నవలను,
మరెన్నో శీర్షికలను అందిస్తూ
నవనవలా వేదికగా చతుర
పాఠకుల ప్రశంసలందుకుంటోంది.

గత ఆరేళ్లలో కాగితం ఖర్చు,
ముద్రణ, రవాణా, పంపిణీ ఖర్చులు,
అదనపు సాంకేతిక వ్యయాలు
ఇబ్బడి ముబ్బడిగా పెరిగినా
ఇప్పటివరకు చతుర ధర పెంచలేదు.




ఇప్పుడీభారం మరింతగా పెరిగిన
నేపథ్యంలో అనివార్యంగా చతుర ధర
సవరించక తప్పడం లేదు.

ఈ మేరకు జూన్ నుంచి
చతుర విడిప్రతి రూ.12/- అవుతోందని
గమనించ ప్రార్థన.

సహృదయ పాఠకులు, సాహిత్యాభిమానులు
పరిస్థితులను అర్థం చేసుకొని,
ఎప్పటిలాగే ఆదరిస్తారని ఆశిస్తున్నాం.




విడిప్రతి రూ.12/- అయినా
సాలు చందా రూ.140/- మాత్రమే!

– మేనేజర్,
వసుంధర పబ్లికేషన్స్

# మనసున ఉన్నదీ...



★ ఏప్రిల్ సంచికలోని 'అమెరికా అబ్బాయి' కథ చాలా బాగుంది. ఒక్క చిన్న వాక్యంతో కూడా మనుషుల్ని నవ్వించవచ్చు, ఏడిపించవచ్చని తెలియజేశారు. నిజంగా మనసుకు హత్తుకునే కథ. జాస్తి రమాదేవి ఇటువంటి కథలను మరెన్నో రాయాలని కోరుకుంటున్నాను.

**- శ్రీదేవి వంగల,**
kousivangala@gmail.com

★ ఏప్రిల్ 'చతుర' నవల 'సస్యశ్యామలం', రెండు పెద్ద తెలుగుకథలు చాలా బాగున్నాయి. విదేశాల్లో తమ సంతానం ఉన్న చాలామంది తల్లిదండ్రులు ఎదుర్కొనే అనుభవాన్ని రచయిత్రి 'అమెరికా అబ్బాయి' కథలో చక్కగా చిత్రించారు. 'కొత్తగాలి' కవితలు ఆలోచింపజేసేవిగా ఉంటున్నాయి.

**- కటకం మహాలక్ష్మి,** విజయవాడ.

★ లోకానికి భిన్నంగా, పాఠకుల అభిరుచికి, చేరువగా 'విపుల', 'చతుర' ముఖచిత్రాలుగా బాలబాలికల ఫొటోల్ని అందిస్తోన్న తీరు అమోఘం. పసివాళ్ల ముద్దుగొలిపే మోముని చూసి మేమెంతో ఆనందిస్తున్నాం. ఈ జంటపత్రికలు ఎపుడు వస్తాయా అనే ఎదురుచూపులు, వచ్చిందే తడవు చకచక చదివేయడం, ఆపై ఎంతో సంతృప్తిని పొందుతాం. నెలంతా ఆ కథలు మనసుల్లో తిష్టవేస్తుంటాయి.

**- యు. చిట్టిబాబు,**
కొత్తపాల్వంచ, ఖమ్మంజిల్లా.

★ ఏప్రిల్ 'చతుర'లోని ఎ.బి.ఎస్ 'నాన్న' కథ బాగుంది. జీవితంలోని అన్ని పార్శ్వాలనూ స్పృజించింది. నారాయణరావు పాత్ర మనసుకు తాకింది. మర్చిపోలేకపోయాను. వ్యక్తిత్వవికాసానికి ఇలాంటి కథలు అవసరం. 'సస్యశ్యామలం' అంతగా ఆకట్టుకోలేకపోయింది.

**- వేణుగోపాలరావు,** కాకినాడ.

★ 'సస్యశ్యామలం' నవల చాలా బాగుంది. పల్లెను అభివృద్ధి చేసే నిమిత్తం జరిగిన సంఘటనలు, ప్రేమను నిరూపించుకునే విధానం, గ్రామీణులు ప్రవర్తించే తీరును శ్రీలత చక్కగా రాశారు. నాకు 'చతుర', 'విపుల' పరిచయమైంది ఈ ఏడాదే అయినా అందులోని అనుభూతి వర్ణనాతీతమైంది. పాఠకులకు ఆనందాన్ని పంచుతున్న ఈ పత్రికలు చిరస్మరణీయంగా ఉండాలని కోరుకుంటున్నాను.

**- అభిరామ్ పర్వతాపురం,** ఆదోని.

★ ఏప్రిల్ సంచికలో ఎం. శ్రీలత నవల 'సస్యశ్యామలం' చాలా బాగుంది. ముఖ్యంగా ఒక గ్రామాన్ని అభివృద్ధి చేసే పనిలో ఎదురైన అడ్డంకుల్ని బాగా చిత్రించారు. చార్లీ చాప్లిన్ చతురోక్తులు బాగున్నాయి.

**- వి. రాజకుమారి,** గుంటూరు.

★ నాకు తెలీకుండానే పదేళ్ళక్రితం 'చతుర', 'విపుల' మీద మనసు పారేసుకున్నాను. ఈ పత్రికలు మార్కెట్‌కు వచ్చినప్పుడు ఈటీవీలో ప్రతినెలా వచ్చే స్క్రోలింగ్ చూసి మా వూళ్లో పుస్తకాల దుకాణానికి వెళ్లి కొనుక్కుంటుంటాను. ఆ పత్రికలకు నేను చందా కట్టినా అవి పోస్ట్ ద్వారా అందేందుకు ఆలస్యమవుతుందని నేరుగా వెళ్లి కొంటాను. ఆ తర్వాత చందా కాపీలు అందుతాయి. అలా ప్రతినెలా నేను రెండేసి చతురలు, విపులలు తీసుకుంటాను. ఇందులో నాకు బాగా నచ్చినది 'కొత్తగాలి'. సమకాలీన అంశాలపై ఫ్లాష్ పోయెట్రీ వస్తోంది. ఈ కవితల మీద నా స్నేహితులతో ఫోన్లో మాట్లాడ్డం కూడా చక్కని అనుభవమే. నవల చదివి ప్రవేశిక నింపడం నాకొక రోజు పని. ఈ తతంగమంతా చూస్తున్న శ్రీమతి "ఓహో చతుర వచ్చిందా? పరీక్షకు ప్రిపేరవుతున్నట్లుంది" అని ఎగతాళి చేస్తుంది. 'చతుర'ను నేను జీవితాంతం వదులుకోను.

**- గుడిమెట్ల గోపాలకృష్ణ,**
అర్జవిల్లి.

---

చిరునామా : మనసున ఉన్నదీ... సంపాదకుడు, చతుర, ఈనాడు కాంపౌండ్, సోమాజిగూడ, హైదరాబాద్-500 082

ఈ మెయిల్ : vipula.chatura@gmail.com
vipula.chatura@eenadu.net

సంపుటి -36 సంచిక - 4
424వ సంచిక, పేజీలు : 132
మే 2013

# చతుర






- ముఖచిత్రం : మాస్టర్ భరత్ కార్తికేయ
- చివరి కవర్ : రమ్య నంబీశన్

పుస్తకాలంకరణ : రాజు యాట


**ఓ** రోజు మధ్యాహ్నం సునంద తన భర్త రామ్మోహన్‌తో మాట్లాడుతూనే చకచక రెడీ అవుతోంది. తన పిన్నికూతురి ఇంటికెళ్ల డానికి సిద్ధమవుతున్న సునంద అపుడే అనుకోకుండా వచ్చిన మమతను చూసి చిరునవ్వు నవ్వింది. మమత రామ్మోహన్ మరదలు! మమతకు సారీ చెప్పి త్వరగా వచ్చేస్తానంటూ హడావిడిగా బయలుదేరిందామె. ఐదునిముషాల్లో ఎందుకో ఇంటికి తిరిగి వచ్చిన సునంద స్టోర్ రూంలో కన్పించిన దృశ్యం చూసి నివ్వెరపోయింది. ఇంతకీ అక్కడ ఆమె చూసిన దృశ్యం ఏమిటి? ఆసక్తికరమైన మలుపులతో సాగే **వి. నాగరత్న** నవల

**సఖి!**

6వ పేజీలో..

బొమ్మలు : భాస్కర్

'మీ భర్త హత్య ఎలా జరిగింది?
డబ్బుకోసం మీరే చేయించారా.. లేక ఇంకేదైనా...?'
కటువుగా అడిగాడు ఇన్‌స్పెక్టర్ బోసు.
దెబ్బతిన్నట్టు ఓసారి కళ్లెత్తి చూసి తర్వాత
తలవంచుకుంది సునంద.
సోఫాలో తీరికగా కూర్చున్న బోసు తన
ఎదురుగా కూర్చున్న సునందను ఓసారి
పరిశీలనగా చూశాడు.
పసిమిఛాయ, అయిదున్నర అడుగుల ఎత్తు.
ఎత్తుకు తగ్గ లావుతో చక్కని సౌష్టవం ఉంది.
చంద్రునిలో మచ్చలా ఆ అపురూపమైన
సౌందర్యం వెనుక కళ్లు మాత్రం తేజోవిహీనం!
ఇంతకీ ఆమె భర్తను హత్యచేసిందెవరు?
ఇన్‌స్పెక్టర్‌కు ఆమెపై అనుమానం రావడానికి
కారణమేమిటి?
ఆద్యంతం ఉత్కంఠగా
చదివించే
వి. నాగరత్న నవల
**సఖి!**
చతుర మే నెల కానుక!



**ఇ**ద్దరు కుర్రాళ్ళు హైద్రాబాద్ - విజయవాడ హైవే మీద బైక్‌ని శరవేగంతో పోనిస్తున్నారు.

ఉడుకురక్తం మీదున్నారేమో హై స్పీడుకు తోడు తెగ ఫీట్లు చేస్తూ దూసుకెళ్తున్నారు.

ఎర్రచొక్కా బండి నడుపుతోంటే, వెనక్కూర్చున్న బ్లూ చొక్కా "ఇంకా స్పీడ్ పెంచరా.. ఈ లెక్కన ఎడ్లబండిలా పోతే మనం విన్నయినట్లే.." అన్నాడు.

"గెల్చి తీరతాంరా.. నాలుక్కల్లా దుర్గ గుడి ఎంట్రన్స్ దగ్గర లేకపోతే నేను గుండు చేయించుకుంటా" అన్నాడు ఎర్ర చొక్కా యమా కాన్ఫిడెంట్‌గా.

బండి వేగానికి తగ్గట్లే పిచ్చిగాలి వీస్తోంది. అయినా ఎంతమాత్రం లెక్కచేయకుండా బండి దూసుకుపోతోంది. ఇంతలో వెనకూర్చున్న బ్లూ చొక్కా కుర్రాడి టోపీ ఎగిరెళ్ళి పక్కనున్న తుప్పల్లో పడింది.

"ఒరేయ్ బండి ఆపరా.. నా హ్యాట్ పడిపోయింది.." అంటూ గావుకేక పెట్టాడు బ్లూ చొక్కా.

"నథింగ్ డూయింగ్.. హ్యాట్ కాదు.. దాంతోబాటు బ్రెయిన్ కూడా పడిపోయినా బండి ఆపే సమస్యే లేదు" అన్నాడు ఎర్ర చొక్కా.

"నీ కాళ్ళకి దణ్ణం పెడ్తారా బాబూ.. నా టోపీ పడిపోయింది"

"నీ యవ్వ.. వెధవ టోపీ పోతే పోయింది.. అలాంటివి వెయ్యి కొనిపెడ్తా"

"వెయ్యి కాదు, లక్ష కొనిచ్చినా అక్కర్లా.. అది నా లక్కీ హ్యాట్ రా.."

"అరే బ్రెయిన్‌లెస్ ఫూల్.. హ్యాట్ కోసం ఆగితే టైం వేస్టయిపోతుందిరా.. అర్థం చేసుకో.. కావాలంటే వచ్చేటప్పుడు రెండుగంటలు ఆపుతాను"

"అందాకా నా హ్యాట్ అక్కడే వుంటుందా? ఇదేం దుబాయనుకున్నావా.. ఇతర్ల సొమ్ముని ఎవరూ ముట్టుకోకపోడానికి"

"అబ్బో.. అది బంగారపు సుద్దయ్యో.. ఎవడో ఒకడు ఎగరేసుకుపోవడానికి.. నీ చెత్త టోపీని ఎవడూ ముట్టుకోడుగాని గమ్మునుండు"

"నన్నేమన్నా అను.. నా టోపీని మట్టుకు అనకు.. దానిమీద నమ్మకంతోనే నేనీ పందెం కాశాను"

"అంతలేదులే.. అయితే ఇప్పుడు మళ్ళీ బెట్.. నువ్వాటోపీ పెట్టుకోకపోయినా నేను చెప్పిన టైంకి అక్కడికి రీచ్ అయి చూపిస్తాను"

"ప్లీజ్‌రా.. నాక్కలిసొచ్చిన టోపీని నేనొదులుకోను.. ఒక్కసారి బండాపు.. నేను దిగిపోతాను.. నా టోపీతో నేను వెనక్కెళ్ళిపోతాను.."

"ఏంటీ.. నువ్వు రావా విజయవాడ? "

"నీకు టైం సేవ్ అవుతుంది.. నన్ను దింపి నువ్వెళ్ళు.. మాట్లాడ్తూనే అరకిలోమీటరు ముందుకు తెచ్చావు"

"ఛట్.. నీ అంత చాదస్తప్పినుగని నేనెక్కడా చూళ్ళేదు.." గొణుక్కుంటూ ఎర్ర చొక్కావాడు బండి పక్కకి ఆపాడు. బ్లూచొక్కా కుర్రాడు రోడ్డు పక్కనున్న గుబురైన పొదల్లో తన టోపీ కోసం గాలిస్తున్నాడు.

అల్లంతదూరంలో బ్లూ రంగు కనిపించగా "నా లక్కీ హ్యాట్ అంత దూరంలో పడిందేంటిరా? " అన్నాడు.

"ఇంకోసారి లక్కీహ్యాట్ అన్నావంటే నిన్ను కూడా ఆ ముళ్ళ కంపల్లోకి విసిరేస్తా జాగ్రత్త.. అది నిజంగానే లక్కీ హ్యాట్ అయితే ఇలా పడిపోయి టైం వేస్టయ్యేట్టు చేస్తుందా? "

"ఇది మరీ బాగుందిరా.. శాడిస్టు గాలి దాన్ని పడేస్తే, అది మాత్రం ఏం

చేస్తుంది? "

'ఏడ్చావులే.. నత్తలా కాకుండా జింకలా వెళ్ళి త్వరగా తీసుకురా"

"అదేం ఏర్‌పోర్టులో రన్‌వేలా వుందను కున్నావా.. ముళ్లూ రాళ్ళతో అధ్వాన్నంగా వుంది"

"షూస్ ఉన్నాయిగా.. గుచ్చుకోవు కానీ, నస పెట్టకుండా తొందరగా తే"

ఇంకో రెండడుగులు వేశాడో లేదో.. కీచుగొంతు పెట్టి.. "ఒరేయ్ అది నా టోపీ కాదురా.. ఏదో శవం ఉన్నట్టుంది" అరిచాడు బ్లూచొక్కా.

ఎర్రచొక్కావాడు ఉలిక్కిపడి "ఏంటీ.." అన్నాడు.

"అవున్రోయ్ శవమే.. చూడు.. చూడు" అన్నాడు బ్లూ చొక్కా కుర్రాడు.

అప్పటిదాకా అసహనంగా ఉన్న ఎర్ర చొక్కావాడు కాస్తా ఒక్కుదుటున రోడ్డుదిగి అవతలికెళ్ళి తొంగి చూశాడు.

"నిజమేన్రోయ్! ఎవరో చంపి శవాన్నిక్కడ విసిరేసి పోయినట్టున్నారు.. మన కెందుకొచ్చింది గోల.. రారా బాబూ.. నీ టోపీనీ నిన్నూ తగలెయ్య.. లేనిపోని ఫిట్టింగ్ పెట్టి వెనక్కి లాక్కొచ్చావు.. ఈపాటికి పాతిక కిలోమీటర్లయినా లాగిం చేవాణ్ణి"

"ఎవర్నో చంపేశార్రా.. శవాన్ని చూసి కూడా చూడనట్లు వెళ్లిపోవడం పద్ధతా? "

"పద్ధతుల గురించి నాకు చెప్పకు.. తిక్క రేగుతుంది.. వాడేమన్నా మీ అమ్మ తమ్ముడా? మా అమ్మ తమ్ముడా? "

"కాకపోతే ఏంట్రా.. ఒక మనిషేగా.. కాస్తయినా మానవత్వం వుండాలి కదరా!"

"మానవత్వమా మాగాయతొక్కా.. గాలికి పోయేదాన్ని కాళ్ళకి తగిలించుకోకూడదు"

"పాపం అనిపిస్తోందిరా.. ఈయనెవరో గానీ ఇక్కడ శవమై పడున్నాడని వాళ్ళింట్లో తెలీదుగా.. ఫోనేమైనా వుందేమో.. వాళ్ళ వాళ్ళకి తెలియజేద్దాం"

"నీకేం పిచ్చి పట్టిందా? మనం వెళ్తున్న పనేంటి? ఈ శవం కోసం వచ్చామా ఏంటి? "

"అలా అనకురా.. ఏ నిమిషానికి ఎవ రికి ఏం జరుగుతుందో తెలీదు.. అసలు నా లక్కీ హ్యాట్ ఈ శవాన్ని చూపించడం కోసమే పడిపోయుంటుంది.."

"ఓరి దేవుడో.. అసలు నేనొక్కణ్ణే పోవా ల్సింది"

"పోరా, ఇప్పుడు ఫో.. నేనిక్కడ ఆగిపో తాను.. నువ్వెళ్ళు"

ఎర్రచొక్కాకి ముందు తగని చిరాకే సింది. ఆనక మానవత్వం తొంగి చూసింది. నిజమే కదా. అతనెవరో కానీ చాలా హుందాగా, పెద్దమనిషి తరహాగా వున్నాడు.. పోటీదేముంది.. మళ్ళీ ఇంకో సారి పెట్టుకోవచ్చు ఈ శవాన్ని ఇలాగే వదిలేసి వెళ్తే.. తర్వాత తానెంత రాక్ష సంగా వ్యవహరించానా అని గుర్తొచ్చినప్పు డల్లా బాధేస్తుంది. వాడన్నట్టుగా టోపీ నిజంగానే ఆ శవాన్ని చూపించడం కోసమే పడిపోయి వుంటుంది. మరి, తాను కూడా మనిషిలా ప్రవర్తించాలి కదా- అనుకునేస రికి అతనికి సిగ్గేసింది. వెంటనే ఆవేశ మంతా మటుమాయమైపోయింది. ప్రశాం తత ఆవరించింది. ఆపైన ఆ శవం ఎవ రిదా, ఏ కిరాతకులు హతమార్చి అలా రోడ్డు పక్కన పడేసి వెళ్ళారా అని ఆదుర్దా కలిగింది. ఆందోళన ఆవరించింది.

"ఒరేయ్ రాజూ.. నేనూ వస్తున్నా వుండు" అన్నాడు.

ఇందాకటి చిరాకు, కఠినత్వం లేకుండా మృదువుగా మాట్లాడేసరికి రాజు హమ్మయ్య అనుకుని మిత్రుడికోసం ఆగాడు.

"థాంక్యూరా వేణూ! ఈ జర్నీ నావల్లే ఆగిపోయిందని ఫోన్ చేసి చెప్తారా.. ఎగ

తాళి చేస్తే నన్నే చేస్తారు.. కావాలంటే ఈసారి ముంబయికి పోటీ పెట్టుకుందాం" అన్నాడు.

"సర్లే.. ముందు శవం గురించి ఆలోచించు"

"జేబులో మొబైల్ వుందేమో చూసి ఆయన ఇంట్లోవాళ్లకి కబురు చేద్దామా? "

"అంత తెలివి తక్కువ పని చేయకు.."

"అదేంటిరా.. మరి, అతని ముఖాన వాళ్ళ ఇంటి నంబర్ రాసుంటుందేంటి? "

"అరే, టోపీతో బాటు మెదడు కూడా దొబ్బిందా ఏంటి.. శవం మీద ఫింగర్ ప్రింట్స్ పడకూడదు.. పడితే.. మనమే హత్య చేశామని ఆరోపించినా ఆశ్చర్యం లేదు.. ఆపాటి బేసిక్స్ కూడా తెలీవా? "

"వామ్మో.. నిజమేర్రోయ్.. మరేం చేద్దాం..? "

"ముందు పోలీసులకి ఇన్ఫాం చేద్దాం"

"కొంపతీసి అప్పుడు కూడా మనల్ని అనుమానించరు కదా? "

"విషయం చెబుదాం.. మనమిలా పోటీ పెట్టుకుని బెజవాడ వెళ్తోంటే.."

"పోటీ గురించి వద్దురోయ్.. ఊరికే విజయవాడ వెళ్తున్నామని చెబుదాం.."

"ఏం.. పోటీ పెట్టుకుంటే పోలీసోళ్ళకి నష్టమేంటి? "

"ఇలాంటి చెత్తపోటీల వల్లే యాక్సిడెంట్లవుతున్నాయని నాలుగు పీకినా పీకుతారు.."

"అవున్రోయ్.. పోలీసుద్యోగం అంటేనే పబ్లిక్ని కొట్టడానికి లైసెన్స్ ఇచ్చినట్లు.."

"ముందు కంట్రోల్ రూంకి ఫోన్ చేసి విషయం చెబుదామా? "

"ఔనౌను.. చెప్పు"

రాజు కంట్రోల్ రూంకి ఫోన్ చేసి టూకీగా విషయం చెప్పాడు.

తాపీగా రెండు గంటల తర్వాత పోలీసు జీపు వచ్చి ఆగింది. అందులోంచి దిగారు నలుగురు పోలీసులు. వస్తూనే తెగ హడావిడి చేశారు.

ముందు రకరకాల యాంగిల్స్లో శవాన్ని, పరిసరాల్ని ఫొటోలు తీశారు. ఆనక ఏదో పౌడర్ శవమ్మీద జల్లారు.

ఒక పోలీసు స్క్రిబ్లింగ్ ప్యాడ్మీద శవం వంటిమీదున్న దుస్తుల రంగులు మొదలు అనేక విషయాలు బరబరా రాసుకున్నాడు.

సెల్ఫోను, టెలిఫోను ఇండెక్స్ లాంటి వేమైనా దొరుకుతాయేమోనని గ్లోవ్స్ తొడుక్కున్న చేత్తో షర్టు, ప్యాంటు జేబులు వెతికి చూశారు. కానీ, మొబైల్ ఫోన్ కాదుగదా, అతని జేబుల్లో చిన్న కాగితం ముక్క కూడా దొరకలేదు.

శరీరం మీద రక్తపు మరకలు గానీ, కత్తిపోట్లు, గోరు, పంటి గాట్లు గానీ, వెంట్రుకలు లాంటివేమీ లేవు.

"ఆయుధాలు ఏమీ ఉపయోగించలేదు. ఊపిరాడకుండా చేసి చంపారు.." అన్నాడు హెడ్ కానిస్టేబుల్.

పోలీసులు వివరాలు రాసుకుని, ఫొటోలు తీయడం ముగిశాక అంబులెన్స్కి ఫోన్చేసి, దాని రాకకోసం ఎదురుచూస్తున్నారు. హైవేపై పోలీసు వ్యాను కనిపించడంతో ఆ రోడ్డున వెళ్తున్న వాళ్ళు ఒక నిమిషం ఆగి, శవాన్ని చూసి ఆశ్చర్యం, ఆందోళన కళ్ళలో నింపుకుని వెళ్తున్నారు.

అలా వెళ్తోన్న బాటసారుల్లో రమణారావు ఒకడు. అతనూ అందర్లాగే అక్కడేం జరుగుతోందా అని కారాపాడు. తీరా శవాన్ని చూడగానే గంపెడు ఆశ్చర్యంతో "అరే రామ్మోహన్.. ఎవరు చంపారు? " అంటూ లబలబలాడాడు.

మరీ ప్రయాస పడకుండానే క్లూ దొరికినందుకు సంతోషించిన పోలీసులు "ఏ రామ్మోహన్? " అంటూ మొదలుపెట్టి వివరాలన్నీ సేకరించారు.

# చుంబన పోటీలో రికార్డ్!

మారథాన్ అంటే పరుగుపందెం. చుంబించడం మీద పెట్టే పందేనికి కిస్‌థాన్ అనే పేరు. 2011 ఫిబ్రవరి 14న వేలంటైన్స్ డే సందర్భంగా థాయ్‌ల్యాండ్‌లోని పట్టాయ బీచ్‌లో చుంబనపోటీని నిర్వహించారు. ఆ ఆదివారం ఉదయం ఆరు గంటలకు మొదలైన ఈ పోటీలో పద్నాలుగు జంటలు పాల్గొన్నాయి. మర్నాడు సోమవారం మధ్యాహ్నానికల్లా సగం జంటలు అలసిపోయి పోటీనుంచి విరమించుకున్నాయి. చివరికి నలభైఆరు గంటల ఇరవై నాలుగు నిమిషాల తొమ్మిది క్షణాల సేపు ఒకరినొకరు చుంబించుకుంటూనే ఉన్న ఓ థాయ్ జంట ఆ పోటీలో గెలుపొందింది.



ఈ పోటీలో పాల్గొనే జంటలు చుంబిస్తూనే ఆహారాన్ని స్ట్రాతో తీసుకోవాల్సివుంటుంది. బాత్‌రూంకి కూడా చుంబిస్తూనే వెళ్లాలి. రిఫరీ వారి పెదాలు విడిపడలేదని చూడటానికి వారిని బాత్‌రూంలోకి కూడా అనుసరిస్తాడు. కాబట్టి ఇంది రొమాంటిక్ పోటీగా అనిపించినా నిజానికి అత్యంత కష్టమైన, క్లిష్టమైన పోటీ అనే చెప్పాలి. ఇందులో గెలుపొందిన జంటకు లక్ష బాత్‌లు (సుమారు లక్షాఅరవై ఏడువేల రూపాయలు), హోటల్‌లో బస చేసేందుకు రెండు లక్షల బాత్‌ల విలువ గల కూపన్లు ఇస్తారు. ఈ పోటీని 'రిప్‌లేస్ బిలీవిట్ ఆర్ నాట్' అనే అద్భుత విషయాలను సేకరించే సంస్థ ప్రతి ఏటా ఓ దేశంలో ఆ రోజున నిర్వహిస్తూవుంటుంది.

2011 గిన్నీస్ బుక్ ఆఫ్ వరల్డ్ రికార్డ్స్ పుస్తకంలోకి ఈ జంట ఎక్కింది. 2009లో ఓ జర్మన్ జంట ముప్ఫైఆరు గంటలు చుంబించి గిన్నీస్ బుక్‌లోకి ఎక్కింది. ఆ రికార్డును ఈ థాయ్ జంట బద్దలు కొట్టింది.

# మరణమృదంగం!

మరణం గురించిన కొన్ని అరుదైన, అద్భుతమైన విశేషాలు ఇవీ...

★ ఏటా విమాన ప్రమాదాల్లో కంటే గాడిదలు తన్నడంవల్ల చనిపోయే వారే అధికమట.



★ సముద్రంలోని షార్క్ చేపలవల్ల మరణించేవారికన్నా చెట్టుపై నుంచి రాలిపడే కొబ్బరి బోండాల వల్ల కన్నుమూసేవాళ్లే అధికం. అలా ఏటా 150 మంది చస్తున్నారట.

★ సాలెపురుగు కుట్టి మరణించేవారికంటే షాంపేన్‌బాటిల్ మూత తెరచినప్పుడు ఒత్తిడికి వేగంగా వచ్చి తాకి మరణించే వారే అధికం.

★ అన్ని యుద్ధాల్లోనూ నేలకొరిగినవారికంటే దోమలు, ఎలుకల వల్ల వ్యాధులతో ఎక్కువ మంది చచ్చారు. దోమకాటువల్ల జంతువులకంటే మనుషులే అధికంగా మరణిస్తున్నారు.




★ పొరపాటున ఆయుధం పేలి మరణించేవారికంటే ఐదురెట్లు వైద్యుల నిర్లక్ష్యంవల్ల చనిపోతున్నార్ట.

★ ఏటా వందమంది గొంతుకు బాల్‌పెన్ అడ్డుపడి చనిపోతున్నారు.

★ నూరేళ్ల క్రితం అమెరికాలో సగటు ఆయుర్దాయం 47. ఇప్పుడది 67కు పెరిగింది.

★ ప్రస్తుతం ప్రతినూరు కోట్ల మందిలో కేవలం ఇద్దరే 116 ఏళ్లు జీవిస్తున్నారు.

★ అబ్రహాంలింకన్ కొడుకు రాబర్ట్‌టాడ్ అమెరికా అధ్యక్షులు లింకన్, గార్‌ఫీల్డ్, మేక్‌కిన్లేలను దుండగులు తుపాకితో కాల్చి చంపినప్పుడు వారి సమక్షంలోనే ఉన్నాడు. ఆ తర్వాత ఆయన అధ్యక్షుల సమావేశాలకు వెళ్లడం మానుకున్నాడట.

ఆ శవం 'అలకనంద' జువెలరీ షాప్ ఓనర్ రామ్మోహన్‌ది అని తెలియగానే పోలీసులు మరీ ఆశ్చర్యపోయారు.

రమణారావు దగ్గర రామ్మోహన్ ఫోన్ నంబర్లు తీసుకున్నారు. అపనమ్మకంతోనే మొదట రామ్మోహన్ నంబర్‌కి డయల్ చేశారు. ఫోన్ స్విచాఫ్ చేసినట్లు రికార్డ్ వాయిస్ వచ్చింది. వెంటనే అతని షాపు నంబర్‌కి, రెసిడెన్షియల్ నంబర్‌కి ఫోన్ చేసి సమాచారం అందించారు. డెడ్‌బాడీని గాంధీ హాస్పిటల్ మార్చురీకి తీసికెళ్తున్నామని కూడా చెప్పారు.

రమణారావు నమ్మలేని నిజాన్ని కళ్ళల్లో నింపుకుని దిగులు ముఖంతో కారు స్టార్ట్ చేశాడు.

> **కొత్తగాలి...**
>
> **చరిత్రలో చెమట**
> **ఒక అంతర్వాహిని!**
> **శ్రమజీవుల దేహం**
> **నిత్యం మండే కొలిమి!**
>
> – పి.వి. రమణకుమార్,
> చిలకలూరి పేట

★ ★ ★

'అలకనంద' జువెలరీ షాపు మేనేజర్ ప్రసాదు, డిజైనర్ పండరి, రామ్మోహన్ భార్య సునంద, ఆమె తండ్రి శంకరం రెండు కార్లలో గాంధీ ఆసుపత్రికి చేరుకున్నారు.

పోలీసులు వాళ్ళందర్నీ ప్రశ్నించి అనేక విషయాలు తెలుసుకున్నారు. కొన్ని అంశాలు రాసుకున్నారు. అవసరమైన సమాచారం కోసం తాము మళ్ళీ వచ్చి అందరితో మాట్లాడ్తామని, కో-ఆపరేట్ చెయ్యాలని చెప్పారు.

పోస్ట్‌మార్టం అయ్యేసరికి రాత్రి పదవుతుందని.. అదంతా అయ్యాక, మరుసటి రోజు ఉదయాన డెడ్‌బాడీ పంపిస్తామని చెప్పారు.

అందరి ముఖాలూ విషాదంతో జేవురించాయి. సునంద అయితే జీవచ్ఛవంలా అయిపోయింది.

అక్కడుండి చేసేదేం లేదు కనుక రామ్మోహన్ శవాన్ని వదిలేసి అందరూ బయల్దేరారు.

★ ★ ★

పోలీసులు చూపుమాత్రంతో గ్రహించిన అంశాన్ని పోస్ట్‌మార్టం రిపోర్ట్ నిర్ధారించింది. రామ్మోహన్ని మధ్యాహ్నం పన్నెండు గంటల ప్రాంతంలో హతమార్చారు. మెడను తిన్నగా తాడుతో కాకుండా తాడుకు బట్ట చుట్టి బిగదీసి చంపారు. హత్య చేసేటప్పుడు అరవకుండా నోట్లో బట్టలు కూరారు. బహుశా హంతకుడు ఒక్కడైతే అతను తీవ్రంగా పెనుగులాడేవాడు. ఆ ఘర్షణలో గాట్లు అయ్యేవి. హంతకుడి రక్తపు నమూనా దొరికేది. కానీ, ఇద్దరు హంతకులు కలిసి హత్య చేశారు. తమకు సంబంధించిన ఏ ఆధారాలూ దొరక్కుండా జాగ్రత్తపడ్డారు.

శవం దరిదాపుల్లోగానీ, శవమ్మీదగానీ కనీసం ఫింగర్ ప్రింట్స్ కూడా లభించలేదు. అంటే చేతులకు గ్లోవ్స్ ధరించారు. సమయానికి రమణారావు అటుగా రావడంతో, రామ్మోహన్ శవం అని తెలిగ్గానే గుర్తించినా హంతకుల ఆచూకీ మాత్రం అంత తేలిగ్గా దొరకలేదు. తల పండిన ప్రొఫెషనల్ కిల్లర్స్ చేసిన ఘాతుకమని స్పష్టమవుతోంది.

హత్య చేసింది కచ్చితంగా కిరాయి హంతకులే. కానీ, హత్య చేయించింది ఎవరు?

★ ★ ★

రామ్మోహన్ హత్య కేసు దర్యాప్తు మొదలైంది.

పోలీస్ ఇన్‌స్పెక్టర్ బోసు ముందుగా 'అలకనంద' జువెలరీ షాపుకు వెళ్ళాడు.

మేనేజర్ ప్రసాద్ ఎదురొచ్చి సాదరంగా తన టేబుల్ దగ్గరికి తీసికెళ్ళాడు. కూల్ డ్రింక్ తెప్పించాడు.

"మీ అనుమానం ఎవరిమీద? " అడిగాడు బోసు.

"ఎవరిమీదా అనుమానం లేదు" అన్నాడు ప్రసాద్.

"అంటే ఆయనకి శత్రువులెవరూ లేరా? "

"లేరు.. చనిపోయారని చెప్పడం కాదండీ.. సార్ మెత్తటి మనిషి.. ఎవ్వర్తో ఆయనకి విరోధం లేదు"

"వ్యాపారం అన్న తర్వాత విరోధుల్లేకుండా వుంటారా? ఎవరో దారినపోయే దానయ్యా కాలక్షేపానికి చంపాడా? ఎందుకయ్యా చెవుల్లో క్యాలీఫ్లవర్లు పెట్టాలని చూస్తారు.. నేను పోలీసోణ్ణి.. కాకమ్మ కథలు వినడానికి రాలేదని మర్చిపోవద్దు"

ప్రసాద్ ముఖం చిన్నబోయింది. ఉక్రోషంగా చూశాడు. గట్టిగా సమాధానం చెప్పలేక కాదు, పోలీస్ పవర్‌కి వెరుస్తున్నాడంతే. ఆ వెరపుతోనే "నన్ను నమ్మండి సార్.. మీకు సహకరించకూడదని కాదు.. నిజంగా ఆయనకెవరూ విరోధుల్లేరు. రామ్మోహన్‌గారితో గొడవ పెట్టుకున్నవారు ఒక్కరూ లేరు.." అన్నాడు.

ప్రసాద్ మాటల్లో కనిపించిన నిజాయితీకి ఇక బోసు రెట్టించలేదు.

"ఆయన లౌక్యం తెలిసిన పెద్దమనిషండీ. దేన్నయినా సానుకూలంగా పరిష్కరించుకుంటారు. కట్టె విరక్కుండా పామును చంపుతారంటారు చూశారా.. అలా గొడవ జరక్కుండానే సమస్యను చక్కబెట్టే స్వభావం"

"అంటే మెత్తటి కత్తా? "

"అయ్యయ్యో.. నా ఉద్దేశం అది కాదు"

"మరి అతన్ని చంపాల్సిన అవసరం ఎవరికొచ్చింది? "

"దోపిడీ దొంగలెవరో డబ్బుకోసం హత మార్చి వుంటారండీ"

"ఇది దోపిడీ దొంగలు చేసిన హత్య కాదు. అంతవరకూ కచ్చితం.. ఇంతకీ నిన్న ఆయన దగ్గర ఎంత క్యాష్ వుంది.. మీకేమైనా తెలుసా? "

"నాకు తెల్సి.. ఎకౌంట్‌లోంచి లక్షా ఇరవైవేలు తీసుకున్నారండీ.. అది కాకుండా ఆయన దగ్గర ఎంతుందో తెలీదు.. ఆంధ్రా బ్యాంక్, కెనరా బ్యాంక్, స్టేట్ బ్యాంకులకి సంబంధించిన క్రెడిట్, డెబిట్ కార్డులు ఆయన జేబులో వుండాలి. అవి బహుశా మీరు భద్రపరిచారేమో తెలీదు.."

"లేదు.. కార్డులు, కరెన్సీ నోట్లు కాదు కదా ఒక సెంటీమీటరు పేపరు కూడా లేదు. వేసుకున్న బట్టలు తప్ప శవమ్మీద మరేమీ లేవు.."

"ఆయన చేతికి గోల్డెన్ వాచి.. మెడలో గోల్డ్ చెయిను వుండాలండీ.."

"మీ పిచ్చికాకపోతే చంపేశాక అలాంటి ఖరీదైనవి వుంచుతారటయ్యా? !"

నిజమే, తెలివితక్కువగా మాట్లాడానన్నట్టు చూశాడు ప్రసాద్.

"సరే.. తాజాగా జరిగిన లావాదేవీలు, ఇచ్చిపుచ్చుకున్న సొమ్ము వివరాలు క్లియర్‌గా తెలుసుకోండి.. ముందు వెంటనే ఏయే బ్యాంకుల్లో ఎకౌంటుందో వాటికి ఫోన్ చేసి గత పదిహేను రోజుల్నుంచి నిన్న చనిపోయే క్షణం వరకూ ఆయన పర్సనల్‌గా లేదా కార్డుల సాయంతో ఎంతెంత డ్రా చేసింది తెలుసుకోండి. ఇకపై క్రెడిట్ కార్డులు వాడకుండా స్టాప్ చేయమని చెప్పండి. ఆ స్టేట్‌మెంట్లు తెప్పించి వుంచండి.. అవసరమైన వివ

రాలు ఎప్పటికప్పుడు నాకు తెలియజేస్తూ వుండండి"

"అలాగేనండీ"

"నిన్న ఆయన తన కారులో ఎందుకు వెళ్ళలేదు? "

"నిన్న డ్రైవర్ ఒంట్లో బాగాలేదని రాలేదు సార్"

"డ్రైవర్ రాలేదా? " ఆశ్చర్యంగా అడిగాడు.

అనుమానం ఎక్కడ డ్రైవర్ మీదికి దారి తీస్తుందోనని "వాడికప్పుడప్పుడూ ఒంట్లో బాగోదండీ.. నిన్న కూడా అలాగే.."

"అంత రోగిష్టోణ్ణి డ్రైవర్‌గా ఎందుకు పెట్టుకున్నారు? "

ప్రసాద్ జంకాడు. ఏం మాట్లాడ్తే ఏం కొంప మునుగుతుందో.. అనవసరంగా ఆ అక్కుపక్షిని ఇరికించినట్టవుతుందని "ఏమో నండీ.. అతను సార్‌కి దూరపు బంధువుల కుర్రాడు.. అందుకని కాస్త విసుక్కోవడమే తప్ప ఎప్పుడూ పనిలోంచి పీకేస్తానన్లేదు" అన్నాడు.

ఈ విషయమై ఇతన్ని అడిగి లాభం లేదనుకున్న బోసు "ఆయనకి డ్రైవింగ్ రాదా? డ్రైవర్ రానప్పుడల్లా కారు లేకుండానే వెళ్ళేవారా? " అనడిగాడు.

"ఆయనకి డ్రైవింగ్ రాకపోవటమేంటండీ? ఎక్సలెంట్‌గా డ్రైవ్ చేసేవారు"

"మరి, నిన్న తన కారెందుకు తీయలేదు? "

"సమయానికి ఆయన ఫ్రెండు నరసింహం గారొచ్చారు. ఇద్దరూ కలిసి వెళ్ళారు."

కొత్త క్లూ దొరకడంతో బోసు కళ్ళు మెరిసాయి.

వెంటనే నరసింహం ఫోన్ నెంబరు, అడ్రసు తీసుకున్నాడు.

నరసింహం గ్రానైట్స్ వ్యాపారి. బాగా డబ్బున్నవాడు.

బోసు ఫోన్లో తనను తాను పరిచయం చేసుకుని, అరగంటలో వస్తున్నానని, ఎక్కడికీ వెళ్ళొద్దని చెప్పి అక్కడికి వెళ్ళాడు.

దారిలో వుండగానే రామ్మోహన్ దగ్గర డ్రైవర్‌గా చేసిన వీర్రాజును వెంటనే అదుపులోకి తీసుకోమని స్టేషన్‌కి ఫోన్ చేసి చెప్పాడు.

రామ్మోహన్ మరణవార్త విని అప్పటికే ఖంగుతిని ఉన్నాడు నరసింహం.

బోసు తన పోలీసు డౌట్లన్నీ తీర్చుకున్నాడు.

"మిమ్మల్ని డిస్టర్బ్ చేస్తున్నందుకు సారీ.. ఒక పోలీసుగా నా డ్యూటీ నేను చేయాలి. దయచేసి కో-ఆపరేట్ చేయండి" అన్నాడు బోసు.

నరసింహం పెద్ద మనిషి తరహాగా "నో ప్రాబ్లం.. అడగండి.. నాకు తెలిసిందంతా చెప్తాను.. రామ్మోహన్ని చంపేశారంటే ఇంకా నమ్మశక్యంగా లేదు.. నిన్న అనుకోకుండా కలిశాం. అదే ఆఖరి కలయిక అవుతుందని తెలీదు" అన్నాడు.

"ఇఫ్ యూ డోంట్ మైండ్.. నిన్న మీరు ఏ టైంలో కలిశారు? ఎందుక్కలిశారు? ఐ మీన్.. ఏదైనా ప్రత్యేకమైన పని వుందా లేక..? !"

"అబ్బే, పనేం లేదు. నిన్న పొద్దున పదిన్నరకి ఎస్సార్‌నగర్ మీదుగా వెళ్తున్నాను. మెయిన్‌రోడ్డుమీదే షాపుకదా.. షాపు తెరిచి వుండటంతో చాలా రోజులైంది. కాసేపు రామ్మోహన్‌తో మాట్లాడి వెళ్దామని కారు ఆపించి షాపుకు వెళ్ళాను"

"షాపులో ఎంతసేపు ఉన్నారు? "

"మహా అయితే పది నిమిషాలు.."

"తర్వాత? "

"ఇక నే వెళ్తానయ్యా.. మెహదీపట్నం వెళ్ళాలి.. అన్నాను"

"తన డ్రైవర్ రాలేదని చెప్పి ఆశయా హోటల్లో చిన్న పని వుందని.. అక్కడ

దింపమని అడిగాడు"

"మీరు మెహదీపట్నం వెళ్ళాలంటే మైత్రీ వనం పంజగుట్ట దగ్గర్నించి కదా వెళ్ళాలి.. మరి ఆశయా హోటలేమో లక్డీకాపూల్.." అంటూ సందిగ్ధంగా అడిగాడు బోసు.

నరసింహంకి పిచ్చ కోపం వచ్చింది.

"నాదేమైనా సిటీ బస్సా, ఈ రూట్లో ఇలాగే వెళ్తానని చెప్పడానికి? మిత్రుడు డ్రాప్ చేయమని అడిగితే ఆమాత్రం చుట్టూ తిరిగి వెళ్లమా? "

"అది కాదండీ.."

"చూడండి.. నా మిత్రుడు చనిపోతాడని ముందే తెలిస్తే... నాకే గనుక అంత సిక్స్ సెన్స్ వుంటే -ఇవాళ నువ్వెక్కడికీ వెళ్ళొద్దయ్యా- అని చెప్పేవాణ్ణి. మృత్యువు వాడికోసం కోరలు చాచివుందని, కాసేపట్లో తిరిగిరాని లోకాలకి వెళ్తాడనీ నేను ఊహిం చగలనా? " చిరాకుని అణచిపెట్టుకుని బాధగా అన్నాడు నరసింహం.

"సారీ, మిమ్మల్ని ఇబ్బంది పెట్టాలనేది నా ఇంటెన్షన్ కాదు.. మీరంతా సహక రించి అడిగిన ప్రశ్నలన్నిటికీ ఓపిగ్గా సమా ధానం చెప్తేనే మా పని సులువవుతుంది.. హంతకులని త్వరగా పట్టుకోగల్గుతాం.."

"ఊ.. అడగండి"

"అసలు నిన్న ఆయన తన కారెందుకు తీయలేదు? ఆయనకి డ్రైవింగ్ వచ్చుట కదా? "

"అది నేనెలా చెప్పగలను? ఎవరికి ఎప్పుడు ఎలాంటి బుద్ధి పుడుతుందో మన ఊహలకి అందుతుందా? నేను అటే వెళ్త న్నాను కనుక నన్ను అడిగాడనుకున్నాను"

"నిజమే కానీ, మీరు దింపేసి వెళ్లిపోతే రావడం ఎలా? ఆటోల్లో తిరిగే అలవాటు లేదు కదా? "

"ఎవర్నో కలవడానికి వెళ్తున్నాడు కదా.. ఆ ఫ్రెండ్ దిగబెట్తాడనుకున్నాడేమో!"

"ఎవర్ని కలవడానికి వెళ్తున్నదీ మీకు చెప్పలేదా? "

"ఆశయా హోటల్లో ఎవర్నో కలవాలి అన్నాడేగానీ.. అది ఎవరో అతనూ చెప్ప లేదు, నేనూ అడగలేదు.."

"ఆ కలవాల్సిన వాళ్ళెవరో ఆశయాలో దిగారని చెప్పారా? "

నరసింహం క్షణం కళ్లు మూసుకుని నిన్న జరిగింది గుర్తు చేసుకోవడానికి ప్రయత్నించి "ఆశయా హోటల్లో కలవాలి అన్నాడే గానీ, అందులో దిగారా లేక మీటింగ్ పాయింట్‌గా పెట్టుకున్నారా అనే ది చెప్పలేదు. అసలు హోటల్లో కలిశారో లేక ల్యాండ్ మార్క్‌గా అక్కడ వెయిట్ చేయమని చెప్పి బయటే కలిశారో.. ఏదీ తెలీదు.."

"దారిలో ఏం మాట్లాడారు? ఏవైనా బిజినెస్ విషయాల గురించీ..? "

"అబ్బే లేదు.. మామూలు లోకాభిరా మాయణం.. అన్నట్లు.. మా వాడు స్టేట్స్ నుండి వస్తున్నాడని చెప్పినప్పుడు ఇంతకు ముందెప్పుడో జోక్ చేసిన సంగతి గుర్తుచే శాడు.. 'మా అమ్మాయిని కోడలిగా చేసు కుంటానన్నావు.. చరణ్ ఇప్పుడు గొప్ప ప్రయోజకుడయ్యాడు కదాని చెట్టెక్కి కూర్చోకు" అంటూ నవ్వేడు.

ఆ మాటలకి ప్రాధాన్యం ఇవ్వకుండా "ఏమైనా బిజినెస్ విషయాల్లో.. లేదా ఇత

## కొత్తగాలి...

**సంకీర్ణ ప్రభుత్వానికి**
**దినదిన గండం**
**అయిదేళ్ల ఆయుష్షు!**

**- తాజీప్రసాద్, చెన్నై**

రత్రా ఒత్తిడి ఫీలవుతున్నట్లు మీకనిపిం చిందా? "

"ఉహూ.. లేదు.. అలాంటిదేం నోటీస్ చేయలేదు"

"మీకు తెలిసి ఆయనకెవరైనా శత్రువు లున్నారా? "

"సిన్సియర్‌గా చెప్పాలంటే.. రామ్మోహ న్‌తో నాకు పరిచయం తక్కువే. అతని పర్సనల్ విషయాలన్నీ తెలిసేంత, తెలుసు కునేంత క్లోజ్‌నెస్ లేదు.."

బోసుకి ఇక అంతకంటే నరసింహంను అడగదగ్గదేం కనిపించలేదు. అందుకే సెలవు తీసుకుని వచ్చేశాడు. కానీ అతనితో మాట్లాడినందువల్ల ఒక్క విషయం రూఢీ అయింది. హంతకులు హోటల్ ఆశ యలో దిగి ఉండాలి, లేదా హోటల్ దగ్గర కలిసి ఉండాలి.

లంచ్ తర్వాత ఆశయకి వెళ్ళదలచి ముందు ఇంటికి వెళ్లాడు బోసు.

★ ★ ★

బోసును చూస్తూనే భార్య అరుణ భోజనం వడ్డించింది.

కొడుకు రాజా నవల చదువుతుండటం గమనించిన బోసు "యేరా, ఎగ్జామ్స్ టైంలో కూడా టెక్ట్స్ బుక్స్ పక్కన పడేసి డిటెక్టివ్ నవలలు చదువుతున్నావా? " అన్నాడు.

"ప్లీజ్ నాన్నా.. కొంచెమే ఉంది.. అయినా సిలబస్సంతా జ్యూస్ చేసుకుని తాగేశాగా.." అన్నాడు రాజా.

"ఏడ్చావులే.. గాంధీజీ, వివేకానంద లాంటి మహానుభావుల బయోగ్రఫీలు చద వక డిటెక్టివ్ నావెల్స్ చదువుతున్నావా? నీ వయసుకి అవి అవసరమా? "

"నాయనమ్మ చెప్పిందిలే.. నువ్వూ ఇవే చదివేవాడివట.. నాక్కూడా నీ అంతటి వాణ్ణి కావాలని ఆశ"

"ఏంట్రా గాడిదా? "

"నిజం నాన్నా.. చూస్తుండు.. నేను ఐ.పి.ఎస్. పాసై తీరతాను.. లేకపోతే దేశం ఏమైపోతుంది? "

"అంటే, డిటెక్టివ్ నవలలు చదివితే ఐ.పి.ఎస్. పాసవుతావా? "

"ఇది బేస్మెంట్ నాన్నా.. అసలు క్రిమి నల్స్ ఎలా ఉంటారు? నేరాలు ఎలా చేస్తారు? వాటినెలా కనిపెట్టాలి లాంటి విషయాలన్నీ వీటివల్ల తెల్సిపోతాయిగా" అన్నాడు రాజా.

కొడుకు చాలా తెలివైనవాడని బోసుకు తెలుసు. ఎప్పుడూ పాఠ్యపుస్తకాలు చదు వుతూ కనిపించడు. నవలలు చదువుతూ, థ్రిల్లర్ సినిమాలు చూస్తూ కనిపిస్తాడు. కానీ బ్రహ్మాండమైన మార్కులతో ఎప్పుడూ ఫస్ట్‌ర్యాంకే తెచ్చుకుంటాడు. అందుకే కొంచెం బనాయింపుగా మాట్లా డ్డమే తప్ప మరీ బెదిరించడు. అసలు అలాంటి అవసరమే రాదు. బోసుకి చాద స్తాలేమీ లేవు. కొన్ని రకాల బుక్స్ చదివితే పిల్లలు పాడైపోతారనుకోవడం హాస్యా స్పదం అనుకుంటాడు. అవి కేవలం కాల క్షేపపు రచనలని, వాటివల్ల మంచి అబ్బక పోగా హింసాప్రవృత్తి అబ్బుతుందని అపోహ పడ్తారు గానీ, నిజానికి దేన్న యినా రిసీవ్ చేసుకోవటంలోనే ఉంటుం దని నమ్ముతాడు.

బోసు కొడుకుతో వాదన వేసుకోకుండా భోజనానికి కూర్చున్నాడు. అతని మనసు రామ్మోహన్ హత్య చుట్టూనే తిరుగు తోంది.

ఇంతలో రాజా చదువుతున్న పుస్తకాన్ని టేబుల్‌మీద వదిలేసి డైనింగ్ టేబుల్ ఎదురుగా కూర్చున్నాడు.

"రేపేం ఎగ్జాం? " అడిగాడు బోసు.

"ఇంగ్లీష్‌లే గానీ.. నువ్వు టేకప్ చేసిన మర్డర్ కేస్ గురించి డీటెయిల్స్ ఏమైనా తెలిశాయా నాన్నా? " అన్నాడు.

"కేస్ ఇన్వెస్టిగేషన్లో ఉండగా ఏమీ చెప్ప కూడదు"

"పో.. నాన్నా.. టీవీ ఛానల్ వాళ్లకి చెప్పినట్లు చెప్తున్నావు.. నాదగ్గర రహ స్యాలా? నేనెళ్లి క్రిమినల్స్‌కి ఉప్పందిస్తానా ఏంటి? ఆ టీవీ వాళ్ళేమో ఈ మిస్టరీని ఛేదించడం మహా కష్టమన్నట్లు ఊదరగొ డ్తున్నారు.. నిజంగా హంతకులు దొరకరా ఏంటి? " ఆసక్తిగా అడిగాడు రాజా.

"దొరక్క ఎక్కడికి పోతారు? పోలీ సులు గాజులు తొడుక్కుని కూర్చోలేదు.. ఇంటర్‌పోల్ గురించి తెల్సుగా.. ఏడు సముద్రాల అవతల దాక్కున్నా లాక్కొస్తాం.. మా మార్గాలు మాకుంటా యిరా"

"నేను కూడా మీవాణ్ణే కద నాన్నా.. కేవలం వంశోద్ధారకుణ్ణే కాదు.. డిపార్ట్ మెంట్‌ని కూడా డెవలప్ చేయడానికి పుట్టాను"

బోసు తింటూ తింటూ నవ్వడంతో పొ ల మారింది. తలమీద చిన్నగా కొట్టుకుని మంచినీళ్ళు తాగుతోంటే అరుణ విసు క్కుంది.

"ఆయన్ని అన్నమైనా తిననిస్తావా? " అంది.

"అబ్బో నీకు కేవలం ఆయనేనమ్మా.. నాకు జన్మనిచ్చిన ఫాదరు.. డిపార్ట్‌మెంట్లో సీనియరు.."

"ఆ.. నీకు ఆషామాషీ అయిపోయింది. ఐ.పి.ఎస్ అంటే గచ్చకాయల ఆట కాదు, నాలుగు నవలలు చదివి, నాలుగు థ్రిల్లర్లు చూసి పోలీసాఫీసరైపోతావేంటి? "

"దిసీజ్ డ్యామేజింగ్ స్టేట్‌మెంట్.. దయచేసి వెంటనే విత్‌డ్రా చేసుకో.. నేను తెలిగ్గా నాలుగొందల నవలలు చదివి వుం టాను.."

"నోర్మూసుకుని వెళ్లి రేపటి సబ్జెక్టు చదు వుకో"

"ఇప్పటికే చాలా చదివాను.. ఇంకా చది వితే మెదడు వాపు వ్యాధి వచ్చేస్తుంది.. నువ్వు కాసేపు తండ్రీ కొడుకుల మధ్యలోకి రాకు.. లైక్.. కాఫీలో నలక.. పానకంలో పుడక"

"ఒరేయ్ చిచ్చరపిడుగా.. చాలా ఎక్కువ మాట్లాడ్తున్నావు"

"ఛఛ.. అతివాగుడు మా వంశంలోనే లేదమ్మా.. కావాలంటే మా నాన్ననడుగు"

"అంటే.. నువ్వూ, నీ బాబూ మాత్రమే ఒకటా.. మరి నేనేంటి.. నాదే వంశం? "

"నీక్కూడా కొంచెం చోటిస్తాంలే.. కానీ మా ఇద్దరి మధ్యా మాత్రం పుల్లలు పెట్టా లని చూడకు.. నాన్నా.. ముందు చెప్పు.. ఎలా ప్రొసీడ్ అవుతున్నావు? "

"ప్రొఫెషనల్ సీక్రెట్స్ చెప్పబడవు" అన డంతో రాజా రెట్టించలేదు.

★ ★ ★

రామ్మోహన్ని కారులోనే హత్య చేసి, కారు రోడ్డు పక్కన ఆపి శవాన్ని పడేసి పోయారు.

ఇదంతా నిజానికి రిస్కుతో కూడిన వ్యవహారం. హత్య జరిగింది పట్టపగలు. అదీ నడిరోడ్డుమీద. కారుకి సౌండ్ ప్రూఫ్ ఉండివుంటుంది.. కారులోంచి చప్పుడు బ యటికి వచ్చి ఉండదు.

కానీ ఏ ధీమాతో హంతకులు శవాన్ని

## కొత్తగాలి...

**'మే డే' శ్రామికులకు వరం!**
**అయితే వారి శ్రమంతా**
**పారిశ్రామికుల పరం...!!**

– వెల్మల రాంరెడ్డి,
పూడూరు, కరీంనగర్ జిల్లా

పట్టపగలు రోడ్డుమీంచి తీసికెళ్లి పడేయగలిగారు? అది అడవి కాదు.. హైవే.. ఏ క్షణమైనా ఏ వాహనమైనా వస్తూ వెళ్తూ ఉంటుంది. ఎవరైనా గమనిస్తారేమోననే సందేహం, భయం ఉండాలి కదా!

శవాన్ని పడేయడానికి ఇంతకంటే నిర్మానుష్యమైన ప్రదేశాన్ని ఎందుకు ఎంచుకోలేదు? అది బహుశా నేరగాళ్లకి ఇంకా చిక్కు సమస్య తెచ్చిపెట్టేదయ్యుంటుంది.

లక్ష్మీకాపూల్ ఆశయ హోటల్ రిసెప్షన్లోకి బోసు దారితీశాడు.

పోలీసు యూనిఫాం చూడగానే రిసెప్షనిస్టులు ఇద్దరూ వినయంగా లేచి నిల్చున్నారు.

ఏయే గదుల్లో ఎవరెవరు బస చేశారో గబగబా వివరాలు సేకరించాడు. క్రితం రోజు ఎవరెవరు రూములు ఖాళీ చేశారో తెలుసుకున్నాడు.

నార్మల్ టూరిస్టుల్లా కాకుండా ఎవరైనా తేడాగా కనిపించారా.. రహస్యాలు మాట్లాడుకోవడం, అనుమానాస్పదంగా వ్యవహరించడం కంటపడిందా.. ముంబై నుండి వచ్చినవాళ్లు ఎవరైనా ఉన్నారా.. లాంటి అనేక ప్రశ్నలు అడిగాడు.

తన దగ్గరున్న ఫైల్ తీసి "వీళ్లంతా క్రిమినల్స్.. వీళ్ళల్లో ఎవరైనా నిన్నా మొన్నా ఇక్కడేమైనా బస చేశారా? కొంచెం జాగ్రత్తగా చూసి చెప్పండి.. ఒక్క మాట.. నాకు సహకరించినంత మాత్రాన మీకేమైనా హాని జరుగుతుంది.. ఎవరైనా వచ్చి బెదిరిస్తారు లాంటి లేనిపోని భయాలు మాత్రం మనసులో పెట్టుకోవద్దు.." అంటూ చాలా సౌమ్యంగా, వాళ్లకు అర్థమయ్యేలా అడిగాడు ఇన్‌స్పెక్టర్ బోసు.

ఆ ఇద్దరు రిసెప్షనిస్టులూ నిజాయితీగా పరిశీలించి చూసి "లేదు.. ఇలాంటివాళ్ళని చూడలేదు" అనడంతో బోసు అక్కణ్ణించి వెనుతిరిగాడు.




రామ్మోహన్ హత్యకు గురైన రోజు, అంతకుముందు రోజు అతని దగ్గర ఎంత డబ్బుంది, ఎంత విత్‌డ్రా చేశాడు.. తదితర విషయాలు బ్యాంక్ స్టేట్‌మెంట్లతో సహా అలకనంద మేనేజర్ బోసుకి ఫాక్స్ చేశాడు. అంతా కలిపితే రెండున్నర లక్షల క్యాష్, మెడలో మూడు తులాల బంగారు గొలుసు, బంగారు రిస్టువాచీ చనిపోయే ముందు రామ్మోహన్ దగ్గరున్నాయి. కేవలం వాటికోసమే చంపే దొంగలు ఉండరని కాదు. పదివేలు కాజేయడానికి మర్డర్లు చేసేవాళ్లు కూడా ఉన్నారు. కానీ, ఈ హత్య మాత్రం కేవలం డబ్బు కోసం జరిగింది కాదు. అలా చంపేవాళ్ళు ఎక్కడో కాపుకాసి, మాటు వేసి సడెన్‌గా దాడి చేస్తారేగానీ, ఒక ప్రణాళిక ప్రకారం చంపరు. ఫింగర్ ప్రింటు కూడా పడకుండా జాగ్రత్తపడేంత తెలివి ప్రదర్శించరు.

మరి, ఈ హత్య ఎవరు చేశారు? దీని వెనుక ఉన్న హస్తం ఎవరిది?

రామ్మోహన్ని పనిమాలా కలిసింది నరసింహం. కానీ ఆయన కూడా ఏదో ఆ దారిన వెళ్తూ కలిశాడే గానీ ఎలాంటి ప్రణాళికా లేదు. పైగా వాళ్ళిద్దరి మధ్యా ఎలాంటి విరోధమూ లేదు. నరసింహం

ఆశయ హోటల్ దగ్గర దింపిన తర్వాత ఎవరు కలిశారో తెలుసుకోగల్గితే చాలు ఈ మర్డర్ని ఇట్టే ఛేదించవచ్చు. కానీ, అదే చిక్కుముడిగా ఉంది. ఆ కలిసింది ఎవరు?

★ ★ ★

రామ్మోహన్ ఉపయోగించే రెండు సెల్ ఫోన్ల నంబర్లను ఫోరెన్సిక్ నిపుణులకు ఇచ్చారు.

పోస్ట్‌మార్టంలో ఎలా చంపారు, ఎన్ని గంటల క్రితం చనిపోయాడు మొదలైన విషయాలు తెలిశాయి. అతను ఆవేళ ఇంట్లో అల్పాహారంగా ఇడ్లీ తిన్నాడు. జువెలరీ షాపుకు చేరిన తర్వాత రెండుసార్లు టీ తాగాడు. వాటిల్లో విషం కలవడం కానీ, ఫుడ్ పాయిజన్ కావడం గానీ జరగలేదని నిర్ధారణ అయింది.

గొంతు పిసికి ఊపిరాడకుండా చేయడం ద్వారా చంపారని మాత్రమే స్పష్టమైంది. అంతకు మించిన మరే ఆధారమూ లభ్యం కాలేదు.

ఇక ఫోరెన్సిక్ పరీక్షల అనంతరం కీలకమైన అంశాలు తెలియరావొచ్చు అనుకున్నాడు బోసు.

డ్రైవర్ వీర్రాజుని అంచెలంచెలుగా చితకబాదారు.

బోసుకి సహజంగానే అతనిమీద అనుమానం కలిగింది. ఆవేళ వీర్రాజు డ్యూటీ ఎగ్గొట్టడం వెనుక హంతకుల హస్తం ఉండి ఉంటుందని నమ్మాడు. కానీ, ఎంత కొట్టినా, చిత్రహింసలు పెట్టినా వృథా ప్రయాసే అయింది. వీర్రాజు తాగుడు వ్యసనం ఒక్కటే బయటడింది. తాను రాత్రిపూట మందెక్కువ తాగినప్పుడల్లా మర్నాడు పని ఎగ్గొడతానని, ఒంట్లో బాగోలేదనే సాకును ఉపయోగిస్తానని చెప్పాడు.

వీర్రాజును ఎలా కుళ్ళబొడిచారంటే.. అతను ఇన్నాళ్ళూ చెప్పిన బూటకపు జబ్బులన్నీ ఇప్పుడు నిజంగా అతనిపై దాడి చేసినట్లయింది.

★ ★ ★

రామ్మోహన్‌కి సంబంధించిన ప్రొఫెషనల్ అంశాలేవీ బయటపడకపోవడంతో పర్సనల్ లైఫ్ వైపు ఫోకస్ చేశాడు బోసు.

రామ్మోహన్ క్లోజ్ ఫ్రెండైన ఆనందరావుని కలిశాడు.

ముందుగా ఆనందరావు తన మిత్రుని మరణాన్ని తల్చుకుని బాధపడ్డాడు.

"మీ స్నేహితుణ్ణి ఎవరు పొట్టన పెట్టుకున్నారో తెలియాలంటే మీ సహకారం అవసరం" అన్నాడు ఇన్‌స్పెక్టర్ బోసు అతని దుఃఖ సాగరానికి ఆనకట్ట కడుతూ.

"అడగండి.. నాకు తెలిసినవన్నీ దాచకుండా చెప్తాను"

"మీ స్నేహితుడికి శత్రువులెవరూ లేరా? "

"ఉండే అవకాశం లేదు. అందరితో మంచిగానే ఉండటం అతని స్వభావం"

"ఆయన ఫ్యామిలీలైఫ్ గురించి మీకేమైనా తెలుసా? "

ఆనందరావు నోరు విప్పలేదు.

"చెప్పండి.. ఆయన తన మిసెస్‌తో ఎలా వుండేవారు? "

## కొత్తగాలి...

**చంద్రుడు చిన్నబుచ్చుకున్నాడు**
**ధరలు తనకంటే**
**ఎత్తులో ఉన్నాయిని..!**

– తటవర్తి రామకృష్ణ,
హైదరాబాద్

"అలాంటి విషయాలు నన్నడగడం భావ్యం కాదు"

"నేనేం ఆయన బెడ్రూం విషయాలు అడగడం లేదు. భార్యతో రిలేషన్ ఎలా ఉండేదో చెప్పడంలో తప్పేంలేదే? "

"ఏమో, అది ఆవిణ్ణే అడగండి"

"అందర్నీ అడుగుతామండీ.. మీకు తెలిసింది మీరు సిన్సియర్‌గా చెప్పండి.. ఆయన రిలేషన్లన్నీ అర్థమైతే ఎలా ప్రొసీడ్ అవ్వాలో తెలుస్తుంది"

ఆనందరావు కక్కలేక, మింగలేక చూశాడు.

"వాళ్ళిద్దరూ ఒకింట్లో ఉంటున్నారే గానీ.. ఇద్దరిమధ్యా వైఫ్ అండ్ హజ్బెండ్ రిలేషన్ లేదు.."

ఒక పోలీసుగా యమా గంభీరంగా ఉన్నాడు కానీ, నిజానికి బోసుకు పెద్ద క్లూ దొరికినట్లయింది.

ఇక తనదైన ఫక్కీలో తిప్పి తిప్పి అడిగి ఆనందరావు దగ్గర బోల్డంత సమాచారం రాబట్టాడు.

ఊళ్ళో అందరికీ మంచివాడైన రామ్మోహన్, భార్యకు మాత్రం చీడపురుగుతో సమానం. వాళ్ళిద్దరి మధ్యా చాలాకాలంగా సయోధ్య లేదు. కొంతకాలంగా కనీసం మాట్లాడుకోనైనా మాట్లాడుకోవడం లేదు. కాకపోతే రామ్మోహన్ భార్య సునంద చాలా తెలివైంది. తామిద్దరి మధ్యా సంబంధాల్లేవనిగానీ, పచ్చగడ్డి వేస్తే భగ్గుమంటుందని కానీ ఎవ్వరికీ తెలీనివ్వదు. ఆఖరికి ఆమె దగ్గరి బంధువులక్కూడా తెలీదు. బహుశా పనివాళ్ళక్కూడా అనుమానం వచ్చి ఉండదు. రామ్మోహన్ దంపతులు తన్నుకోరు, తిట్టుకోరు. సిగలు పట్టుకుని యుద్ధాలు చేయరు. అమెరికా, పాకిస్తానుల్లా బహిరంగంగా శత్రుత్వాన్ని ప్రదర్శించరు. కానీ ఇద్దరిమధ్యా నిరంతరం కోల్డ్‌వార్ నడుస్తూ ఉంటుంది. ఒకరంటే ఒకరికి అస్సలు సరిపడకపోయినా ఒకింట్లోనే ఉంటున్నారు. ఒక్కమాటైనా మాట్లాడుకోకుండా స్నేహం నటిస్తున్నారు. ఒకరి ప్రెజెన్సుని ఒకరు అసహ్యించుకునే వాళ్ళిద్దరూ చూసేవాళ్ళకి మాత్రం మేడ్ ఫర్ ఈచ్ అదర్‌లా తోస్తారు.

అంతా చెప్పిన తర్వాత ఆనందరావు "చాన్నాళ్ళుగా ఈ పచ్చి నిజాన్ని శివుడు గొంతులో గరళాన్ని దాచుకున్నట్టు మనసులోనే దాచుకున్నాను. వాడు నాతో తప్ప ఇంకెవ్వరితో ఈ విషయాన్ని చెప్పలేదు.. ఆఖరికి వాడి తోబుట్టువులక్కూడా తెలీదు.. మీతో తప్పనిసరై చెప్పాను.. దయచేసి నేను చెప్పినట్టు ఇంకెవరితోనూ అనొద్దు.. అసలు మీకీ విషయం వల్ల ఏం ప్రయోజనం ఉంటుందో కూడా నాకు బోధపడ్డంలేదు" అన్నాడు.

"మీరేం వర్రీ అవకండి.. అసలు నాకు చెప్పానన్న సంగతి మర్చిపోండి.. దోషుల్ని పట్టుకోడానికి మాకు ఇలాంటి కీలకమైన అంశాలు కావాలి. థాంక్యూ" అనేసి అక్కణ్ణించి కదిలాడు బోసు.

★ ★ ★

న్యూస్ పేపర్ చూస్తోన్న సూర్య 'ప్రముఖ నగల వ్యాపారి రామ్మోహన్ దారుణ హత్య' అనే వార్త చూసి, ఖంగు తిన్నాడు. క్షణంపాటు జీర్ణించుకోలేక కళ్ళు, ముఖం తేలేశాడు. వెంటనే "గీతా, గీతా" అంటూ కేకలు పెట్టాడు.

"వస్తున్నా మహాప్రభూ.. ఏంటా గావు కేకలు? బెడ్ కాఫీ ఇచ్చేదిలేదని నిన్నే చెప్పాగా.." అంటూ చిరాగ్గా వచ్చింది గీత.

"డికాక్షన్ రెడీగా ఉంది.. ముందు బ్రష్ చేసుకురా సూర్యా" అంది గీత ఎదురుగా కూర్చుని.

"ఎహే.. కాఫీ కాదు.. పేపర్ చూశ్ళేదా? "

"నాకంత తీరిక కూడానా.. పిల్లల్ని

ఇప్పుడే సాగనంపాను.. ఏంటి సంగతి? " అంది తాపీగా.

"రామ్మోహన్ని చంపేశారట"

"ఏంటీ, రామ్మోహన్నే? !" గుడ్లు తేలేస్తూ అడిగింది గీత.

"ముందు టీవీ పెట్టు.." అని సగం చదివిన వార్తని కంగారు కంగారుగా ఆసాంతం చదివాడు.

"అదేంటి.. ఆయన్ని చంపడమేంటి.." అనడుగుతూనే టీవీ ఛానల్స్ మార్చసాగింది. ఏ న్యూస్ ఛానల్లోనూ ఆ వార్త రావడం లేదు.

"ఈ ఛానల్స్‌కి నిప్పంటించినా పాపం లేదు. వీళ్లకి ఏది ఇంపార్టెంట్ న్యూసో

> **కొత్తగాలి...** 
>
> **అవినీతికి**
> **ఆసరా**
> **రాజకీయాల**
> **బాసట**
>
> *— భూక్యా రవీందర్,*
> ఖమ్మం

తెలిసి చావదు.. ఇంతకీ ఏం రాశాడు? " అంటూ పేపర్ అందుకుంది.

"ఇప్పటిదాకా ఈ వార్త గురించే అరగదీసి వుంటార్లే.. నువ్వేం కంగారుపడకు.. ఇక ఇవాళంతా ఐదు నిమిషాలకొకసారి ఆ పాటే పాడతారు.."

గీత జెట్ స్పీడులో ఆ వార్త చదివేసి "నాకు నమ్మబుద్ధి కావడం లేదు" అంది.

"నాకూ అలాగే ఉంది" అన్నాడు సూర్య.

"డబ్బు లేకపోతే ఒక బాధ.. ఉంటే ఒక బాధ.. ఛఛ.. ఎలా చంపుతారు రాక్షసులు!" అంది.

"అబ్బా.. కళ్ళముందు మెదుల్తున్నాడు.. ఎప్పుడూ నవ్వుతూ నవ్విస్తూ ఎంత దర్జాగా దర్పంగా ఉండేవాడు? రియల్ హీరో అంటే అతనే.. పాపం.. సునంద గారు ఎలా తట్టుకుంటారో.." అంది గీత ఆర్ద్రమైన మనసుతో.

మామూలుగా అయితే రామ్మోహన్ని గీత ఆకాశానికి ఎత్తేస్తూ తెగ మెచ్చుకుంటూ ఉంటే లోలోపల విసుగు చెందేవాడు సూర్య. ఒక్కోసారి వ్యంగ్యాస్త్రాలు సంధించేవాడు. 'అంత ఉడుక్కోవాల్సిన అవసరం లేదు.. నిజాన్ని ఒప్పుకుంటే తమరేదో తక్కువైనట్లు కాదు' అంటూ గీత బనాయించేది. కానీ, ఇప్పుడు సూర్యకే మనసులో దేవుతున్నట్లుంది. తన భార్య అతన్ని మెచ్చుకుంటే పిచ్చ జెలసీగా, అతన్ని రాజుగా చేసి తననేదో ఎద్దేవా చేస్తున్నట్టుగా ఉండేది. అసూయతో రగిలిపోయేవాడు. ఆయనగారిని అంతగా మోయాల్సిన పనిలేదు.. కాస్త డబ్బు కూడబెట్టినంత మాత్రాన.. మరీ దేవుళ్ళా, సినిమా హీరోలా చూడక్కర్లా' అంటూ పోట్లాడేవాడు. ఉడుకుమోత్తనంతో దెప్పిపొడిచేవాడు. కానీ, ఇప్పుడు మాత్రం ఇది నిజం కాకపోతే బాగుండును అనిపిస్తోంది.

"రామ్మోహన్ రియల్ హీరోనే.. షేర్ ఖాన్" లోపల అనుకోవాల్సిన మాటలు పైకే అనేశాడు.

"అంతేలే.. గేదె చచ్చిపోతేనే గానీ పాలెన్ని ఇచ్చేదో చెప్పరట. నువ్వూ అంతే. కనీసం ఇప్పుడైనా ఒప్పుకున్నావు. అసలెలా చంపి చచ్చారు? వెళ్లి పలకరిద్దామా? "

"ఆ.. వెయ్యిమందొస్తారు.. ఇప్పుడు వాళ్ళిల్లు కిటకిటలాడుతుంటుంది.. నువ్వూ నేనూ వెళ్లామా లేదా? అని ఎవరూ పట్టించుకోరు"

"అదేంటి.. హాజరేయించుకోడానికి వెళ్తామా.. సునందగారిని చూసి.."

"చాల్లే ఊరుకో.. ఆవిడే పుట్టెడు శోకంలో ఉంటే.. ఒక్కొక్కరూ వెళ్లి మళ్ళీ మళ్ళీ కొళాయి తిప్పించి వస్తారా.. దాని వల్ల ఒరిగేదేం లేదు.. చేతనైతే ఏదైనా మేలు చేయాలి"

"ఏం చేయగలం? "

"డ్రైవర్ని అనుమానిస్తున్నారే గానీ.. అసలు నిజం ఏంటో తెలీదు.. ఈ హత్య ఎవరు చేయించారు, ఇప్పుడు తక్షణ కర్తవ్యం ఏమిటి? .. వ్యాపార విషయాల్లో లావాదేవీలు ఏంటి, ఏం చేయాలి.. లాంటి విషయాల్లో ఏదైనా సాయపడగలనేమో చూస్తాను"

"అదెలా? "

"మా క్రైం రిపోర్టర్‌కి పోలీస్ డిపార్ట్‌మెంట్‌తో బాగా పరిచయాలున్నాయి. ముందు అతన్ని కలిసి మాట్లాడ్తాను" అంటూ లేచాడు సూర్య.

త్వరత్వరగా స్నానం గట్రా పూర్తి చేశాడు. గీత హాల్లోకే టిఫిన్ ప్లేట్లు తెచ్చింది. టీవీలో పేపర్లో రాసిన వార్తనే తిరగేసీ, బోర్లేసీ, అటు తిప్పీ, ఇటు తిప్పీ చెప్తున్నారు తప్ప, వీసమెత్తు కొత్త విషయం లేదు. విసుగేసి టీవీ కట్టేశారు.

★ ★ ★

ఫోన్లో చెప్పినట్లుగానే వాసు క్రాస్‌రోడ్స్ దగ్గరికి వచ్చాడు. సూర్యని చూడగానే దగ్గరికి వచ్చాడు. నాలుగడుగులు వేసి ఇద్దరూ రుచి రెస్టారెంట్‌కు చేరారు. కార్నర్ టేబుల్ దగ్గరికెళ్ళి కూర్చున్నారు.

సర్వర్‌తో రెండు టీ తెమ్మని చెప్పారు.

"ఏంటి సూర్యా.. రామ్మోహన్ మీకు దగ్గరి రిలేషనా? " అనడిగాడు వాసు.

"మరీ దగ్గరేం కాదు. అలాని బీరకాయ పీచూ కాదు.. మా ఆవిడా, వాళ్ళావిడా చుట్టాలు.. అప్పుడప్పుడూ కలుస్తుంటాం.. ముఖ్యంగా అతనంటే మావాళ్ళందరికీ వీరాభిమానం.. హీరో వర్షిప్ లాంటిది" అన్నాడు సూర్య.

తల పంకించి "బయట కూడా పేరు ప్రఖ్యాతులున్నాయి" అన్నాడు వాసు.

"ఇంతకీ విషయమేంటి? చంపింది డ్రైవరేనంటావా? కేవలం డబ్బు కోసమేనా? "

"కావచ్చు, కాకపోవచ్చు. వాడిని ముందు అదుపులోకి తీసుకున్నారు కదా.. చావబాదడం మొదలై ఉంటుంది.. వాడు స్పృహతప్పి పడిపోవాలి.. తిరిగి లేవాలి.. మళ్ళీ మళ్ళీ.. అలాంటి కోటింగులు పడాలి.. చావుతప్పి కన్ను లొట్టపోవాలి.. అప్పుడు కదా.. వాడవునో కాదో డిసైడయ్యేది.. "

వాసు సరదాగా చెప్పినా సీరియస్‌గా జరిగేదదేనని సూర్యకి తెలుసు.

"ఏంటో పోలీస్ వ్యవహారం చాలా దారుణంగా ఉంటుంది. ఒకవేళ అతను కాకపోతే..? "

"ఒకవేళ అతనే అయ్యుంటే..? "

"కాకపోవడానికి ఛాన్సెస్ ఉన్నాయిగా"

"అతనే అవ్వడానికి్కూడా చాలానే ఛాన్సెస్ వున్నాయి"

"కానీ.. అంత హింసించాక అతను కాదని తెలిస్తే..? "

"హింసించకుండా 'చెప్పమ్మా' అని బతిమాలితే నిజం చెప్తారా.. చోద్యం కాకపోతే? "

"ఏమో వాసూ.. ఈ ఇంటరాగేషన్లని తల్చుకుంటే.. నీ ఫీల్డూ అదే గనుక నువ్వు వినీవినీ మొద్దుబారిపోయుంటావు"

"నిజమేనేమో.. మొదట్లో ఒక మర్డర్ కేస్ గురించి వింటే ఇక రోజంతా అదే ఆలోచన.. డబ్బు తప్ప ప్రపంచంలో ఇంకేం లేదా.. దానికోసం నిండు ప్రాణాన్ని తీస్తారా అని బుర్ర వేడెక్కిపోయేది.. ఇప్పుడేమీ అనిపించడంలేదు..

అసెంబ్లీలో ప్రతిపక్షాలవాళ్లు ఎట్లా వాదులాడుకుంటారో, ధరలు పెంచితే జనాలు రోడ్ల మీదికొచ్చి ఎలా ధర్నాలు చేస్తారో.. హత్యలు, ఆత్మహత్యలూ అంతే అనిపిస్తోంది. మెదడు ఆలోచిస్తుందే తప్ప మనసు స్పందించడం మానేసింది. తెలిసిన క్రైం న్యూస్‌ని ఎంత ఇంట్రెస్టింగా ప్రెజెంట్ చేయాలా అని తప్ప అంతకు మించి హృదయం ద్రవించడమంతా పోయింది" కూల్‌గా చెప్పాడు వాసు.

"వద్దురా బాబూ.. మరీ అంత డ్రైగా మారిపోకు"

"ఇది మరీ బాగుందిరా.. కేవలం హైదరాబాద్‌లోనే సగటున రోజుకు పది, పన్నెండు చావులు లేదా మానభంగాలు జరుగుతాయి. వాటన్నిటికీ గుండె పగిలేలా ఏడుస్తూ కూర్చుంటే ఇక ఆనక నేను డ్యూటీక్కాదు గదా మరెందుకూ పనికిరాను. డిప్రెషన్‌తో పిచ్చాసుపత్రిలో చేరాలి"

సూర్య నవ్వీనవ్వనట్టుగా నవ్వేడు.

"నా సంగతి సరేరా.. నువ్వు మాత్రం రోజూ క్రైం వార్తలు చూసి రెస్పాండవుతున్నావేంటి? ఇవాళ రామ్మోహన్ నీకు తెలిసినవాడు కనుక.."

అది నిజమే కనుక సూర్య రెట్టించలేదు. టీ తాగుతూ ప్రస్తుత రాజకీయాల గురించి మాట్లాడుకున్నారు.

చివరికి మళ్ళీ విషయంలోకి వచ్చి "నీకేమైనా వివరాలు తెలిస్తే వెంటనే నాకు చెప్పు.. రామ్మోహన్ మిసెస్‌ని తల్చుకుంటే చాలా దిగులుగా వుంది. ఇంత చిన్న వయసులో ఆమెకిలాంటి కష్టం రాకుండా వుండాల్సింది" అన్నాడు సూర్య.

"అరేయ్ మావా! నువ్వెక్కడా లీక్ చేయనంటే నీకో మాట చెప్తానురా" సంశయంగా అన్నాడు వాసు.

సూర్య ఏమిటో చెప్పమన్నట్లు ఆదుర్దాగా చూశాడు.

"ఇన్‌స్పెక్టర్ బోసు నాతో చాలా క్లోజ్‌గా వుంటాడు గనుక.. చెప్పాడు.."

"ఏంటి? "

"రామ్మోహన్ హత్య విషయంలో అతని భార్య ప్రమేయం వుండివుంటుందని అనుమానిస్తున్నారు"

"నో ఛాన్స్.. ఆవిడ మా అందరికీ బాగా తెలుసు. చాలా నెమ్మదస్తురాలు"

"మావా, గడుసుగా కనిపించేవాళ్ళే హత్యలు, దోపిడీలు చేస్తారనుకుంటే పొరపాటు"

"ఛ.. వూరుకోరా.. పోలీసోడు కనుక ఎవర్నయినా అనుమానించడం సహజం.. గుళ్ళో దేవుడి నగలుపోతే ముందు పూజారినే అనుమానిస్తారు.. అలా.."

"అది వేరు, ఇది వేరు మావా.."

"అరే, నేను చెప్తున్నాగా వాసూ.. అతిశయోక్తి అనుకోకపోతే.. ఆవిడ దివి నుండి దిగివచ్చిన దేవతలా వుంటుంది.."

"అంత దేవత కూడా ఉగ్రరూపం దాల్చి కాళికాదేవిలా మారొచ్చు.."

"నీకేంట్రా బామ్మర్దీ.. క్రైం వార్తలు చూసీ, రాసీ క్రిమినల్ ఐడియాలొస్తున్నాయేంటి..? "

"అందుకే అన్నారు.. ఫాక్ట్ ఈజ్ బిట్టర్ ద్యాన్ ట్రూత్- అని.. నువ్వొకణ్ణి తాగడని డిసైడ్ అయ్యావనుకో.. వాడు నీ కళ్ళెదురుగా తాగుతున్నా అది థమ్సప్ అని వాదిస్తావు"

"ఓర్నాయనో.. నా మాట వినరా బాబూ.. ముందా ఇన్‌స్పెక్టర్ బుర్రలోంచి ఆ సెన్స్‌లెస్ అనుమానాన్ని యాసిడ్ పోసి తుడిచిపారేయ్.. రామ్మోహనూ, అతని వైఫూ మేడ్ ఫర్ ఈచదర్లా వుండేవాళ్ళు.. మా నాయనమ్మ భాషలో చెప్పాలంటే పార్వతీపరమేశ్వర్లు"

"జీవితా, రాజశేఖర్లు కాదూ? "

"నీకు తమాషాగా వుందా? కొంపతీసి ఆవిణ్ణి కూడా ఇంటరాగేట్ చేస్తారా? "

"దానికి వేరే ప్రొసీజరుంటుందిలే"

"పోలీసు ఇన్‌స్పెక్టర్‌కి నచ్చచెప్ప రాదూ? "

"మావా, వాళ్ళకి సలహాలిచ్చేంత వాళ్ళమా.. ఎక్కువ తక్కువ మాట్లాడ్తే నేనే మర్డర్ చేయించానని బొక్కలో తోయ గలడు"

"ఆ అమాయకురాలిని ఇబ్బంది పెట్టరు కదా? "

"ఒకవేళ ఆవిడ హత్య చేయించకపోతే ఆవిడకి చుట్టుకునేదేం వుండదు.. అన్ని వైపుల్నుండీ ఆలోచించడం, అందర్నీ అను మానించడం మామూలే"

"అసలు ఆవిడమీద ఎందుకు అను మానం వచ్చింది? "

"ఎందుకంటే ఆయనగారికి ఇంకో రిలే షన్ వుంది కాబట్టి"

"ఏంటీ? "

"నువ్వు మరీ ప్రతిదానికీ షాకింగ్ ఎక్స్ ప్రెషన్లివ్వమాకు"

"ఏమోరా బామ్మర్దీ.. నిజంగానే షాకుల మీద షాకులిస్తున్నావు"

"నాకు తెలీకడుగుతా.. చిన్నిల్లుంటే అది ఆశ్చర్యంతో అమెరికా ఎత్తున ఎగరాల్సిన విషయమా? "

"నీకేదో పైత్యం ప్రకోపించినట్లుంది.. కొంపతీసి నీక్కూడా ఇంకో రిలేష నుందా? "

"ఈ జన్మకంత అదృష్టమా? రామ్మోహ న్‌కు మల్లే ఆస్తులుంటే గల్లీకో రిలేషన్ పెట్టుకోనూ? "

"ఇంకానయం ఇంటికో పిల్లతో అన్లేదు"

"డబ్బుంటే అన్నీ నడుస్తాయిరా.. అది మాత్రం నిజం.."

"ఇదుగో.. ఇలా అర్ధాంతరంగా ప్రాణం కూడా పోతుంది."

ఇంతలో వాసు మొబైల్ రింగయింది. లిఫ్ట్ చేసి మాట్లాడిన తర్వాత "నారాయణ గూడ పి.ఎస్. నుంచి కాల్ రా.. ఒక రేప్ కేసు, ఒక యాక్సిడెంటు.. వెళ్తానురా" అన్నాడు.

"భలే ఒప్పందాలు కుదుర్చుకుంటా వురా.. మీరెళ్ళి ఎంక్వయిరీలు చేయ కుండా, మీకే చేసి చెప్తున్నారన్నమాట" అన్నాడు సూర్య.

"అవసరాలు ట్రిక్కులు నేర్పిస్తాయి. కొంచెం డబ్బు చెల్లించుకుంటే ఏదైనా సాధ్యమే" అంటూ వాసు బండి స్టార్ట్ చేశాడు.

సూర్య కూడా తన బండి తీశాడు.

★ ★ ★

## కొత్తగాలి...

**మన స్వాతంత్ర్యం**
**మేడి పండు!**
**జన దారిద్ర్యం**
**రాచపుండు!!**

*– అంబటి వెంకటశివారెడ్డి,*
*యర్రగుంట్ల, కడప జిల్లా*

సూర్యకి భోజనం వడ్డిస్తూ "నాకెందుకో ఇది డ్రైవర్ పని కాదనిపిస్తోంది. అతను నన్నూ, పిల్లల్నీ రెండుసార్లు మనింటి దగ్గర డ్రాప్ చేశాడు.. ఎంత మంచివాడో.. బాగా కలుపుగోలు మనిషి.. కబుర్ల పోగు.." అంది గీత.

సూర్య ఏమీ మాట్లాడలేదు.

"ఏమాలోచిస్తున్నావు.. డ్రైవర్ని నువ్వూ చూశావుగా.. కపటం లేని మనిషి.. కదూ? "

"ఆ డ్రైవరేనా? ఒకవేళ మారాడేమో.. వేరే అతనేమో? "

"అయ్యో! లేదు.. వీర్రాజని పేరు రాశారుగా.. పైగా ఫొటో కూడా వేశారు"

"అలాగా? "

"మీ వాసూకి చెప్పి, అతన్ని వదిలిపెట్టమని చెప్పరాదా? "

"వాడు చెప్పినంతలో వదిలేస్తారా? "

"ప్రెస్‌వాళ్ళంటే బోల్డంత ఇమేజ్ వుంటుందిగా.. ఆమాత్రం చేయరా? "

"ఒకవేళ మీ అక్కయ్యే.. అదే సునంద గారే చేయించుంటుందా ఈ హత్య? " ఏ భావమూ కనపడనివ్వకుండా ఏదో మామూలుగా అడుగుతున్నట్టు అడిగాడు.

"నీకేవన్నా మతి పోయిందా సూర్యా.. ఆమెని చూస్తే సీతమ్మవారిని చూసినట్లుగా వుంటుంది"

"ఒకవేళ సీతమ్మే ఈ రూపంలో పుట్టిందంటావా? "

"నీకన్నీ వేళాకోళాలే.. చీమకైనా హాని చేయదు తెల్సా? "

"నడిస్తే చీమలు చచ్చిపోతాయనేమో.. ఎప్పుడూ ఎక్కడో ఒకచోట కూర్చునే వుంటుంది"

"మళ్ళీ వ్యంగ్యమా? "

"కాదుగానీ.. ఆవిడ సీతమ్మే అనుకుందాం.. కానీ రామ్మోహన్ సంగతేంటి? రాముడా, రావణాసురుడా? "

"చచ్చిపోయినా నీకింకా ఆయనమీద జెలసీయేనా? ఆయన మేలిమి బంగారం కాదూ? "

"ఔనౌను.. 24 క్యారట్స్"

"పోవయ్యా మగడా.. నిజాల్ని ఒప్పుకోవాలి.. ఇతరుల్లో వున్న మంచి లక్షణాల్ని మెచ్చుకుంటే మన సొమ్మేం పోతుంది.. నీ నోటితో నువ్వే ఒకసారి 'సునందగారు ఏంజెల్లా వుంటారు' అన్నావు.. గుర్తు లేదా? "

"అనే వుంటాను.. అందుకేగా కొన్ని వందలసార్లు రామ్మోహన్ దేవుడంటూ నామీద కసి తీర్చుకున్నావు"

"వామ్మో నాకలాంటి కుళ్ళు, కుట్రా తెలీదు మహాప్రభూ.. తనని మెచ్చుకుంటే నేనూ సంతోషించాను గానీ, నలకంత కూడా అసూయ కలగలేదు"

"ఇంతకీ మీ బావయ్య రాముడేనంటావా? "

"రాముడు కాకపోతే కృష్ణుడా ఏంటి? "

"అదంతా నాకూ తెలీదు కానీ.. వాసు కాన్ఫిడెన్షియల్ అంటూ చెప్పిన మాట.. నా బెటర్‌హాఫ్‌వి గనుక నీతో చెప్తాను.. పొరపాటున కూడా మరెవ్వరితో అనకు"

గీత ఏమిటన్నట్లు ఆత్రుతగా చూసింది.

"ఆడవాళ్ళ నోటిలో నువ్వుగింజ కూడా నానదంటారు.."

"ఇలాంటి చెత్త సామెతలు చెప్పకు.. నిన్ను ఇబ్బంది పెట్టే పనేదీ ప్రాణంపోయినా చేయను.."

"అంత పెద్దమాటలెందుకులే.. కొన్ని విషయాలు దాగవు.. కొంచెం ఆలస్యంగానైనా బయటపడతాయి.. కాకపోతే మన ద్వారా లీకవ్వకూడదు"

"ముందు విషయమేంటో చెప్పు"

"పోలీసులు సునందగారే ఈ హత్య చేయించి ఉండొచ్చని సస్పెక్ట్ చేస్తున్నారట"

గీత తేలిగ్గా తీసిపారేస్తూ "వాళ్ళ మొహంలే... అనుమానించడం వాళ్ళ వృత్తి లక్షణం... అయితే మాత్రం మరీ ఆవిడ్ని అనుమానించడం ఏంటి... చాలా ఫూలిష్‌గా ఉంది..." అంది.

"ముందు నేనూ అలాగే తీసిపడేశాను గీతా... కానీ, ఆలోచిస్తే... అది కేవలం ఆరోపణ కావడానికి ఎంత ఆస్కారం ఉందో వాస్తవం కావడానికీ అంత అవకాశం ఉంది"

"అబ్బా... ఇంకూరుకో... వినడానికే హీనంగా ఉంది"

"వద్దులే.. ఈ టాపిక్ గురించి ఇక మనమేం డిస్కస్ చేయొద్దు. కొన్ని రోజులు ఆగితే నిజాలేంటో అవే బయటపడతాయి" అనేసి కామ్‌గా ఉండిపోయాడు.

ప్రశాంతమైన కొలనులో రాయి విసిరినట్లయింది. గీత మనసు అల్లకల్లోలంగా మారింది.

ఆ తర్వాత ఎంతో బతిమాలితే గానీ సూర్య మళ్లీ నోరు విప్పలేదు. విసిగిపోయిన గీత "మరీ అంత పోజు కొడ్తావేంటి... ఇంతకీ మీ వాసూ ఏం చెప్పాడో చెప్పు... నాకేంటో చాలా అలజడిగా ఉంది" అంది.

"వాళ్ళెవరికోసమో మనిద్దరి మధ్యా కీచులాటలు అవసరమా... నాల్రోజులు దీని గురించి మనమేం మాట్లాడుకోవద్దు, సరేనా? "

"మరీ ఢాంబికం ప్రదర్శిస్తున్నావే... ఇప్పుడు నేను పోట్లాడానా? నాకు భయంగా ఉంది చెప్పు... ఇప్పుడు అక్కయ్యని కూడా లాకప్‌లో పెట్టి చిత్రహింసలు పెడతారా? "

"అలా జరగదు... కేవలం అనుమానమే కదా.. పైగా ముందే అనుమానం ఉన్నట్లు చెప్పరు... రకరకాలుగా ప్రశ్నలు అడుగుతారు. క్రాస్ ఎగ్జామినేషన్లు చేస్తారు. బంధుమిత్రుల్ని ఎంక్వయిరీ చేస్తారు... చివరికి నిర్ధారణ జరిగితే అప్పటి సంగతి..."

"వాళ్ళ అనుమానం సంగతి సరే... నీకే మనిపిస్తోంది? "

"గాంధీజీ ఏమన్నాడు... ఏ మనిషినీ చనిపోయేవరకూ ఇలా, అలా అని సర్టిఫై చేయలేమట. ఫోర్ డైమెన్షన్స్ గురించి తెలుసుగా... మనలో బోల్డన్ని కోణాలుంటాయి. అందరితో ఒకలా ఉండం, అన్నిసార్లూ ఒకలా ఉండం..."

గీత ఆశ్చర్యంగా వింటోంది.

"నేరం చేయడానికి పరిస్థితులే కారణం... ఎవరెప్పుడు, దేనికి ఎలా రియాక్టవుతారో చెప్పడం కష్టం. మనసులు నిర్వచనాలకు అందవు..."

"కానీ అక్కయ్య చాలా మెత్తన... కాదా సూర్యా? !"

## 'చతుర'లో నాలుగో నవల



**వి. నాగరత్న**

కృష్ణా జిల్లా విజయవాడలోని రాయనపాడులో పుట్టాను. సాహిత్యంలో ఎంఎ పట్టా పొందాను. మూడేళ్లపాటు హైదరాబాద్‌లోని చైతన్యపురి ప్రెసిడెన్సీ జూనియర్ కళాశాలలో అధ్యాపకురాలిగా పనిచేశాను. 'చతుర', 'విపుల' పూర్వ సంపాదకులు చలసాని ప్రసాదరావుగారికి సెక్రటరీగా 'ఈనాడు'లో పన్నెండేళ్లపాటు పనిచేశాను. ప్రజాశక్తి ఆదివారం అనుబంధానికి ఇన్‌ఛార్జిగా నాలుగేళ్లపాటు చేశాను. ప్రస్తుతం ఆంధ్రప్రభ సండే సప్లిమెంట్ ఇన్‌ఛార్జిగా పనిచేస్తున్నాను. గతంలో నేను రాసిన నవలలు మూడు 'చతుర'లో ప్రచురితమయ్యాయి. అనేక కథలు వివిధ పత్రికలలో అచ్చయ్యాయి. 'చతుర'లో నా నాలుగో నవల 'సఖి'.

**చిరునామా:**
**వి. నాగరత్న కుమారి,**
ఎంఎస్-69,
మలక్‌పేట్ కాలనీ,
హైదరాబాద్-500036

"అవున్నిజమే. కానీ, పిల్లి కూడా తలుపు లేసి కొడితే విజృంభిస్తుంది అని సామె తుందిగా... ఒకవేళ మీ బావ ఏమైనా విసిగించాడేమో..."

గీత ఆలోచిస్తూ కూర్చుండిపోయింది. 'ఎప్పుడూ ముఖాన నవ్వే తప్ప చిన్న చిరాకైనా తొంగి చూడని బావయ్యలో ఇంకో యాంగిల్ ఉండి వుంటుందా? అక్కయ్యని ఏ రకంగానైనా కాల్చుకు తిని ఉంటాడా? ప్రశాంతంగా, కోమలంగా కనిపించే సునంద అక్కయ్య గుండెల్లో అగ్ని పర్వతం ఉండివుంటుందా? ఇదంతా ఊహాగానమా లేక చేదు వాస్తవమా? ఒక వేళ ఆయన నిజంగానే ఏమైనా వేధించి వున్నా అక్కయ్యలో అంత కసి, కక్ష ఉన్నాయా? హత్య చేయించే అంత? !'

చాలా సేపు ఆలోచించి విసిగిపోయిన గీత పడగ్గదిలోంచి లేచి వచ్చింది.

సూర్య లాప్‌టాప్ ఓపెన్ చేసి పని చేసుకుంటున్నాడు.

"ఒకసారి అక్కయ్య వాళ్లింటికి వెళ్ళొద్దామా?" అంది గీత.

"నేను రానులే... నీకు వెళ్ళాలనిపిస్తే నేను ఆఫీసుకి వెళ్ళేప్పుడు దింపుతాను" అన్నాడు సూర్య తలెత్తకుండానే.

"పిల్లలు స్కూలు నుండి వచ్చేలోగా వచ్చేయాలి. ఇప్పుడు నీకు కుదరదా?"

"నీకంతగా వెళ్ళాలనుంటే సరే"

"కేవలం నన్ను దింపడానికైతే నువ్వక్కర్లా... ఆటోలో వెళ్తాను... కానీ, నువ్వు కూడా వస్తే బాగుంటుంది"

"సరే, త్వరగా తయారవ్వు"

"ఇదేమైనా పెళ్ళా, పేరంటమా... తయారవడానికి? వచ్చేస్తాను... ఏంటో అక్కయ్యని సస్పెక్ట్ చేస్తున్నారంటే నా మనసు మనసులో లేదు"

"కొంపతీసి ఆ విషయాన్ని చాటడానికి బయల్దేరుతున్నావా ఏంటి?"

"నేనెలా కనిపిస్తున్నానేంటి?"

"ఏమో జాగ్రత్త. అలాంటి ఎక్స్‌ప్రెషన్లేం ఇవ్వకు"

రెండు నిమిషాల్లో గీత చీర మార్చుకుని వచ్చింది. ఇద్దరూ రామ్మోహన్ ఇల్లు చేరారు.

చాలామంది బంధుమిత్రులతో రామ్మోహన్ ఇల్లు రద్దీగా ఉంది. అంతటా సుదీర్ఘ విషాదం అలముకుని ఉంది. ఏ ఇద్దరు మాట్లాడుకున్నా చిన్న స్వరంతో గుసగుసగా మాట్లాడ్తున్నారు.

సూర్య, గీత వెళ్ళేసరికి సునంద పక్కన కూర్చున్న నలుగురు స్త్రీలూ లేచి లోనికి వెళ్లారు.

పేపర్లో, టీవీల్లో వార్త చూశాక్కూడా 'ఎలా జరిగింది?' అంటూ మరోసారి కూపీ లాగినట్టు అడగడం భావ్యం కాదనిపించింది.

"ఎక్స్‌ట్రీంలీ సారీ..." అన్నాడు సూర్య.

సునంద కళ్లు వాల్చేసింది. ఆమెకసలు ఎవరితోనూ మాట్లాడాలని లేదు. ఎవ్వరూ పలకరించకుండా తనను ఒంటరిగా వదిలేస్తే బాగుండుననుకుంటోంది. కానీ ఇది సమాజం కదా... రకరకాల బంధుత్వాలతో, పరిచయాలతో ఎవరెవరో వస్తున్నారు. ఏదేదో మాట్లాడ్తున్నారు. ఏమేమో అడుగుతున్నారు. ఎవరికీ ఏమీ చెప్పాల్సిన పని లేకుండా భూమిలోకి కుంచించుకుపోతే బాగుండుననిపిస్తోంది.

గీతక్కూడా ఏమీ మాట్లాడాలని లేదు. సునందని ఇబ్బంది పెట్టాలని అసలే లేదు. బంధుత్వం మరీ దగ్గరిది కాకున్నా ఎందుకో సునంద అంటే చెప్పలేనంత అభిమానం. ఆమెని అనుమానిస్తున్నారంటే ఆ అవమానం తనకే జరుగుతున్నట్లుంది.

'నీ వెనుక ఆపద పొంచి ఉందక్కా... పోలీసులతో జాగ్రత్త. నువ్వేం మాట్లాడ్తే వాళ్లెలా అర్థం చేసుకుంటారో... లేనిపోని

నేరాలు అంటగడతారో... జాగ్రత్త ఆచి తూచి మాట్లాడక్కా' అని చెప్పాలని ఉంది. కానీ అదంతా గొంతులోపలే నొక్కేసి "సారీ అక్కయ్యా" అంది. వద్దనుకున్నా కళ్ళు చెమర్చాయి. ఆ కన్నీటి చుక్కలు రామ్మోహన్ చనిపోయినందుక్కాదు సునంద ఆపదలో చిక్కుకుంటోందన్న దిగులుతోనే.

రెండు నిమిషాలు గడిచాయో లేదో ఇంట్లో పనిచేసే నౌకరు వచ్చి, "అమ్మా, పోలీసాయన వచ్చారు. మీతో మాట్లాడాలంట" అన్నాడు.

సునంద ముఖం క్షణంలో అసహనంగా మారింది. తనకు ఎవరితో మాట్లాడ్డం ఇష్టం లేకపోయినా, చచ్చినట్లు మాట్లాడాలి గనుక దుఃఖం ముంచుకొచ్చింది. అన్నిటినీ అణిచేసుకుని "నేను మాట్లాడి వస్తాను" అని లేచింది.

"మేము వెళ్తాం.. ఇంకోసారి వస్తాం" అంది గీత.

ముగ్గురూ గదిలోంచి హాల్లోకొచ్చారు. పోలీసాయన సోఫాలో కూర్చుని ఉన్నాడు.

సునంద వెళ్లి పోలీసు ఎదురుగా ఉన్న సోఫాలో కూర్చోగా, సూర్య గీత బయటికి వచ్చేశారు.

★ ★ ★

"అక్కయ్యని చూస్తే నీకేమనిపించింది సూర్యా? " అంది గీత బండి ఎక్కాక.

"బాధగా ఉంది"

"బాధ సర్లే... ఈ ఘోరం వెనుక తన ప్రమేయం..."

"ఊరుకో గీతా... మళ్ళీ మళ్ళీ ఈ ప్రస్తావన తేకు... తను సేఫ్‌గా ఉండాలని కోరుకుందాం... అంతకంటే ఇంకేం మాట్లాడొద్దు. ఆలోచించొద్దు" అన్నాడు సూర్య.

గీత రెట్టించలేదు. ఆమెని ఇంటి దగ్గర దింపి సూర్య ఆఫీసుకు వెళ్ళిపోయాడు. అతను 'ఆంధ్రావని' పత్రికలో సీనియర్ సబ్-ఎడిటర్. సాధారణంగా సాయంత్రం ఆరింటికి వెళ్ళి అర్ధరాత్రి వస్తాడు. కానీ, అది ఫిక్స్‌డ్ టైం కాదు. ఇచ్చిన ఎసైన్‌మెంట్లను బట్టి ఒక్కోసారి ఇంకా పెందలాడే వెళ్తాడు. కొన్నిసార్లు అదనపు డ్యూటీ లేమైనా అప్పజెప్తే సగం నిద్రపోయి లేచి పగలు పన్నెండు, ఒంటిగంట కల్లా మళ్ళీ హాజరేయించుకోవాల్సి వస్తుంది.

అందుకే గీతకి భర్త ఉద్యోగం అంటే పరమ చిరాకు.

సూర్య ఎప్పుడూ ఇంట్లో ఉన్నట్లే ఉంటాడు, ఎప్పుడూ లేనట్లే ఉంటాడు. అర్ధరాత్రి పన్నెండున్నర నుంచి రెండులోపు ఎప్పుడో ఒకప్పుడు వస్తాడు. అతనికోసం గీత అప్పటిదాకా దాదాపు మెలకువగానే ఉంటుంది. కొన్నిసార్లు నిద్రపోయినా ఒకటే ఉలికిపాటు. చీమ చిటుక్కుమంటే తలుపు మోగినట్లుగా ఉలిక్కిపడి లేస్తుంది. దాంతో గుండెదడ వస్తుంటుంది. ఒక్కోసారి అప్పటిదాకా మెలకువగా ఉండి సరిగ్గా అతనొచ్చే సమయానికి గాఢనిద్రలోకి జారుకుంటుంది. దాంతో సూర్య కాలింగ్ బెల్ ఎంతోసేపు మోగించాక గానీ మెలకువ రాదు. అలాంటప్పుడైతే పిచ్చ కోపం వస్తుంది. 'ఏంటీ న్యూసెన్సు' అనిపిస్తుంది. 'నీవల్ల నాకూ నిద్రపోయే ప్రాప్తం లేదు. ఏంటయ్యా

---

**కొత్తగాలి...**

**జైళ్లన్నీ**
**నేరగాళ్లకు**
**స్టార్‌హోటళ్లు!**
**ఇంట్లోకన్నా జైల్లోనే పదిలం!**

*– కందాళై రాఘవాచార్య,*
నిజామాబాద్

---

మగడా... ఇది తప్ప నీకు ఇంకే ఉద్యోగమూ దొరకలేదా... ఛట్ చెత్తుద్యోగం... మానేసి ఇంకేదైనా చూసుకో' అని విసుక్కుంటుంది.

"జర్నలిస్టులంటే నీకేదో ఆషామాషీగా ఉంది... నీ మొగుడు ఎంత స్టేటస్‌లో ఉన్నాడో నీకర్థం కావడం లేదు" అంటాడు సూర్య నవ్వేస్తూ.

"గాడిదగుడ్డు స్టేటస్... సుఖంగా నిద్రపోయే రాత లేదు. అందరూ హాయిగా గురకలు పెట్టి నిద్దరోతున్న వేళ వస్తావు.. నీకంటే దొంగోళ్ళ పనే నయం"

"ఏంటీ? "

"అంతేగా మరి... వాళ్ళకక్కనీసం రోజూ డ్యూటీ ఉండదు. నెలకో, రెణ్ణెల్లకో ఓ బడా చోరీ చేశారంటే ఇక నెల్రోజులు డే అండ్ నైట్ రెస్టే రెస్టు..."

"ఛీ పోవే రాక్షసీ... పోయిపోయి దొంగ వెధవలతో పోలుస్తావా? జర్నలిస్టుల విలువ ఎప్పుడు తెలుసుకుంటావ్? మొత్తం గవర్నమెంటంతా మా హ్యాండ్స్‌లో ఉంటుంది"

"ఔనౌను... అర్ధరాత్రి కూర్చుని గవర్నమెంటుని ఉంచాలా, పడదోయాలా అని ఎత్తులేస్తుంటారు"

"నీలాంటి అమాయకులు అలాంటి అపోహల్లోనే ఉంటారు, ఏం చేస్తాం? కానీ మా తాపత్రయమంతా మీ ప్రజలగురించే... ఎక్కడెక్కడ అన్యాయాలు జరుగుతున్నాయి... వాటిని ఎలా అరికట్టాలి... రాజకీయ నాయకులు చేస్తున్న మోసాలేంటి... జనాల్ని ఎలా ఎడ్యుకేట్ చేద్దామా... అని ఆలోచిస్తుంటాం. అలుపూసొలుపూ లేకుండా మోసగాళ్ళని ఎండగట్టి.. ఉతికి ఆరేసి.. ఐరన్ చేస్తుంటాం..."

"హరిహరీ... పతీశ్వరా... ఎంత కష్టం... ఆఖరికి దోబీ పని కూడా చేపట్టారా? "

"వ్యంగ్యమా? నీలాగా మొగుడు కష్టపడితే దర్జాగా ఇంట్లో కూర్చునేవాళ్ళకి... ఒకవేళ ఉద్యోగాలు చేసినా ప్రశాంతంగా రెండు ఫైళ్ళు తిరగేసి చల్లగా ఇళ్ళు చేరే సాదాసీదా వాళ్ళకి మా కష్టనష్టాలు అర్థం కావులే. మాది ట్వంటీఫోర్ అవర్స్ జాబ్... ఎప్పుడు, ఎక్కడ ఏ అరాచకం జరిగినా దాన్ని కవర్ చేసే బాధ్యత మాదే. బాధితుల పక్షాన నిలబడి న్యాయం జరిగేదాకా స్టోరీలు రాస్తూనే ఉంటాం. మాలాంటివాళ్ళకి ఎన్ని బెదిరింపు కాల్స్ వస్తాయో... ఎవడు, ఎప్పుడు కాపు కాసి కత్తిపోటు పొడుస్తాడో తెలీదు... ఎప్పుడూ ప్రాణ సంకటమే"

"ఆ... మరీ కార్గిల్‌వార్‌నో, ముంబై టెర్రరిస్టు దాడినో కవర్ చేసినవాడిలా బిల్డప్ ఇవ్వకు..."

"అందరికీ అలాంటి అవకాశాలే వస్తాయా? చూస్తుండు, నేను కూడా ఏదో సంచలనం చేయకపోను. అప్పుడు నన్ను ఇంటర్వ్యూ చేస్తే 'ప్రతి పురుషుడి విజయం వెనుకా ఒక స్త్రీ ఉన్నట్లే నా వెనుక... కాదు కాదు... నా పక్కన గీత ఉంది' అని నీ గురించే చెప్తాను. అంత కంటే ముఖ్యంగా నా కెరీర్ కోసం తన నిద్రను త్యాగం చేసిందనీ చెప్తాను"

"ఒద్దులే మహాప్రభూ... నా గురించి చెప్పడం కోసం నువ్వేం సాహసాలు చేయొద్దు... సంచలనాలు సృష్టించొద్దు. అప్పుడీ మాత్రం ప్రశాంతత కూడా వుండదు"

గీత, సూర్యల జీవితం అలా నడుస్తూ ఉంది. ఎక్కువమంది మగవాళ్ళకుండే ఏ దురలవాట్లూ సూర్యకు లేవు. భార్యను హీనంగా చూసే నైజం అసలే లేదు. కాక పోతే గీత తనతో తప్ప మరెవ్వరితో సన్నిహితంగా ఉన్నా ఓర్చుకోలేడు. ఆఖరికి పిల్ల

లతో కూడా. తన తర్వాతే మరెవరైనా అనుకోవాలని తపిస్తాడు. గీత మరెవరినైనా మెచ్చుకున్నా సహించలేడు.

రామ్మోహన్ని గీత ప్రశంసించినప్పుడల్లా సూర్య ఈర్ష్యాగ్నితో రగిలిపోయేవాడు.

నిజానికి రామ్మోహన్ పట్ల అతనికి ఏ వ్యతిరేక భావనా లేకున్నా... ఆమె మెచ్చుకోవడం భరించలేక... అతన్ని గురించి ఏదో ఒక వంకర మాట అనేవాడు. తిన గతినగ గారెలు చేదు... అన్నట్టు తన భార్య గీతలో రామ్మోహన్ పట్ల సద్భావం పోవాలని, ఆమె మనసులో తాను మాత్రమే రియల్ హీరోగా నిలబడాలని తహతహలాడేవాడు.

రామ్మోహన్ మీద ఎన్ని నిందలు వేసినా, ఎంత చులకన చేయాలని చూసినా ఫలించేది కాదు. గీత దగ్గర అంతకంటే బ్రహ్మాండమైన అస్త్రం ఏదో సిద్ధంగా ఉండేది... 'ఇవాళే మా పెద్దమ్మ గారమ్మాయి ఫోన్లో చెప్పింది... రామ్మోహన్ బావయ్య అనాథ శరణాలయానికి పాతిక లక్షలు విరాళం ఇచ్చాడట, మా బాబాయి చెప్తే తెలిసింది... ప్రతి నెలా ఓ వృద్ధాశ్రమానికి ఎన్నో లక్షలు ఇస్తాడట... ఏటా ఐదుగురు పిల్లలకి చదువుకయ్యే ఖర్చంతా తనే భరిస్తాడట...' అంటూ అతన్ని హీరోను చేసే విషయాలేవో మెరిసే కళ్ళతో చెప్తుంది.

'సునంద అక్కయ్య గత జన్మలో లక్ష పూవుల వ్రతం చేసి ఉంటుంది. ఆ పూలన్నీ బంగారు కుసుమాలు అయ్యుంటాయి, పుణ్యం కొద్దీ పురుషుడు అన్నారుగా... అందుకే టన్నుల కొద్దీ పుణ్యం చేసుకుని వచ్చివుంటుంది'- తరహాలో కామాలూ, ఫుల్‌స్టాపులూ లేకుండా ఆ భార్యాభర్తలిద్దర్నీ ఎత్తేస్తూ ఉంటుంది.

సూర్యకి కాలిపోయి "ఆయనో సూపర్ మ్యానూ... ఈవిడ అతగాడికోసం పూజలు చేసొచ్చింది..." అంటాడు.

## బెంజమిన్ ఫ్రాంక్లిన్ చతురోక్తులు



అమెరికా దేశ మూల పురుషుల్లో ఒకరైన బెంజమిన్ ఫ్రాంక్లిన్ గొప్ప రాజకీయవేత్త, పరిపాలనాదక్షుడు. అంతే కాదు, ఆయన మంచి సాహితీవేత్త, విద్యావేత్త, శాస్త్రవేత్త కూడా. వివిధ సందర్భాలలో ఆయన పేల్చిన చతురోక్తులు కొన్ని...

### బీరు దొంగలనేం చేయాలి?

ఒకసారి బెంజమిన్ పొరుగువాడు ఆయన సలహాకోసం వచ్చాడు. 'పెరట్లో పీపాలో దాచిన బీరు బాటిళ్లను దొంగలు ఎత్తుకుపోతున్నారు? దీనికేం చేయాలి?' అని ప్రశ్నించాడు.

దానికి బెంజమిన్ నవ్వుతూ 'ఆ పీపా పక్కనే ఖరీదైన వేరే మద్యాన్ని ఉంచితే ఆ దొంగలు బీరు బాటిళ్లను వదిలేస్తారు' అన్నారు.

'అదేంటి.. అప్పుడు ఆ మద్యంపై వాళ్ల కన్ను పడుతుంది కదా?' అన్నాడు పొరుగువాడు.

'మరి అంతేకదా మిత్రమా! ఈ లోకంలో ఒకటి కావాలనుకుంటే మరొకదాన్ని కోల్పోవాల్సివుంటుంది కదా?' అన్నారాయన.

"పోనీ, పూజలు కాకపోతే లంచాలిచ్చి ఫలానా వాడే కావాలని రిజర్వ్ చేసుకుని ఉంటుంది... ఓకేనా?" గీత ముసిముసి నవ్వులు...

"ఆ లంచాలేవో నువ్వు కూడా ఇచ్చి ఇంకో సూపర్‌మ్యాన్ని తాళ్ళతో కట్టేసుకోలేకపోయావా?"

"అలాగే చేసేదాన్నేమో... కానీ నీ ఆరాధనా చూపుల్తో నన్ను కట్టిపడేశావుగా"

"అందుకని పాపం నువ్వు బలైపో

యావు... కదూ?"

"ఛ... ఊరుకో, చిన్నపిల్లాడిలా ఉడుక్కుంటావేంటి?"

"మరి నీకు జూనియర్ సూపర్‌మ్యాన్ దొరకలేదని లోలోపల చింత కదా?!"

"చెత్త మాటలు మాట్లాడకు... నువ్వేనా సూపర్‌మ్యాన్, స్పైడర్‌మ్యాన్... జేమ్స్‌బాండ్.. గోంగూరా... ఆవకాయా..."

"ఏంటీ..."

"అవును. నాకు గోంగూరా, ఆవకాయా ఎంతిష్టమో నువ్వంటే కూడా అంతే ఇష్టం"

ఇకదాంతో అయిసైపోతాడు సూర్య.

★ ★ ★

అలా గీతకి పాత జ్ఞాపకాలు కళ్ళ ముందు మెదిలాయి.

ఆమె ఇల్లు చేరిన కాసేపటికి పిల్లలు స్కూలు నుండి వచ్చారు. వాళ్ళ పనులు చేస్తోందే గానీ, ఆలోచనలు సాగుతూనే ఉన్నాయి.

తాను దగ్గరగా చూసిన అనేకమంది మగవాళ్ళ మధ్య రామ్మోహన్ బావయ్య మణిపూసలా అనిపించేవాడు. కానీ, అతను నిజానికి పైపై అందాలు చిందించే గాజుపూసేనా? హీరోలా తలపించిన జీరోనా? అక్కయ్యకీ, అతనికీ మధ్య సత్సంబంధాల్లేవా? అదెలా... సీతారాముల్లా, శివపార్వతుల్లా కనిపించేవారే? అదంతా ఉట్టిదేనా? భ్రమేనా? నిజంగా ఒకరిమీద ఒకరికి ప్రేమ, గౌరవం లేకపోతే సన్నిహితంగా ఎలా మెలగ్గలరు? అసలు ఒకింట్లో ఎలా జీవించగలరు? అంతా అయోమయంగా ఉంది.

పిల్లలు హోంవర్క్ చేసుకుంటూ కూర్చుంటే అంతులేని ఆలోచనలకు బ్రేక్ వేసే ఉద్దేశంతో లో సౌండ్‌లో టీవీ పెట్టుకుని కూర్చుంది.




**పో**లీస్ ఇన్‌స్పెక్టర్ బోసు ఎంత మృదువుగా మాట్లాడగలడో, అవసరమైతే అంత ర్యాష్‌గా మాట్లాడగలడు. నేరగాళ్ళను అదుపులోకి తీసుకున్నప్పుడు ఉగ్ర నరసింహావతారం ఎత్తక తప్పదు. ఆవేశం అదుపు తప్పి బూటుకాలితో తన్నిన సందర్భాలూ ఉన్నాయి.

స్ట్రిక్ట్ ఆఫీసరైన బోసు 'చండశాసనుడు' అనే బిరుదు సంపాదించుకున్నాడు. మొత్తానికి ఎవరి ప్రలోభాలకూ లొంగక నమ్మిన సిద్ధాంతాలకు కట్టుబడి వుంటాడు. మోరల్ వాల్యూసూ గట్రా మూటగట్టి అటకమీద వెయ్యలేదు. ఎన్నిసార్లు ఎంత కష్టమనిపించినా వాటినెప్పుడూ మోస్తూనే ఉంటాడు. స్త్రీలతో మాట్లాడేటప్పుడు చాలా మర్యాదగా, మన్ననగా ఉంటాడు. ఒకవేళ వాళ్ళు నేరం చేశారని తెలిసినా అది నిరూపణ కానంతవరకూ దోషిగా చూడడు, దుర్భాషలాడడు. మరీ విసిగిస్తే తప్ప దురుసుగా కూడా మాట్లాడడు.

మనిషికి ప్రొఫెషనల్ లైఫ్ ఎంత ముఖ్యమైందో, పర్సనల్ లైఫ్ అంతకంటే అవసరమైంది. వ్యక్తిగత జీవితం గనుక సరిగ్గా లేకుంటే ఇతరత్రా కూడా అరాచకంగా, అల్లకల్లోలంగా ఉంటుందని నమ్ముతాడు.

రామ్మోహన్ గురించి ఇంతవరకూ ఒక

నెగెటివ్ సెంటెన్స్ కూడా వినని బోసుకు భార్య ఇంట్లోనే ఉన్నా, ఆమెతో సంబంధాల్లేవని తెలిసినప్పుడు 'అతడెంతో సహృదయుడు కనుకనే ఆమె సెక్సువల్ ప్లెజర్ ఇవ్వకపోయినా ఇంట్లో ఉండనిచ్చాడు' అనిపించింది.

సాధారణంగా ఎన్నో వ్యసనాలు ఉన్న మగవాళ్ళనే ఆడవాళ్లు దూరం పెట్టరు. తాగొచ్చి తన్నినా, ఇంకో స్త్రీతో సంబంధం పెట్టుకున్నా... అన్నిటినీ భరిస్తారు. అలాంటిది... రామ్మోహన్ వైఫ్ కొంచెం చిత్రమైన మనిషిలా ఉందే... ఎవరిది తప్పు? అతని గురించి అందరూ ఉత్తముడనే చెప్తున్నారు... పోనీ ఇష్టం లేని పెళ్ళామా అంటే కాదు.. బంధుత్వం ఉందట... వరసైనవాడు... నచ్చే చేసుకుందని చెప్పాడు ఆనందరావు. కొన్నాళ్ళు హ్యాపీగానే జీవించారట... తర్వాతే మన స్పర్థలు వచ్చాయని అన్నాడు. ఎందుకు, ఏమిటి మాత్రం తనకు తెలీదంటే తెలీదని చెప్పాడు. నిజంగానే తెలిసుండకపోవచ్చు.

భార్యాభర్తల బంధం ఎంత ఉన్నతంగా గడపడానికి వీలుందో, అంత పతనం కావడానికీ వీలుంది... కానీ, వీళ్ళిద్దరి సంసారం మాత్రం కొంచెం విడ్డూరంగా ఉంది. అతన్నందరూ దేవుడంతటివాణ్ణి చేసి మాట్లాడుతున్నారు. తెలివైనవాడు. చదువు, డబ్బు, హోదా అన్నీ ఉన్నాయి. ఏ అవకరమూ లేదు. అనాకారి అసలే కాడు. మగవాళ్ళకే ముచ్చటేసేంత అందంగా, హుందాగా ఉంటాడు. అంటే ఆవిడదే తప్పా? !

ఏ రకంగా? ఏదైనా అహంకారమా? ఒకవేళ మరెవరితోనైనా అక్రమ సంబంధం ఉందా ఆవిడకి?

నేరస్థులని చూసీ చూసీ బోసు ఆలోచనలు అలా సాగాయి. అతని ఊహలు చాలాసార్లు నిజం అవుతాయి. అంచనాలు సాధారణంగా తప్పవు.

ఇంతలో రామ్మోహన్ ఇల్లొచ్చింది. ఖాకీ దుస్తులకున్న విలువ, గౌరవం మరి వేటికీ లేవు, రావు. యూనిఫాంని చూస్తూనే ఎవరైనా వినయంగా పక్కకి తప్పుకుంటారు.

బోసు హాల్లో అడుగుపెట్టి "మిసెస్ రామ్మోహన్‌తో మాట్లాడాలి... పిలవండి" అన్నాడు.

ఇన్‌స్పెక్టర్ బోసు సోఫాలో కూర్చుని చుట్టూ కలయచూస్తున్నాడు.

సునంద బింకంగా వచ్చి అతని ఎదురుగా ఉన్న సోఫాలో కూర్చుంది.

బోసు అరనిమిషంలో ఆమెని ఆసాంతం గమనించాడు. సుమారు నలభైరెండేళ్ళ వయసుండొచ్చు. పసిమి ఛాయతో మెరిసిపోతోంది. అయిదున్నర అడుగుల ఎత్తు, దానికి తగ్గ లావుతో చూడచక్కటి సౌష్టవం. చూడగానే ఆకట్టుకునే అందం. కట్టుకున్న చీర కూడా ఆ అందాన్ని ఇనుమడింపచేసేలా, మంచి అభిరుచిని తెలియజేసేలా ఉంది. 'ఇంతందంగా ఉంది కనుకనే ఈమెని వదులుకోలేకపోయుంటాడు రామ్మోహన్' అనుకున్నాడు బోసు.

చంద్రుడిలో మచ్చలా అంత అపురూపమైన సౌందర్యం వెనుక ఆమెకళ్ళు మాత్రం కాంతిహీనంగా ఉన్నాయి. ఆ దిగులు, బేలతనం కేవలం ఈ చావువార్త విన్న తర్వాత వచ్చినవి కాదనిపించింది. బహుశా సుదీర్ఘకాలంగా ఆ కళ్ళు బాధపడుతూ ఉండివుంటాయి. ఎందుకు... భర్త వల్ల బాధ కలిగే అవకాశం లేదని తెలుస్తోంది. మరెందుకు? మరెవరైనా ఆకర్షించారా? ఆ ఆశపడిన వ్యక్తిని చేరుకోలేననే నిరాశలో కూరుకుపోయి ఉందా? ఒకవేళ అతనే ఈమె అందానికి మైమరచిపోయి ఏమైనా బ్లాక్‌మెయిల్ చేసి వశపరచుకుని ఉంటాడా? ఈ హత్య వెనుక ఈమె పాత్ర ఉందా? లేక ఈమెని కోరుకున్నవాడు చేసి

ఉంటాడా?

బోసు తన మనసులో కదలాడుతున్న అనుమానాలకి కళ్ళెం వేసి వాటిని ఎంత మాత్రం బయటపెట్టకుండా, అందరితో మాట్లాడినట్లే "ఈ హత్య ఎలా జరిగిందనుకుంటున్నారు? " అన్నాడు.

"డబ్బుకు ఆశపడి చేసి ఉంటారనే అనుకుంటున్నాం..."



''అంతేనా? ఆయనకెవరూ శత్రువులు లేరా? "

"తెలీదండీ... బయటి విషయాలు ఆయనెప్పుడూ ఇంట్లో ప్రస్తావించరు"

'ఇంట్లో విషయాలు మాత్రం మాట్లాడుకున్నారేంటి? ' అని మనసులో అనుకుని, "మీ బంధుమిత్రుల్లో ఎవరిమీదైనా అనుమానం ఉందా? " అనడిగాడు.

"లేదు... ఎవరిమీదా లేదు"

"మీతో ఆయనెలా ఉండేవారు? "

'ఆ విషయం అవసరమా? ' అన్నట్లు సూటిగా చూసింది సునంద.

"ఇది నా డ్యూటీ. యస్, మీరు కో-ఆపరేట్ చేయాలి..."

"వేరే ఏమైనా అడగండి... పర్సనల్ విషయాలెందుకు? వాటివల్ల జరిగేదేమీ ఉండదు"

"లేదు. అన్ని కోణాల్లోంచి దర్యాప్తు చేస్తేనే హంతకుల్ని పట్టుకోగల్గుతాం..."

"అన్యాయమండీ... నాతో ఆయన కోపంగా మాట్లాడేవారా, ప్రశాంతంగా మాట్లాడేవారా అనే దాన్నిబట్టి హంతకుల ఆచూకీ తెలుస్తుందా? "

"కొన్ని విషయాలు ఎక్స్‌ప్లెయిన్ చేయలేం... కానీ, ఒకటి మాత్రం చెప్పగలను.. చనిపోయిన వ్యక్తికి ఎవరెవరితో



భావన కలిగింది. ఈ విషయం మూడో వ్యక్తికి తెలీదనుకుంది. కానీ పోలీసుల వరకూ వెళ్ళిందా? అంటే తాను ప్రదర్శించిన డాంబికం అంతా పొగమంచులా తేలిపోయిందా? భవనంలా కాపాడుకొస్తున్న పరువు పేకమేడలా ఒక్కసారిగా కూలిపోయిందా? తమ గుట్టంతా రట్టు అయ్యిందా? అవున్లే... నివురు కప్పిన నిప్పు కాలకుండా ఉంటుందా? నిజం ఎన్నటికైనా అసలు బయటపడకుండా ఉంటుందా?

క్షణంలో ముసిరిన ఆలోచనల నుండి తేరుకుని "ప్లీజ్... దయచేసి నన్ను ఇబ్బంది పెట్టొద్దు. ఆయనెటూ చనిపోయారు. ఇక మా ఇద్దరి సంబంధబాంధవ్యాల గురించి తెలియాల్సిన అవసరం ఉందా? ఇంట్లో అందరూ మేం సఖ్యంగా ఉన్నామనుకున్నారు. మీరిప్పుడు గతం తవ్వి దానికి భంగం కలిగించొద్దు. ఈ సంగతులు అందరికీ తెలిసినందువల్ల పరువు పోవడమే తప్ప చేకూరే మేలు ఏమీ ఉండదు" అంది చాలా మెల్లగా బతిమాలుతున్నట్టుగా.

సునంద కళ్లలో నీరు నిండింది. ఆమె స్వరం బాధతో ఒణుకుతోంది.

ఎంత పోలీసు ఆఫీసరయినా బోసు మనసు కరిగింది. కరడుగట్టిన నేరస్థులతో అయితే కఠినంగా వ్యవహరించగలడు.

ఎలాంటి రిలేషన్స్ ఉన్నాయి అనేదాన్ని బట్టి మాకు అవసరమైన సమాచారం దొరుకుతుంది"

ఇక సునంద వాదించడానికి ఇష్టపడక "బాగానే ఉండేవారు" అంది.

బోసు ఒక క్షణం ఆగి "లేదు... అబద్ధాలు చెప్పొద్దు... మీరిద్దరూ ఒకింట్లో ఉంటున్నప్పటికీ... ఉత్తర దక్షిణ ధ్రువాల్లా మెలుగుతున్నారని విన్నాను..."

సునందకి భూమిలోకి కుంగిపోతున్న

కానీ పరిస్థితుల ప్రభావంతో, నిస్సహాయ స్థితిలో నేరం చేసినవారి మీద ఎంతైనా కారుణ్యం కలగడం సహజం. సునంద దుఃఖాన్ని చూస్తే కొంచెం మనసు ఆర్ద్ర మైంది. అతన్ని ఆకట్టుకుంది ఆమె అందం కాదు. ముఖంలో తొణికిసలాడుతున్న నిర్మలత్వం, నెమ్మదితనం అతన్ని ఆకర్షిం చాయి. అంతమాత్రాన తన బాధ్యతను విస్మరించలేడు. కనుకనే "నేను మళ్లీ వస్తాను" అనేసి వెళ్ళిపోయాడు.

అన్నట్లుగానే రెండోరోజు ఇన్‌స్పెక్టర్ బోసు మళ్లీ వచ్చాడు.

సునందకు బాధతోపాటూ చిరాకూ కలి గింది.

## కొత్తగాలి...

**వాళ్లు**
**వేసే వేషాలు! చేసే మోసాలు!**
**నమ్మకు!**
**నీ ఓటు అమ్మకు!!**

– *ఎ. జనార్ధనం, విశాఖపట్నం*

తెచ్చిపెట్టుకున్న ప్రసన్నత్వంతో వచ్చి ఎదురుగా కూర్చుంది. బోసు కనుసన్నను అర్థం చేసుకుని అంతకు ముందురోజులాగే ఆవేళ కూడా అందరూ ఆ చుట్టుపక్కల లేకుండా వెళ్ళారు.

ఎవరూ దగ్గర్లో లేరని నిర్ధారించుకున్న తర్వాత "నేను... మిమ్మల్ని కొన్ని ప్రశ్నలు అడగాలి. ఇట్స్ మై డ్యూటీ... ఆవేశాలు, ఆందోళనలు లేకుండా చెప్పండి. మీరు ఎవరినైనా ఇష్టపడ్డారా?" అన్నాడు బోసు.

సునందకు ఒక నిమిషం అతను ఏమ డుగుతున్నాడో అర్థం కాలేదు. అతనడిగిన ప్రశ్నను కూడగట్టుకుని స్మరించుకుని "ఏంటీ!" అంది.

"మీ భర్తను కాకుండా ఇంకెవరినైనా ఇష్టపడ్డారా?"

"మీరు పోలీసాఫీసరు కదాని ఎలా అంటే అలా మాట్లాడ్డం భావ్యం కాదండీ"

"మరి... మీ వారికి ఎందుకు దూరంగా వున్నారు?"

"అది పూర్తిగా పర్సనల్... దయచేసి ఆ విషయాలు అడక్కండి"

"కానీ, మాకు తెలుసుకోవాల్సిన అవ సరం ఉంది"

"అన్యాయం... ఆయన్ని చంపినవాళ్ళని పట్టుకోడానికీ, మా ఇద్దరి అన్యోన్యత గురించి అడగడానికీ ఏమైనా సంబంధం ఉందా?"

"ఇన్ బిట్వీన్ లైన్స్ అనే మాట ఎప్పు డైనా విన్నారా? పైకి కనిపించే విషయాలే కాదు, కనపడని అంతస్సూత్రాలెన్నో ఉంటాయి. మానవ సంబంధాల్లో అవి చాలా కీలకమైనవి"

సునందకి ఒక్క ముక్క అర్థం కాలేదు.

"ఇంతకీ మీరసలు నేరస్థులు ఎవరో కని పెట్టాలనుకుంటున్నారా లేక ఆయన రహ స్యాలు తెలుసుకోవాలనుకుంటున్నారా?"

"నేనేం ఆయన జీవిత చరిత్ర రాయడా నికి రాలేదు" విసిగిపోయిన బోసు కరుగ్గా అన్నాడు.

"మేమిద్దరం చాలాకాలంగా కలిసుం డటం లేదు... ఈ ముక్క నాతో చెప్పిం చాలనేదే కదా మీ ఉద్దేశం... చాలా?"

"అది, మీరు చెప్పకుండానే తెలుసుకు న్నాను... కానీ... కారణం ఏమిటి? మీరు ఎవర్నయినా..."

"ఎంత పోలీసైనా ఒక స్త్రీతో మీరిలా మాట్లాడొచ్చా?"

"నేనో పోలీసాఫీసరనే సంగతి మర్చి పోయి... ఏదో పోకిరీగాడిలా జమక ట్టొద్దు. నేను నా డ్యూటీ చేస్తున్నాను...

ఆవేశాలూ, ఆర్గ్యుమెంట్లూ లేకుండా అడిగిం దానికి జవాబు చెప్పండి" ఈసారి బోసు గొంతులో వెతికిచూసినా సౌమ్యం లేదు. 'ఏదో ఆడమనిషి... ఏ దుర్బల క్షణంలో తప్పు చేయాల్సొచ్చిందో అని తాను కనిక రంతో మాట్లాడుతోంటే చెట్టెక్కి కూర్చుం టోందే అనిపించింది.

"నేను అలాంటిదాన్ని కాను..." అంది సునంద ఆగ్రహాన్ని అణచుకుని.

"ఎలాంటివారని నేనడగలేదు... ఎవ రైనా మీ మనసులో..."

"లేదు... నేను నా భర్తని తప్ప ఇంకె వర్నీ ఇష్టపడలేదు"

"మరి అతనికెందుకు దూరంగా ఉన్నారు?"

"ఆయనకి ఇంకో స్త్రీతో..." సునంద చెప్పలేక ఆపేసింది.

"అది మీ అనుమానం కావచ్చుగా"

"కాదు, నిజమే"

"కానీ, అందరూ రామ్మోహన్ దేవుడని చెప్తున్నారే..."

"హు... దేవుడు. దేవుళ్ళు మాత్రం తిన్నగా ఉన్నారా? శివుడు, వెంకటేశ్వ రుడు, శ్రీకృష్ణుడు... దేవుళ్ళూ మగవాళ్ళే కదా... ఒక్కరు సరిపోరు..."

"ఆ కోపాన్ని కసిగా మార్చుకున్నారా?"

"నన్ను నేనే దహించుకున్నాను"

"మీ వేదనను నేనర్థం చేసుకోగలను... కానీ... ఒక ప్రాణం పోయిందిగా..."

"ఇంతకీ ఎవరావిడ?"

"మమత... అని..."

"ఎక్కడుంటుంది?"

"బంజారాహిల్స్"

"వాళ్ళిద్దరి మధ్యా రిలేషన్ ఉందని మీకె వరు చెప్పారు?"

"ఎవరో చెప్పినా నేను నమ్మక పోయేదాన్నేమో... స్వయంగా చూశాను"

"అదెలా?"

"ఆమె... ఎవరో కాదు... ఆయనకి మేనత్త కూతురు. మామూలుగా వచ్చి వెళ్తుండేది... నేను కూడా ఆత్మీయంగా ఉండేదాన్ని.. కానీ..." చెప్పలేక ఆగిపో యింది.

"ఎమోషనల్‌గా ఫీలవకుండా చెప్పండి..." అన్నాడతను.

సునందకి గతం కళ్ళముందు మెది లింది.

"...ఆ క్షణాలు గుర్తొస్తే నాకిప్పటికీ గుండె దడదడలాడుతుంది. నేను మా పిన్ని కూతురు ఇంటికని బయల్దేరాను... అయితే తన డ్రెస్ ఒకటి మాఇంట్లో మర్చి పోడాన దానికోసమని వెనక్కి వచ్చాను. స్టోర్ రూం పక్కగా వెళ్తోంటే నా భర్తగొంతు వినిపించింది... ఏదో రహ స్యంగా చెప్తున్నట్లుంది.

'ఇదేంటి... ఈ గుసగుసలేంటి? ఈయన ఎవరితో మాట్లాడుతున్నారు... అంత మెల్లగా ఏదో రహస్యంలా చెప్పా ల్సిన అవసరం ఏమిటి?' అని ఆశ్చర్య పోతూ నిలబడ్డాను.

'ఎన్నాళ్ళయిందే.. నీతో గడిపి. చూస్తూ చూస్తూ పదిహేను రోజులు దాటింది. రాత్రికి చూడు, స్వర్గం చూపిస్తా' అది రామ్మోహన్ స్వరం.

'ష్.. మెల్లగా.. నీకంతా ఆత్రమే...' బదులిచ్చింది మమత.

సునందకు తేళ్ళూజెర్రులూ పాకినట్ల యింది.

తను బయలుదేరి అప్పటికి పావుగంటే అయింది. కారు కొంతదూరం వెళ్ళాక గుర్తొచ్చింది. తాను కార్లో కూర్చుని డ్రైవర్ని పంపిద్దామనుకుంది.. కానీ అతనికి డ్రెస్ ఎక్కడుందో చెప్పినా అర్థం కాదని, స్వయంగా వచ్చింది. లేకపోతే ఆ భాగోతం తెలిసేదే కాదు. అయినా ఈ కాసేపట్లో వీళ్ల అందరి కళ్ళూ కప్పి ఈ

స్టోర్‌రూంలోకి ఎప్పుడు చేరారు? వీళ్ళకి క్కడ సరసాలేంటి? తనేం లోటు చేసిం దని ఇతనికీ వంకర బుద్ధి? మమతక యినా సిగ్గు ఉండనక్కర్లేదా? మొగుడూ, సంసారం ఉండి... బావతోనా? ఆ మాట్లాడే తీరు చూస్తే వీళ్ళకిది అలవాటే నని అర్థమవుతోంది. తాను ఎంత గ్రహింపు లేకుండా గుడ్డిగా బతుకు తోంది.... మొన్న పార్టీలో భుజమ్మీద చెయ్యేసినప్పుడే గ్రహించాల్సింది... ఏదో వంకన చెయ్యి తాకించి సంబరపడుతు న్నాడు, చిన్న వెకిలితనం అనుకుందేగానీ ఇంత నీచానికి దిగజారుతాడని ఊహించ లేదు.

మనసంతా ఏహ్యత నిండగా తలుపు ఒక్క తోపు తోసింది.

ఆమె వస్తుందని ఊహించి ఉండరు... తలుపు వేసుకోలేదు... ఆవేళ్టి వారి భంగిమ తల్చుకుంటే కళ్ళలో ఇప్పటికీ ఇంకా ఏహ్యత.

అదంతా గుర్తుచేసుకుని "ఆ క్షణాలు తల్చుకుంటే చాలు.. ఎంత వేదన కలుగు తుందో మాటల్లో చెప్పలేను. ఇలాంటి దౌర్భాగ్యాలు చూసే గతి ఏ ఇల్లాలికీ పట్ట కూడదు. ఆ నీచాన్ని జీర్ణించుకోలేకపో యాను. ఇంకా అక్కడుండటం దుర్భరం అనిపించింది. క్షణం కూడా అక్కడ నిలు వలేక, వచ్చిన పని వదిలేసి, పరుగులాంటి నడకతో వెళ్ళి కారెక్కాను..." అంటూ క్లుప్తంగా విషయం చెప్పింది సునంద.

అది విన్న బోసు "ఆయన మిమ్మల్ని క్షమించమని అడగలేదా?" అన్నాడు.

"అడిగాడు, నేను కరిగాను... కానీ అదే తప్పు మళ్ళీ మళ్ళీ చేస్తే దాన్నేమనాలి? మమతతో సంబంధం తెంచుకోమని ఎంతో నచ్చజెప్పాను, బెదిరించాను... హెచ్చరించాను... నా సంసారంలో ఉన్న దిగులు, విషాదం చెప్పుకుంటే తీరేది కాదు... ఆయన వస్తాడని అభిసారికలా ఎదురు చూసేదాన్ని... తీరా మరెవరి తోనో గడిపి వచ్చాడని అర్థమై హృదయం రగిలిపోయేది. తీరని అశాంతి కలిగేది. కొన్నిసార్లు కలవడంలేదని అబద్ధం చెప్పే వాడు. ఇంకొన్నిసార్లు 'ఈ ఒక్కసారికి క్షమించేయి... ఇంకెప్పుడూ మరో ఆడ దాన్ని తలవనైనా తలవను' అనేవాడు. 'ఎన్నిసార్లు ఇలా వంచన చేస్తావు... కుక్క తోక వంకరలా నీలో మార్పు రాదా?' అని ఛీత్కరించుకుంటే 'నా ఇష్టం.. ఆమెతో మాత్రమే కాదు... ఇంకో అరడ్జ మందితో ఉంటాను. నిలదీయడానికి నువ్వెవరు? నోర్మూసుకుని పడుండు' అనే శాడు. అతను ఎంత నీచుడో స్పష్టమ య్యేది. ఇంత హీనుడిని పెళ్ళి చేసుకు న్నానా... ఇన్నాళ్ళూ కళ్ళు మూసుకుని కాపురం చేశానా? అని నా మీద నాకే కోపం వచ్చేది. చివరికి సంబంధం తెగతెం పులు చేసుకోవడం తప్ప నాకు మరో పరి ష్కారం కనిపించలేదు. కొందరు ఆడ వాళ్ళు మొగుడు అనేవాడు ఎలాంటివా డైనా రాజీపడతారు. అదెలాగో నాకు తెలీదు... నాకు మాత్రం అతనంటే రోత కలిగింది... అసహ్యమేసింది. అందుకే దూరమయ్యాను. ఒకే ఇంట్లో ఉంటూ మానసికంగా, శారీరకంగా దూరంగా ఉన్నాను. అదంత సులభం కాదని మీరు ఊహించగలరు కదా!

... ఒట్టప్పుడంతా చవకబారు ఆడవా ళ్ళతో గడిపొచ్చి... ఎవరూ దొరక్కపోతే అప్పుడు నాకోసం వెంపర్లాడేవాడు... నాకు అతనంటే ఎంత అసహ్యం, రోత కలిగా యంటే అతని చెయ్యి తాకితే తేళ్ళు పాకిన ట్లుగా అనిపించేది. కోరిక తీర్చనందుకు 'నేను పెట్టింది తింటూ, నా ఇంట్లో ఉంటూ... నాకు దూరంగా ఉంటావా?' అని బూతులు తిట్టేవాడు... తన్నేవాడు...

ఆ చేదు జ్ఞాపకాలన్నీ ఇంకా కళ్ళముందు మెదుల్తున్నాయి..." అంటూ చెప్పుకొచ్చింది సునంద.

"అవును... మగవాడికి అక్రమ సంబంధాలున్నా... ఎప్పుడో ఒకప్పుడు పెళ్ళామూ కావాలిగా? "

"కానీ.. ఆ పెళ్ళానికి శరీరం మాత్రమే కాదు... మనసు కూడా ఉంటుందని మర్చిపోతారు"

"అయినా... ఇష్టం లేకపోతే విడిపోవాలిగానీ... చంపడం న్యాయం కాదుగా? "

సునంద మిన్ను విరిగి మీద పడినట్లుగా చూసింది.

"ఏంటీ? నేను చంపానా? "

బోసు మౌనంగా 'ఈమె ఆశ్చర్యాన్ని నటిస్తోందా... లేక... ఈ హత్యలో ఈమె ప్రమేయం లేదా?' అని సాలోచనగా చూశాడు.

"నన్ను చూస్తే చంపేంత తెగువ కనిపిస్తోందా? " విరక్తిగా నవ్వింది.

"ఊహూ... మీరు చంపలేదు... అది మీకు చేతకాదని మాత్రం అర్థమౌతోంది... కానీ..."

"మళ్ళీ కానీ ఏంటండీ? "

"ఎవరు హెల్ప్ చేశారు? "

"ఏంటండీ... నేనిలా జీవచ్ఛవంలా ఉండటం కూడా మీకిష్టం లేదా? నన్ను జైల్లో పెట్టిస్తారా? "

"మీరు నిజం ఒప్పుకుంటే... శిక్ష తక్కువ పడేలా నేను చూస్తాను... కానీ... నిజానిజాలేంటో నాకు స్పష్టంగా చెప్పండి"

"నన్ను నమ్మండి... నేను చంపించలేదు... నా పిల్లల మీద ఒట్టు..." అంటోంటే సునంద కళ్ళు కాలువలు కట్టాయి.

బోసు బ్లాంక్‌గా చూశాడు.

"నా మొగుడు అనుకున్నవాడు ఇతర స్త్రీలతో సంబంధాలు సాగిస్తోంటే ఆ అరాచకాన్ని భరించలేక దూరంగా ఉన్నాను. అందుకు బూతులు పడ్డాను, తన్నులు తిన్నాను. అయినా నేను లొంగలేదు. లోలోపల నరకయాతన అనుభవిస్తూ చూసేవాళ్ళకి సుఖసౌఖ్యాలు అనుభవిస్తోన్నట్లు భ్రమ కలిగించాను... అక్కణ్ణించి

## కొత్త ఆలోచనలకు బీజం?

బెంజమిన్ ఫ్రాంక్లిన్‌ను భోజనం బల్ల దగ్గర 'కొత్త విషయాలను మీరెలా కనుక్కుంటారు?' అని స్నేహితుడు అడిగాడు.

అప్పుడాయన ఇంగ్లండ్ నుండి దిగుమతి అయిన మద్యాన్ని ఓ సీసాలోంచి పాత్రలోకి



పోస్తున్నాడు. ఆ సీసాలోంచి నాలుగు చచ్చిన ఈగలు పడ్డాయి. వాటిని తీసి స్నేహితుడికి చూపిస్తూ 'వీటిని ఎండలో ఆరబెడితే మూడు గంటల లోపు అందులో రెండోమూడో చైతన్యం పొంది, కాళ్లు విదిల్చి, కళ్లు నులుముకుని, తాము అమెరికాకు వచ్చిన సంగతి తెలియక ఎగిరిపోతాయి' అన్నారు.

'దీనిద్వారా ఏ కొత్తవిషయాన్ని కనుగోవచ్చు మిస్టర్ ఫ్రాంక్లిన్?' అన్నాడు మిత్రుడు కుతూహలంగా.

'నీటిలో మునిగి చచ్చినవారిని బతికించేందుకు వారి కళేబరాలను ఎండలో ఆరబెట్టే విధానాన్ని కనుక్కునేందుకు ఇది నాంది కావచ్చు కదా?' అన్నారాయన సీరియస్‌గా.

చచ్చినవారిని బతికించడం ఎలా సాధ్యమని కొన్ని క్షణాలు అయోమయంలో పడ్డ మిత్రుడు ఆ తర్వాత ఆయన తనతో హాస్యమాడుతున్నాడని గ్రహించి నవ్వాపుకోలేక పోయాడు.

పారిపోయే అవకాశం లేక అక్కడే ఉండి దుర్భరంగా బతికాను" ఆమె పూడుకుపోయిన గొంతుతో చెప్పింది. సంవత్సరాల తరబడి దిగమింగిన దుఃఖం ఇన్నాళ్ళకి బయటికొచ్చింది.

కొన్ని విషయాలకి రుజువులూ, సాక్ష్యాలూ అక్కర్లేదు. సునందది దొంగ ఏడుపు కాదు. తెచ్చిపెట్టుకున్న నటన కాదు. పోలీసైన బోసే కాదు, అతని తాతయినా నమ్మి తీరాల్సిందే.

ఇప్పుడు అతని మనసులో ఎలాంటి సందేహమూ లేదు.

రామ్మోహన్ భార్య సునంద హత్య చేసి ఉంటుందనే అనుమానం అక్కడితో రూపుమాసిపోయింది.

"సారీ.. ఇట్సోకే... మిమ్మల్ని ఇలా సస్పెక్ట్ చేసినందుకు మీరేం వర్రీ అవక్కర్లేదు... కేస్ ఇన్వెస్టిగేషన్లో ఇదంతా కామన్ అని మీరు అర్థం చేసుకోవాలి... అన్ని కోణాల్లో ఆలోచించడం మా డ్యూటీ..." అన్నాడు.

"అసలు నా మీద అనుమానం వస్తుందని కల్లో కూడా అనుకోలేదు... ఏదో వివరాలు అడుగుతున్నారనే అనుకున్నాను" ఇంకా నమ్మలేనట్లుగా అంది సునంద.

"రకరకాల కారణాలతో చంపే, చంపించే భార్యలూ ఉన్నారుగా... మీ ఇద్దరి రిలేషన్షిప్ సవ్యంగా లేకపోవడంతో సహజంగానే మీమీద డౌటొచ్చింది"

"నన్ను నమ్మినందుకు థాంక్స్.. మీ అనుమానం ఇంకా బలపడి... అందరి ముందూ పరువుతీస్తే... ఇంకేమైనా ఉందా? దేంట్లోనైనా దూకి చావాల్సిందే"

"అనుమానిస్తే చనిపోతారా... అంత బేలతనం పనికిరాదు... ఆత్మహత్య ఒకరకమైన సైకలాజికల్ ప్రాబ్లం తెలుసా? నన్నడిగితే నీతిలేనివాళ్ళని చంపినా పాపం లేదు... కాకపోతే.. మన చట్టాలు ఒప్పుకోవు"

"మీరింత ఓపెన్‌గా ఉన్నారు గనుక... నేనో నిజం చెప్పనా... ఆయన నిర్లజ్జగా సంబంధాలు నడుపుతున్నాడని గ్రహించినప్పుడల్లా గుండె రగిలిపోయేది... చంపాలన్నంత ఆవేశం వచ్చేది... కానీ... అతను నాతో నిజాయితీగా లేకుండా నీతిమాలాడన్న కోపమే తప్ప... ఇదేం అన్యాయమన్న ఆక్రోశమే తప్ప... ఇంకేం చేస్తాను... నేనే కాదు... చాలామంది ఆడవాళ్ళు బహుశా ఇలాగే నిస్సహాయంగా ఏడుస్తూ జీవితాలు గడిపేస్తారు... మాకు కుట్రలు చేతగావు... ఎంత కోపతాపాలున్నా మేము ఏమీ చేయం..."

"..."

"... సంవత్సరాల తరబడి నేను రగిలిపోయానేగానీ.. ఆయనకి ఆ సెగ అయినా తాకలేదు..."

"చెప్పడం తేలికేగానీ... భరించడం దుర్భరమే" అన్నాడు బోసు.

"ఆడవాళ్ళ పరిస్థితి... ఇంతేనాండీ? "

"ఆడవాళ్ళయితే మాత్రం అందరూ ఒకలా ఎందుకుంటారు? మీరు చెప్పిన మమత... మీలాంటిది కాదుగా? "

సునంద బదులు చెప్పలేకపోయింది

"సరే... మమత అడ్రెస్ చెప్పండి..."

"ఇప్పుడు ఆమెని అనుమానిస్తారా? ఏవండీ... మీరు అసలు హంతకులెవరో సరిగ్గా ఆలోచించకుండా ఇలా కనిపించిన వాళ్ళందర్నీ అనుమానిస్తారా? "

బోసుకి చాలా చిరాకేసినా కంట్రోల్ చేసుకుని "ఐ నో బెటర్... ఆ హత్య చేసింది కేవలం డబ్బు కోసం అయితే కాదు... ప్లాన్డ్‌గా చేసిన మర్డర్... ప్రొఫెషనల్ ఎనిమీస్ ఎవరూ లేరని చెప్తున్నారు కనుక అతనితో సంబంధ బాంధవ్యాలు ఉన్నవారినే అనుమానించాల్సి వస్తుంది"

"మీక్కోపం రాకపోతే... ఒక్క సంగతి... సరే, నేనంటే ఆయనకి దూరంగా ఉన్నాను కనుక కోపం పెంచుకుని చంపించాను అని మీరు అనుమానించినా అర్థముంది... కానీ... ఆయనతో రిలేషన్ సాగించే మమత ఎందుకు చంపిస్తుంది? ఆయన బతికుంటేనే ఆమెకి డబ్బులు రాలతాయి..."

"అవన్నీ ప్రొఫెషనల్ సీక్రెట్స్... హత్యలకి, ఆత్మహత్యలకీ చాలా కారణాలు ఉంటాయి. వాటిని డిఫైన్ చేయడం కుదరదు. డిస్కస్ చేయడం అసలే భావ్యం కాదు. ఏదేమైనా మీకు అసౌకర్యం కలిగించినందుకు సారీ... అవసరమైన విషయాలు దాపరికాలు లేకుండా చెప్పి కో-ఆపరేట్ చేశారు. ఓకే... మళ్లీ ఏదైనా సమాచారం కావలసివస్తే ఫోన్ చేయడమో... రావడమో చేస్తాను..." అన్నాడు.

సునంద అలాగేనన్నట్లు తల పంకించింది.

★ ★ ★

ఇన్స్పెక్టర్ బోసు వెళ్లేసరికి మమత ఆఫీసురూంలో కూర్చుని ఫోన్లో మాట్లాడుతోంది.

ఏ కస్టమరో అనుకుని తలెత్తి చూసింది.

తీరా పోలీసు యూనిఫాం కనిపించగానే ఆశ్చర్యంతో కళ్ళు ఆల్చిప్పలయ్యాయి. తనకు తెలీకుండానే భయం మొదలైంది.

బోసు అరక్షణంలో మమతను ఆసాంతం గమనించాడు. అయిదున్నర అడుగుల ఎత్తు ఉంది. మరీ భారీ కాయం కాకపోయినా కాస్త లావుగానే ఉంది. ముదురు నీలం మీద నల్లటి పూలున్న చీర కట్టుకుంది.

పోలీసు కావడాన ఎలాంటి భావోద్రేకాలనూ పైకి ప్రదర్శించలేదు గానీ... 'పొరుగింటి పుల్లకూర రుచి అంటారు ఇందుకే కాబోలు. సునందకీ, ఈమెకీ ఎక్కడైనా పోలికుందా? ఆమె ఎంత డీసెంట్‌గా, డిగ్నిఫైడ్‌గా ఉంది? ఈమెలో ఆ హుందాతనం లేదే? ఎర్రగులాబీ పక్కన తేలిపోయే కనకాంబరంలా ఉంది... ఖరీదైన చీరలో స్టైలిష్‌గా మాత్రం ఉంది' అనుకున్నాడు బోసు.

"నేను తర్వాత మాట్లాడతాను" అంటూ ఫోన్ పెట్టేసింది మమత.

ఆమె ఎంత దాచుకుందామన్నా తత్తరపాటు దాగలేదు. 'ఇప్పుడీ పోలీసెందుకు వచ్చినట్లు?' అనుకుని "ఏంటండీ... ఎవరు కావాలి?" అంది.

నేరం రుజువయ్యేంతవరకూ చాలా జాగ్రత్తగా మాట్లాడాలి కనుక, బోసు ఏమీ

## కొత్తగాలి...

**కొలిమిలో కాల్చితేనే**
**కాంచనం వంగేది**
**కష్టాల్లో కుంగితేనే**
**కవిత్వం పొంగేది**

– హెచ్. విజయలక్ష్మి,
అనంతపురం

పొక్కలేదు.. ఎంతమాత్రం మర్యాద అతిక్రమించలేదు.

"మిస్టర్ రామ్మోహన్ హత్య కేసులో మీతో మాట్లాడాలి..." అన్నాడు బోసు.

"అదేంటి... ఆయన హత్యకీ... మాకూ ఏం సంబంధం... వాళ్ళింట్లో అడగాలి కానీ..."

"మీరూ బంధువులేగా?" అంటూ సూటిగా చూశాడు.

"అయితే మట్టుకు ఆయన గురించి నాకేం తెలుస్తుంది?"

"తెలుసు కాబట్టే వచ్చాను..."

"లేడీస్‌ని ఇలా ఇబ్బంది పెట్టడం

భావ్యం కాదు"

"హూ... లేడీస్..." అన్నాడు బోసు.

"మా ఆయన కూడా లేరు. షాపులో ఆడవాళ్ళమే ఉన్నాం..."

"సరే... మీ భర్తను తీసుకుని స్టేషన్‌కి రండి... రాకపోతే మాత్రం కఠినచర్యలు తీసుకోవాల్సి ఉంటుంది" అని వెనుతిరిగాడు. మమత గుండె జారినంత పనయింది.

"వెళ్ళకండి... లోపలికి రండి... అసలు మీకేం వివరాలు కావాలి?" అంది కంగారు కంగారుగా.

"మీ ఆయనగారు లేకుండా నేనిప్పుడు మాట్లాడ్డం ఎందుగ్గానీ... మీరే రండి స్టేషన్‌కి..."

"అయ్యో, ఈ మాత్రానికే కోపం వచ్చిందా? రండి... కూర్చోండి" అంది.

బోసు ఓ కుర్చీలో కూర్చున్నాడు.

"కాఫీ కలిపి తెస్తాను సార్"

"ఒద్దొద్దు... అలాంటివేం ఒద్దు..."

"అయ్యో... ఎంతసేపు... ఇన్‌స్టెంటేగా... నిమిషంలో కలిపి తెస్తాను..." అని బోసు వారిస్తున్నా వినకుండా కిచెన్లోకి వెళ్ళి కాఫీ తెచ్చింది.

బోసు మర్యాదకోసం తీసుకోక తప్ప లేదు.

"చెప్పండి... రామ్మోహన్‌కీ... మీకూ ఎప్పటినుంచీ..." అన్నాడు బోసు అనవసరంగా ప్రొలాంగ్ చేయడం, సాగదీయటం ఇష్టంలేక తిన్నగా విషయంలోకి వచ్చేస్తూ.

"ఆయన ఇప్పుడు నాకు కొత్తగా తెలీడమేంటి? మా బంధువులే"

"ఆ సంగతి నాకూ తెలుసు. మీ ఇద్దరి మధ్యా అనుబంధం ఎప్పటినుంచో..." అసహనాన్ని అణచుకుని ప్రశాంతంగానే అన్నాడు.

మమత సందిగ్ధంలో పడింది. 'ఇతనికి అన్నీ తెలుసా... లేక కొన్ని తెలుసా? ఏది ఎంతవరకు తెలుసు? అసలేమీ తెలీకనూ పోవచ్చా... కేవలం అనుమానాన్ని నివృత్తి చేసుకోడానికి వచ్చి ఉండొచ్చు తాను లేనిపోని భయాలతో రహస్యాలన్నీ బయటపెట్టాల్సిన అవసరం ఉందా? అలా చెప్పి ప్రమాదాన్ని కొనితెచ్చుకున్నట్లవుతుందా... ఈ పోలీసాయనతో చాలా జాగ్రత్తగా మాట్లాడాలి...' అనుకుంది.

"మాట్లాడకుండా ఆలోచిస్తుంటే ఎలా? నేను అడిగిందానికి జవాబు చెప్పండి"

"రామ్మోహన్‌గారు నాకు మేనబావ. అంటే మాపెదమావయ్య రెండో కొడుకు"

"పెళ్ళయిన వ్యక్తితో ఎందుకు క్లోజ్‌గా ఉంటున్నట్లు?"

"ఇది మరీ బాగుందండీ... పెళ్ళయినంతలో బంధుత్వాలు వదులుకుంటామా?"

"చూడండి... మీరు తెలివిగా మాట్లాడుతున్నానని అనుకోవద్దు... వరసలు కలిస్తే శారీరక సంబంధాలు పెట్టేసుకుంటారా?"

"సార్... మీరు మరీ హీనంగా మాట్లాడుతున్నారు... ఇది భావ్యం కాదు... ఒక ఆడమనిషిననే సంగతి మర్చిపోయి అలా మాట్లాడొచ్చా?"

"గౌరవాలు ప్రవర్తనను బట్టి వస్తాయి..."

"నేను ఎవరి సొమ్మూ దోచుకుతిన్లేదు"

"సొమ్ముల ప్రస్తావన తర్వాత... ముందు మీ రిలేషన్ గురించి చెప్పండి"

"ఎంత పోలీసైనా మీరిలా మాట్లాడ్డం భావ్యం కాదు..."

"నా ప్లేస్‌లో ఇంకొకరుంటే ఇంత ప్రశాంతంగా మాట్లాడరు. మీరు ఎక్కువ సాగదీయకుండా అసలు విషయం చెప్తే సంతోషం"

"వరసకి బావ అవుతాడు గనుక రామ్మోహన్‌తో కొంచెం చనువుగా ఉండేదాన్ని. ఇంతకుమించి మా మధ్య ఇంకేం లేదు. మీరెలాంటి అనుమానాలు పెట్టుకోకండి"

"చూడమ్మా... నేను కాలక్షేపానికి మీ ఇంటికి రాలేదు. కీలకమైన సమాచారం ఉండబట్టే వచ్చాను. అనవసరంగా సమయం వృధా చేస్తే మీకే నష్టం... ఎంత ఎక్కువసేపు పోలీసు వెహికిల్ మీ ఇంటి ముందు ఉంటే మీ చుట్టుపక్కల వారికి అంత ఎక్కువ కుతూహలం కలుగుతుంది. అదలా ఉంచితే... మీరు నిజాని జాలేంటో చెప్పకపోతే.. స్త్రీ అని కూడా చూడకుండా స్టేషన్‌కి తీసుకెళ్ళాల్సి వస్తుంది... అప్పుడు పరువుపోతుంది. పోలీసు స్టేషన్లో ట్రీట్‌మెంట్ ఎలా ఉంటుందో ప్రత్యక్షంగా తెలీకపోయినా వినే ఉంటారు... ఎప్పుడైనా చెప్పక తప్పదు. మీరు చెప్పేదేదో శారీరక, మానసిక హింస లేకుండా చెప్తే మీకే మంచిది... ముందుగానే ఉన్నదున్నట్లు చెప్తే శిక్ష తగ్గే అవకాశం ఉంటుంది..."

"ఇది చాలా అన్యాయమండీ... మీరు నన్ను భయపెడుతున్నారు..."

"నేనేం బెదిరించడంలేదు... ఉన్న నిజమేంటో చెప్పమని బాధ్యతగల పోలీసుగా అడుగుతున్నాను"

"ఒక హత్య జరిగితే అతని బంధువులందర్నీ ఇలాగే విసిగిస్తారా? "

"అందరి జోలికీ ఎందుకు వెళ్తాం? దగ్గరితనం ఎక్కువుంది కనుక వచ్చాను"

"ఏ ఆధారంతో నా దగ్గరికొచ్చారు? అసలు నన్నడిగే అధికారం మీకెలా వచ్చిందండీ? "

"ఈ కేసు నాకు అప్పగించారు. హత్య ఎవరుచేశారో కనిపెట్టడంలో భాగంగా అవసరమైన వారందర్నీ ఇంటరాగేట్ చేసే రైట్ నాకుంది"

మమత అప్పటిదాకా ప్రదర్శించిన డాంబికమంతా చెల్లాచెదురైంది. చివరిగా ఇంకొక అస్త్రం ప్రయోగిస్తూ "మగవాళ్ళెవరూ లేని సమయంలో వచ్చి ఇలా బెదిరిస్తారా? " అంది.

"సరే... మీ ఆయన ఎన్నింటికి వస్తారు? ఆయన ఉన్న సమయంలోనే వచ్చి.. రామ్మోహన్‌తో ఉన్న సంబంధం గురించి చెప్పమని అడుగుతాను" అంటున్న బోసు స్వరం సౌమ్యంగా ఉన్నప్పటికీ స్థిరంగా, అల్టిమేటం ఇస్తున్నట్లుగా ఉంది.

ఇక మమత దగ్గర మరే అస్త్రాలూ మిగల్లేదు. నరాల్లోంచి వణుకు పుట్టుకొచ్చింది.

'ఇతను చాలా తెలివైనవాడిలా ఉన్నాడు. ఇలాంటివాళ్ళని ఏమార్చడం ఎవరివల్లా కాదు. ఉన్నదున్నట్లు చెప్పేయడమే మంచిదేమో! అంతా చెప్పేసి... రహస్యాన్ని కడుపులోనే దాచుకోవయ్యా... నీకెప్పటికీ రుణపడి ఉంటాను' అని బతిమాలుకోవడం మేలు అనుకుంది.

బోసు అసహనంగా కదిలి "టైం వేస్ట్ చేయకుండా త్వరగా చెప్పండి" అన్నాడు.

"నాకు గుండె దడగా ఉంది... మా సంగతి మీ వరకూ వస్తుందని ఊహించలేదు... ఇప్పుడు నాకు చాలా భయంగా ఉంది... రేపు రాకూడదా... ప్లీజ్"

"అంటే... ఇక్కణ్ణించి పారిపోదామనా? " అన్నాడు బోసు.

"ఇంత పెద్ద షాపు వదిలేసుకుని వెళ్తానా... పైగా మా ఆయనది గవర్న

## కొత్తగాలి... 

**అటు 'క్లాసు' లోనూ**
**ఇటు 'మాసు' లోనూ**
**ఇమడలేని వాడు**
**మధ్యతరగతి వాడు**

– జి. గ్రీష్మ,
కరీంనగర్

మెంటు ఉద్యోగం... పారిపోవాలన్నా పారిపోలేం..."

"దాందేముందిలే... ఆయన్ని వదిలేసి పోవచ్చు.. అయితే ఒక్కమాట... మా నుంచి ఎవరూ ఎక్కడికీ పారిపోలేరు. గుర్తుంచుకోండి..."

"మొగుణ్ణి, పిల్లల్ని వదిలేసి ఎక్కడికి పారిపోతానండీ?"

"ఒకవేళ పారిపోవాలన్నా... మీకు రెండు కళ్ళు, రెండు కాళ్ళే ఉంటాయి. డిపార్ట్‌మెంటుకి ఇంద్రుడిలా ఒళ్ళంతా కళ్ళుంటాయి. యుద్ధవిమానంలా క్షణాల్లో ఎక్కడైనా వాలగలం..."

"లేదు... నాకలాంటి ఉద్దేశమే లేదు..."

"మరెందుకు ఇప్పుడు చెప్పకుండా వాయిదా వేయడం... ఆలోచించుకుని కథ లల్లి చెప్తారా?"

"నా పిల్లల మీద ప్రమాణం చేసి నిజమే చెప్తాను.. కొంచెం గుండె నిబ్బరం చేసుకో డానికి రేపు రమ్మని అడుగుతున్నాను"

"సరే... ఒక్కరోజులో కొంపలు మునిగే దేమీ లేదు... రేపే వస్తాను" అని లేచాడు బోసు.

"ఒక్క రిక్వెస్టండీ..."

'మళ్ళీ ఏంటి?' అన్నట్టు చూశాడు.

"జరిగిందేదో జరిగింది... మా ఇద్దరి విషయం.. మరెవరికీ తెలియనివ్వొద్దు"

'హత్య వెనుక పాత్రధారి ఈమే అయ్యుంటే... తెలియకుండా ఎలా ఉంటుంది' అనుకున్నా రెట్టించకుండా "సరే" అని బయటకు వచ్చేశాడు.

మమతకు గుండె రెట్టింపు వేగంతో కొట్టుకోసాగింది. చిన్నబావతో సంబంధం వింత అనుభవాలని, మహత్తరమైన అను భూతుల్ని ఇస్తోందని మురిసిపోయింది. కానీ... పర్యవసానం ఇలా ఉందేంటి? ఇప్పుడు తన సంసారం ఏం కానుంది? అగాధంలో కూరుకుపోతున్నట్టుగా ఉందే అనుకుంది. ఆమెకు రామ్మోహన్‌తో తన సంబంధ బాంధవ్యాలు కళ్ళముందు మెది లాయి.




**మ**మతకు రామ్మోహన్ని 'చిన్నబావా' అని పిలవడం అలవాటు. ఆమె కంటికి అతను మహా సొగసుగా కనిపించేవాడు. ఆమెకే కాదు, అందరూ అతన్ని అందగా డనే అంటారు. ఆమెకి చిన్నబావని పెళ్ళి చేసుకోవాలని ఉండేది. కానీ తల్లిదండ్రు లకి బొత్తిగా ఇష్టం లేదు.

"చెప్పుకోదగ్గ చదువు లేదు... వెనక ఆస్తిపాస్తులూ లేవు, కనీసం బాధ్యత తెలి సిన మనిషైనా కాదు... ఏం చూసి వాడితో సంబంధం కుదుర్చుకుందాం...?" అన్నాడు తండ్రి వెటకారంగా.

ఇక తల్లేమో "ఎర్రగా, బుర్రగా ఉన్నా డని కట్టుకుంటే రేపు జీవితాంతం ఏడు స్తావు. వాడు కష్టపడి పెళ్ళాంబిడ్డల్ని పోషి స్తాడన్న నమ్మకం కూడా కలగడంలేదు... ఎంత జులాయిగా తిరుగుతున్నాడో నువ్వూ చూస్తున్నావుగా" అంది.

"లేదమ్మా, నాకు బావంటే ఇష్టం" ఆమె మొహమాటాల్ని అటకమీదికి విసిరేసి చెప్పింది.

"ఈ ప్రేమలకేమొచ్చెలే... ఈ వయ సులో ఇలాంటి వ్యామోహాలన్నీ

మామూలే... పెళ్ళయ్యేలోగా వెయ్యిమంది కంటికి నదరుగా కనిపిస్తారు... అవన్నీ పెళ్ళివరకూ రావు..." అంది తల్లి.

"పెద్దవాళ్ళం... అనుభవజ్ఞానంతో చెప్పినప్పుడు వినాలి. మంకుపట్టు పట్టి... వాణ్ణే చేసుకుంటానంటావా... నీ ఇష్టం... కట్టుబట్టలతో వెళ్ళిపో... ఇక నీకూ మాకూ ఎలాంటి సంబంధమూ ఉండదు" అనేసి తండ్రి విసురుగా అక్కణ్ణించి వెళ్ళిపోయాడు.

పెద్దవాళ్ళని ఎదిరించి బావని చేసుకునేంత ధైర్యం, తెగువ మమతలో లేవు. పైగా వాళ్ళు చెప్పిన తర్వాత ఆలోచిస్తే, నిజంగా బావలో ఎక్కడా కుటుంబ బాధ్యత మోసే లక్షణాలు కనిపించలేదు.

తర్వాత కొద్దికాలంలోనే మమతకి ఆంజనేయులుతో పెళ్ళయిపోయింది. భర్తకు వాటర్‌వర్క్స్‌లో ఉద్యోగం. విశాఖపట్నంలో స్థిరపడ్డారు.

ఎప్పుడైనా పెళ్ళిళ్ళు పేరంటాల్లో కలవడమే తప్ప పనిమాలా మావయ్య గారింటికి వెళ్ళింది లేదు, చిన్నబావను కలిసింది లేదు. అయితే మధ్యమధ్యలో కబుర్లు తెలుస్తున్నాయి. బావ వ్యాపారాలు చేస్తున్నాడని... తను ఎందులో దిగినా కుప్పలుతెప్పలుగా లాభాలు ఆర్జిస్తున్నాడని, కీర్తిప్రతిష్టలు సంపాదించాడని, నలుగురూ చెప్పుకుని గర్వించేలా ప్రయోజకుడయ్యాడని... బంధుమిత్రుల ఆదరణ పొందుతున్నాడని... తెగ చెప్పేవారు.

ఓరోజు "నేను చేసుకుంటానంటే... కాదూ కూడదూ అన్నావు... బావకి పూచికపుల్లంత విలువివ్వలేదు. ఇప్పుడు చూడు... నవ్విన నాపచేనే పండినట్లయింది. నాలుగు చేతులా సంపాదిస్తున్నాడు... వద్దంటే డబ్బొస్తోందట..." అంటూ మమత ఉక్రోషంగా దెబ్బలాడింది తల్లితో.

"సరేలేవే... నీకు వాడితో రాసిపెట్టి లేదు... కనుకనే మాకప్పుడు బుద్ధి పుట్టలేదు" అందావిడ తాపీగా.

మమతకి కచ్చపుట్టి "కనీసం పొరపాటని కూడా ఒప్పుకోవా? నేనసలు మీ మాట వినడమే పొరపాటైంది" అంది.

"ఇప్పుడు నీకేం తక్కువైంది? మేం వెతికి తెచ్చినవాడు బంగారం కాదేంటి? " అంది తల్లి.

"బంగారమో, వెండో తర్వాత సంగతి... అసలు చంకలో బిడ్డను పెట్టుకుని వెతికి తేవాల్సిన అవసరం ఎందుకొచ్చింది? "

"ఇప్పుడు గుంజాటనలు, గింజుకోడాలూ ఎందుకు? అల్లుడు నిన్ను పూవుల్లో పెట్టి చూసుకోడంలా? "

"ఔనౌను. పొద్దున్నే క్యారియర్ పట్టుకుని వెళ్ళి సాయంత్రం దిగుతాడు... గుమస్తాగిరీ కూడా ఓ ఉద్యోగమేనా? తిప్పి తిప్పి కొడితే ఇరవై వేల్లేదు జీతం.."

"ఇది మరీ చోద్యంగా ఉంది... రాజును చూసిన కంటితో మొగుణ్ణి చూస్తే ఆనలేదంట నీలాంటిదానికే. నా అల్లుడు బంగారం కాదూ? "

"కరిగించుకు తిందాంలే"

"నువ్వెంతో పుణ్యం చేసుకుపుట్టావు... నీతోటి వాళ్ళెందరో తాగుబోతు మొగుళ్ళతో తన్నులు తింటూ విరక్తిగా బతుకులీ

## కొత్తగాలి...

**ఎన్నో ఉగాదులు**
**వస్తూనే ఉన్నాయి**
**ఖాళీ గాదెలు**
**వెక్కిరిస్తూనే ఉన్నాయి**

– వి.వి.రమణకుమార్, చిలకలూరిపేట

డుస్తున్నారు. నన్నడిగితే నువ్వు మామూలు పూజలు కాదు బంగారు పూలతో పూజలు చేసి ఉంటావు. అందుకే నీకు ఆంజనేయుల్లాంటి ఉత్తముడు దొరి కాడు"

"పూజలేం ఖర్మ... దండిగా లంచాలు కూడా ఇచ్చొచ్చాలే... అందుకే ట్వంటీ ఫోర్ క్యారెట్స్ గోల్డ్ దొరికాడు"

"మాబాగా చెప్పావు... అంతే అయ్యుం టుంది"

పైకి అలా సరదాగా తేల్చిపారేసినా... లోలోపల బావను అనవసరంగా కోల్పో యాను అని మమతకు బాధగా ఉండేది. తన స్థానంలో వచ్చిన సునంద అంటే అవ్యక్తమైన కోపం, విసుగు.

ఏ మాటకామాటే చెప్పాలి. సునంద ఎప్పుడూ మంచిగా, మర్యాదగానే ఉండేది. కానీ మమతకే సునందంటే అక్కసు. తనకు దక్కాల్సిన బావని సునంద కాజే సింది అనిపించింది. ఆమెకే ముందు పెళ్ళయినా సరే... బావ ఎందుకు పెళ్ళి చేసుకోవాలి... తనకోసం చాన్నాళ్లు చేసుకో కుండా ఆగొచ్చుగా... అలాగే ఉండిపో వచ్చు కదా... ఎన్ని సినిమాల్లో చూపిం చరు... అమ్మాయికి ఏదో కారణాన, పెద్దల బలవంతంతో పెళ్ళయినా సరే... అతను చేసుకోకుండా అలాగే ఉండిపో తాడు. తర్వాతెప్పుడో ఆమెకి ఏదో నెపం తో భర్త దూరమైతే అప్పుడు 'నేనున్నాను కదా... బాధపడకు. నిశ్చింతగా ఉండు' అంటూ చేతిలో చెయ్యేసి ధైర్యం చెప్తాడు. చేయూతనందిస్తాడు. ఆమె కన్నీళ్లు తుడిచి ఆనందబాష్పాలను నింపుతాడు. అలాంటి మధురోహలకు తావీయకుండా ఆ చిన్న బావ చెత్తగా పెళ్లి చేసేసుకున్నాడని చిరాకు కలిగేది.

పైకి సునందతో కలుపుగోలుగా మాట్లా డేది. అభిమానంగా ఉన్నట్లు నటించేది. మాటల్లో పెట్టి అనేక విషయాలు రాబ ట్టేది.

మాధురి పెళ్ళిలో కలిసినప్పుడు చిన్న బావ కళ్ళన్నీ తనమీదే ఉండటం గమనిం చింది మమత.

పెళ్లి కాకముందు కంటే ఇప్పుడు చిన్న బావ మరీ మరీ అందగాడిగా మారి, ఆక ర్షణీయంగా కనిపించాడు ఆమెకళ్ళకి. కొంచెం ఒళ్ళు చేశాడు. బాగా నునుపు తేలాడు. ముఖంలో పెద్దరికం వచ్చింది. 'వామ్మో... ఈయనగార్లో మన్మథుడు తిష్ట వేశాడే... మలయాళీ యాక్టర్ మమ్ముట్టీ లాగున్నాడే... ఏం చూపులవి? ఎంత తీవ్రంగా ఉన్నాయి? తనవైపు లాక్కుంటు న్నట్లుగా ఉన్నాయే..' అంటూ తెగ కలవ రపడింది.

ఇదేంటి? తనకు పెళ్ళయింది. ఇద్దరు పిల్లలున్నారు. ఇంకా తనలో మోహం వద లేదా? తన వయస్సు తప్పుకున్నట్లుంది. ఇప్పుడే యౌవనం ప్రవేశించినట్లు ఈ స్పందనలేంటి, పెదవులు అదరడమేంటి? అంతా మాయగా ఉంది. బావ తనపై సమ్మోహనాస్త్రం సంధించినట్లుంది. సిగ్గుల మొగ్గవుతున్నానేంటి? ...

ప్రేమకు వయసుతో సంబంధం ఉండదా? బావ చూపులు తిన్నగా గుండెల్లో గుచ్చుకుంటున్నట్లు వున్నా యేంటి? అన్నీ ప్రశ్నలే... సమాధానం లేదు. మొత్తానికి మమత నిబ్బరించుకోలే కపోయింది. మనసు బలంగా బావ వైపుకు లాగింది. క్రమంగా చిన్నబావ ఇంటికి వెళ్ళాలనే ఉత్సాహం పెరిగింది. ఏదో నెపాన హైదరాబాద్ వచ్చివెళ్ళడం సాగించింది.

ఇక రామ్మోహన్ సంగతి చెప్పనవసరం లేదు. మమత వెళ్ళినప్పుడు పనులన్నీ మానుకుని ఉండిపోయేవాడు.

ఇద్దరికీ ఒకరిమీద ఒకరికి ఆకర్షణ కలి

గింది. అతని చూపులు గుండె లోతుల్లోకి చేరి అలజడి రేపుతాయి.

ఆవేళ దగ్గర్లో ఎవరూ లేకపోవడంతో "అబ్బా! ఏంటా చూపులు? మరీ తినేసేట ట్టున్నాయి" అంది మమత.

"తిందామనేగా మరి..." అంటూ వచ్చి సుతిమెత్తగా తాకాడు.

ఒళ్ళంతా కరెంటు పాకినట్టయింది. బుగ్గల్లోంచి ఆవిర్లు వచ్చాయి.

అలా నిమురుతూ కూర్చున్నాడు. మమత అస్సలు వారించలేదు. ఎవరైనా చూస్తారేమోనన్న భయం తప్ప అతన్ని అడ్డుకోవాలని, అభ్యంతరం చెప్పాలని అస్సలు అనిపించలేదు. కావలసిన మధురి మలు పొందుతున్నట్లుగా, కోల్పోయిన సంపదలు దొరుకుతున్నట్లుగా ఎంతో హాయిగా, ఆనందంగా ఉంది.

ఎవరో వస్తున్న అలికిడి కావడంతో రామ్మోహన్ కొంచెం దూరం జరిగి అల్మా రాలో ఏదో వెతుకుతున్నట్టుగా నటిం చాడు. పనిమనిషి మోపింగ్ స్టిక్‌తో గది తుడిచి వెళ్ళింది.

ఆమె గది శుభ్రం చేస్తున్నంతసేపూ ఇద్ద రికీ క్షణమొక యుగంగా ఉంది. 'ఈమె ఇప్పుడే రావాలా?' అన్నట్టు ఇద్దరూ అస హనంగా గడిపారు.

ఇద్దరికీ ఒకరి ఒళ్ళో ఒకరు ఒదిగి పడు కోవాలని ఉంది.

"అమ్మగారు ఎక్కడున్నారు?" అడిగాడు రామ్మోహన్.

"ఇప్పుడే ధ్యానంలో కూర్చున్నారయ్యా. ఏమైనా అర్జంటా.. పిలవాలా?" అడి గిందా అమ్మాయి.

ఒద్దులే.. పాపం.. ధ్యానంలోంచి లేవడ మెందుకు?" చాలా ఔదార్యం ప్రదర్శించా డు రామ్మోహన్.

పనమ్మాయి అటు వెళ్ళగానే "హమ్మయ్య! ఓ గంటకు పైగా బయటికి రాదు" అన్నాడు ఒక్క అంగలో మమత దగ్గరికొచ్చి.

అతనంత దగ్గరగా ఉంటే మమతకి స్వర్గంలో విహరిస్తున్నట్లుగా ఉంది.

అక్కడికి ఎవ్వరూ రాకూడదని కోరు కుంటూ చిరునవ్వులు చిందిస్తూ వుండిపో యింది.

రామ్మోహన్‌కి మరింత సాన్నిహిత్యం కావాలనిపించింది. కానీ పొరపాటున భార్యో మరెవరో వస్తే పరువుపోతుంది. తలవంచుకోవాల్సిన పరిస్థితి దాపురి స్తుంది. ఇంత బతుకూ బతికి సంజాయి షీలు చెప్పుకోవవాల్సిన అగత్యం ఎందుకు?

కానీ ఎలా? ఇంత తేలిగ్గా లొంగిపో తున్న మరదల్ని వదులుకోగలడా? ప్రాణం తోడేసినట్లవదూ?

కానీ ఏ క్షణంలో ఎవరొస్తారోనన్న ఆందోళన అనవసరం అనిపించింది.

అందుకే "నువ్వు కాదనకుండా నే చెప్పి న చోటుకి రావాలి" అన్నాడు మెల్లగా.

"ఎక్కడికి?"

"హోటల్.."

"అమ్మో, హోటలుకే.. ఎవరైనా చూస్తే... ఇంకేమైనా వుందా?"

"ఎవ్వరికీ అనుమానం రాకుండా నేను చూసుకుంటాగా... నా బంగారానివిగా... కాదనకే..."

"వామ్మో... నేను రాను బాబూ.. మా ఆయనకుగానీ, ఇంకెవరికైనాగానీ తెలిస్తే ఉరేసుకు చావాల్సిందే"

"ఒసేయ్... దొంగమొహమా... నేనంటే నీకూ ఇష్టమని తెలిసిపోతోంది... కాదని దబాయించకు"

"నేనేం దబాయించడం లేదు... నువ్వంటే ఇష్టం వుండబట్టే చెయ్యేస్తే కాద నలేదు..."

"మరింకేం..?" అంటూ బతిమాలాడు.

మమతని ఇంకా ఇంకా మత్తు ఆవరి స్తోంది. అతనితో ఎక్కడికైనా సరే వెళ్ళిపో వాలనిపిస్తోంది.

లోపల వంద భయాలున్నా... తెలివైన వాడు.. తనను నలుగురిలో నవ్వులపాలు చేయడు.. నట్టేట్లో ముంచడు... అనే నమ్మకంతో ఇంకేం మాట్లాడలేదు.

"నేనిప్పుడే బయల్దేరి వెళ్తాను... నువ్వు ఏమాత్రం అనుమానం రాకుండా అరగంట తర్వాత ఏదో సాకు చెప్పి రా... పక్కసం దులో గాంధీబొమ్మ దగ్గర ఎదురుచూ స్తుంటా... అనుమానం రాకూడదు మరి" అనేసి సుతిమెత్తగా స్పృశించి వెళ్ళిపో యాడు రామ్మోహన్.

రామ్మోహన్ వెళ్ళిన కాసేపటికి మమత స్నానం చేసి, తాను తెచ్చుకున్న చీరల్లో మరింత ఆకర్షణీయమైనదాన్ని తీసి కట్టు కుంది. రోజూ కంటే శ్రద్ధగా తల దువ్వు కుంది. అద్దంలో తనబింబం తనకే ముద్దొ చ్చినట్లయింది. అంతా తయారయ్యాక "సునందా! నేను మాధవీ వాళ్ళింటికి వెళ్ళొ స్తాను" అంది.

"అయ్యో... ఇప్పుడేంటి... భోజనం చేసింతర్వాత వెళ్ళొచ్చుగా" అంది సునంద.

"లేదులే.. ఇప్పుడే వెళ్తాను... వీలైతే భోజనం వేళకి ఇక్కడికే వచ్చేస్తాను" అంది మమత.

"పోనీ, వెళ్ళేది ఇంకొంచెం ముందైనా బాగుండేదిగా ఆయన దింపేవారు" అంది సునంద, రవ్వంత అనుమానం లేని నిష్క ల్మష హృదయంతో.

'అలా కలిసెళ్తే అనుమానం వస్తుంద నేగా తల్లీ' అని మనసులో అనుకుని, "ఆ.. బావకెందుకు శ్రమ... కారుల్లోనే పుట్టా మా ఏంటి.. నే వెళ్తాలే" అనేసి చెప్పులేసు కుని గుమ్మం దాటింది మమత.

గాంధీబొమ్మ దగ్గర బావ కారు ఎక్కు తోంటే... ఎవరైనా బంధువుల కంటపడదు కదా.. హోటల్లో గది అంటే ఇంకా గాబరాగా వుంది. ఎవరైనా చూస్తా రేమో... అనుమానిస్తారేమోనని ఒకటే భయం.. కానీ బావచూపులో ఏం మహిమ ఉందో.. తన మనసు తన అదు పులో లేకుండా పోయింది. అతనివైపు లాక్కెళుతోంది. ఆ చేతుల్లో సమ్మోహనా స్త్రాలు ఉన్నాయి. ఆ స్పర్శ కోసం శరీరం లోని అణువణువూ తహతహలాడుతోంది.

ఎంత భయమున్నా దాన్ని మించిన ఉబలాటం వుంది. అందుకే ఆమె రామ్మో హన్‌వైపు పరుగులు తీసింది.

మమత గాంధీబొమ్మ వద్దకు చేరేసరికి రామ్మోహన్ కొద్దిదూరంలో రోడ్డుపక్కన పార్కు చేసిన కారు స్టార్టు చేశాడు. మమత పక్కగా స్మూత్‌గా ఆపి డోర్‌లాక్ తీశాడు. మమత కారెక్కి కూర్చుంది. ఏసీ చల్లదనం హాయిగా ముఖానికి తాకు తోంది. స్ప్రే చేసిన శాండల్‌వుడ్ పరి మళం సమ్మోహనంగా వుంది. సన్‌షేడ్ గ్లాసెస్ కనుక లోపలిదేమీ బయటకు కన పడదు. అందుకే ధీమాగా మమతను ఎడంచేత్తో దగ్గరకు లాక్కున్నాడు. అతని గాఢస్పర్శకు ఆమె వివశురాలైంది.

"బావా... నాకు చాలా భయంగా వుంది..."

"మరెందుకొచ్చావు? " వెక్కిరింతగా

## కొత్తగాలి...

**కూతురు**
**పుట్టింట నడయాడే దైవం!**
**కోడలు**
**మెట్టింట మెదిలే దయ్యం!**

– చక్కా చెన్న కేశవరావు,
కావలి

కాకున్నా ఆమె నోటితో తనమీదున్న ఇష్టాన్ని చెప్పించాలని అడిగాడు.

"ఏం చేయను... నీ చూపుల గాలానికి పడిపోయాను... పెళ్ళయి పిల్లలు పుట్టాక్కూడా ఇంత బలమైన ఆకర్షణలుంటాయని నాకు తెలీదు. పొద్దున నువ్వు... తాకిన తర్వాత నాకు నిజంగా ఏదో అయింది..."

"ఏమైందే బంగారం? " మళ్లీ సుతిమెత్తగా తాకుతూ అడిగాడు.

మమత మత్తుగా కళ్ళు మూసుకుంది... శరీరం ఆమె అధీనంలో లేదు.

"బావా! సిగ్గులేకుండా చెప్తున్నాను.. నిన్ను బలంగా హత్తుకోవాలని వుంది" అంది.

"ఇంకాసేపయ్యాక అదే చేద్దువుగాని"

"ఇంతకీ ఇప్పుడెక్కడికి తీసికెళ్తున్నావు"

"స్వర్గానికి"

"హాస్యాలు కాదు... నిజం చెప్పు... హోటల్‌కు మాత్రం వద్దు. నాకు భయంగా వుంది..."

"ఇది మీ ఊరు కాదుగా... భయపడితే నేను భయపడాలి... నీకెందుకు? "

"మగాడివి నీకేం భయం నాయనా... ఆడదాన్ని కాబట్టి... నాకే వెయ్యి భయాలు..."

"నేనుండగా నీకెందుకు భయం.. నీకేమీ మాట రాకుండా చూసుకునే భారం నాది... నిశ్చింతగా వుండు"

"చెప్పు బావా ఇప్పుడెక్కడికి? "

"మా ఆఫీసుకే..."

"ఆఫీసుకా? "

తానెందుకిలాంటి వ్యామోహంలో పడిందో అర్థంకాని అయోమయంలో కొట్టుకుపోతుండగా "ఏంటే మరదలా, తెగ ఆలోచిస్తున్నావు? " అన్నాడు.

రామ్మోహన్ కుడిచేయి మాత్రమే స్టీరింగ్ మీదుంది. రెండోచేయి మమత భుజాన్ని నిమురుతోంది.

"ఏంలేదు... ఇప్పటిదాకా ఏం జరుగుతుందోనని తెగ భయపడ్డాను.. అలాంటిదేంలేదని తెలిశాక కుదుటపడ్డాను"

"ఎందుకు జరగదు.. ఇవాళ నిన్నిలా వదిలేస్తే నాకు పిచ్చెక్కిపోయేలా వుంది"

"ఏంటి, మతిలేకుండా మాట్లాడ్తున్నావు... ఆఫీసు రూంలో...? "

"ఆఫీసులో నా ఛాంబర్ పక్కన మరో గది వుంటుంది... మధ్యలో కాసేపు రిలాక్స్ అవడానికి మంచం గట్రా అన్ని సదుపాయాలతో... చూస్తావుగా..."

చిన్నబావ బాగా సంపాదిస్తున్నాడని వింటోంది కానీ.. ఇంత దర్జా, ఇంత విలాసం అని తెలీదామెకి. కొంచెం విస్తుపోయింది.

క్షణంలో తేరుకుని "బావా, నిజం చెప్పు... కేవలం రిలాక్స్ అవడానికేనా... లేక అప్పుడప్పుడూ అమ్మాయిల్ని తెచ్చుకుంటున్నావా? "

"ఛఛ... నువ్వంటే నా మరదలివి... తెగ నచ్చావు కాబట్టి.. స్త్రీలోలుణ్ణి అనుకున్నావా ఏంటి? "

ఆ మాటకి ఆమె సంతృప్తి చెందింది. ఎంత డబ్బు, అవకాశాలూ ఉన్నా... బావకి అలాంటి వ్యసనాలు లేవు అనుకోవడం ఆమెకి బాగా అనిపించింది. తన మీద ప్రత్యేకమైన ప్రేమతో ఇలా చేస్తున్నాడు గానీ మామూలుగా దౌర్బల్యం లేదని హాయిగా నవ్వుకుంది.

ఒక వీధిలో కారాపాడు రామ్మోహన్.

"చూడు మమతా! నువ్విక్కడ దిగిపో... కొంచెం ముందుకి వెళ్తే ఎడంవైపున 'గోపీ ఐ క్లినిక్' ఉంటుంది. దానికి ఎదురుగా ఉన్న సందులోకి వెళ్ళి ఓ వెయ్యిగజాలు నడిస్తే కుడివైపే ఆఫీసు. వాచ్‌మన్‌కి నన్ను కలవాలని చెప్పు.. ఏం పని అంటే.. 'కాన్ఫిడెన్షియల్... ఆయనతోనే

మాట్లాడాలి' అని చెప్పు"

"అదేంటి, నేనూ నీతోబాటే వస్తే సరిపో తుందిగా? "

"ఇలా అయితే ఏ వెధవకీ అనుమానం రాకుండా ఉంటుంది..."

"నేను వచ్చాక మాత్రం అనుమానం రాకుండా వుంటుందా? "

"ఉహూ రాదు. ఫ్లాట్ల గురించి మాట్లా డ్డానికి ఎందరో వస్తుంటారు. నువ్వూ అలాగే అనుకుంటారు"

"ఎవరూ తలుపు తట్టి గదిలోకి రారా? "

"కాన్ఫిడెన్షియల్ అంటే ఎవరూ రారు..."

మమతకి అవమానంగా అనిపించింది. తాను తప్పు చేయడానికి సిద్ధపడబట్టేగా... ఇలా నడిరోడ్డుమీద దింపి.. అపరిచితురా లిలా తర్వాత వచ్చి కలవమంటున్నాడు... ఛీ... తానెందుకు ఇంతకి దిగజారింది.. ఏ తప్పూ చేయకుండా నిజాయితీగా వుంటే సునందతో బాటు సగర్వంగా ఆఫీసులో అడుగు పెట్టొచ్చుగా అనిపించింది.

"బావా, ఇదేం బాలేదు.. నేను వచ్చిన దారినే ఇంటికెళ్తాను.. ఇవాళే మా ఊరు వెళ్ళిపోతాను.." అంది.

"నీకేమైనా పిచ్చా.. నువ్వేదో అపార్థం చేసుకున్నట్లున్నావు.. నువ్వే ఆలోచించు.. మనిద్దరం కలిసి వెళ్ళామనుకో.. లోపలి కెళ్ళి తలుపులేసుకుంటే ఎలా ఉంటుంది.. అమ్మాయిల్ని తెచ్చుకుంటున్నాడని అందరూ గుసగుసలు పోతారు.. ఆ పరి స్థితి నాకంటే కూడా నీకు మరీ అవ మానం.. నువ్వు వెళ్ళేప్పుడు ఒక్కరు ఛీత్కారంగా చూసినా భరించగలవా, చెప్పు? "

"వద్దు బావా.. నీమీద కలిగిన వ్యామోహం నన్నిలా అనాలోచితంగా తీసు కొచ్చింది కానీ.. ఆలోచిస్తే నాకే అస హ్యంగా వుంది.. నాకు మనస్కొప్పడం లేదు.. నేను వెళ్ళిపోతాను"

## అలా చేయడం సరైనదేనా?

పెన్సిల్వేనియా గెజిట్‌కు ఫ్రాంక్లిన్ ఎడిట ర్‌గా ఉన్నప్పుడు ఒకతను కవ్వింపుగా ఒక లేఖ రాశాడు. అందులో ఏముందంటే- 'క అనే అతను గ భార్యతో సరసాలాడుతున్నాడు. ఇది తెల్సిన గ కూడా క భార్య దగ్గరకు వెళ్లి, ఆమెభర్త చేసిన తప్పుకు పగ



తీర్చుకొనేందుకోసం తనతో సరసాలాడమని వెంటపడ్డాడు. అలా చేయడంలో ఏమైనా తప్పుందా? '

దానికి 'ఉదాహరణకు ఊర్లో తిరిగే ఏదో ఒక అడ్డగాడిద వచ్చి నన్ను తన్నిందనుకో! అప్పుడు నేను కూడా వెళ్లి పగ తీర్చుకోవాలనే ఉద్దేశంతో ఆ గాడిదను తన్నడం ఏమైనా బాగుంటుందా? ' అని ఫ్రాంక్లిన్ జవాబిచ్చారు.

ఆయన సమయస్ఫూర్తికి, చక్కటి జవాబుకు పాఠకులంతా చాలా ఆనందించారు.

"వద్దే.. ప్లీజ్! ఇవాళ నీతో స్పెండ్ చేయకపోతే నా జీవితమే దండగ.. ఇందులో నువ్వు అవమానపడాల్సింది ఏమీ లేదు.. నువ్వేమైనా వేరేవాళ్ళకోసం వెళ్తావా.. నామీద ప్రేముంది కనుక వచ్చావు.. నువ్వేం సిగ్గుపడాల్సిన అవసరం లేదు.. ఇద్దరికీ ఒకరిమీద ఒకరికి బలమైన కోరిక ఉన్నప్పుడు అది తప్పెలా అవు తుంది? "

"కానీ ఒక భోగం మనిషిలా నేను రావ డమేంటి? "

"ఇందులో నువ్వంత అవమానం చెందా

ల్సిందేమీలేదు.. కేవలం ఎవరికీ అనుమానం రాకుండా.. అంతే, ఇంట్లో మాత్రం ఒకేసారి బయల్దేరామా? అనుమానం రాకూడదనే కదా అలా ముందూ వెనకగా వచ్చింది.. ఇప్పుడూ అంతే"

"కానీ.. నా మనస్సొప్పడం లేదు"

"ఇలా నస పెట్టకు.. ఇప్పుడు మా ఆఫీసు వాళ్లెవరైనా ఇటుగా వచ్చారంటే.. మన ప్లానంతా గంగలో కలుస్తుంది.. నా బంగారం కదూ.. ఒక్క ఐదు నిమిషాల గ్యాప్‌తో వస్తావు.. అంతేగా.. నువ్వొచ్చాక.. ఎవరూ డిస్టర్బ్ చేయొద్దని ఆపరేటర్‌కి కాల్‌చేసి చెప్తాను.. అప్పుడిక నేన్నీవాడిని" అన్నాడు.

మమత ఇక మొరాయించలేదు. రామ్మోహన్ చేతిని వదిలి కారు దిగింది.

రామ్మోహన్ కారు ముందుకి వెళ్ళి కుడివైపు మళ్ళింది.

మమత రోడ్డు పక్కన ఉన్న చెట్లను చూస్తూ రెండుసార్లు ఆ చివరినుండి ఈ చివరికి పచార్లు చేసింది.

తర్వాత 'గోపి ఐ క్లినిక్' ఎదురుగా సందులోకి దారితీసి ముందుకు నడిచింది. రామ్మోహన్ చెప్పినట్లుగానే చాలాకొద్ది దూరంలోనే 'రామ్మోహన్ కన్‌స్ట్రక్షన్స్' అనే బోర్డు కనిపించింది. రెండంతస్తుల విశాలభవనం.

మమత గేటు లోపలికి అడుగు పెట్టగానే వాచ్‌మ్యాన్ ఎవరు కావాలన్నట్టు ప్రశ్నార్థకంగా చూశాడు.

"రామ్మోహన్ గారిని కలవాలి"

"ఏం పని? "

"ఆయనతోనే చెప్పాలి.."

"మీరెవరు? ఎక్కణ్ణించి వచ్చారు? "

ఇలా రెట్టించి అడుగుతాడని ఊహించని మమత తన అసలు పేరు చెప్పాలా వద్దా అనే సంశయంతో "పర్సనల్ అని చెప్పాను కదా.. ఒకసారి వెళ్ళి మాట్లాడ్తాను" అంది.

"సార్‌కి ఆ మాట చెప్పాలన్నా ముందు మీరెవరో తెలియాలి కదా? " అన్నాడు వాచ్‌మ్యాన్ విసుగ్గా.

"విజయలక్ష్మి.. గాంధీనగర్ అని చెప్పు.. గుర్తుపడతారు.. రమ్మంటేనే వెళ్తాను" అంది మమత కావాలని తన పేరు మార్చి చెప్పి.

వాచ్‌మ్యాన్ ఇంటర్‌కమ్‌లో విషయం చెప్పాడు.

"సార్ రమ్మంటున్నారు, వెళ్ళండి"

మమతని కూర్చోమని చెప్పి.. రామ్మోహన్ చెక్కులు, ఓచర్లమీద సంతకాలు చేశాడు. నాలుగైదు ఫోన్‌కాల్స్ మాట్లాడాడు. కాఫీ తెప్పించాడు.

మమతకి ఇదంతా చోద్యంగానే ఉంది. బావకు ఇంత హోదా దర్పమూ వచ్చాయా? తనతో కొంటె చేష్టలు చేసిన బావ ఇంత గౌరవం, పలుకుబడి ఉన్న వ్యక్తా? ఒకింత గర్వంగా వుంది. మరీ ముఖ్యమైన పనులు అయిపోయాయి అనుకున్నాక టెలిఫోన్ ఆపరేటర్‌కి ఫోన్‌చేసి "గొడవల్లో ఉన్న ఒక స్థలం గురించి మాట్లాడుతున్నాను. హైలీ కాన్ఫిడెన్షియల్.. ఎవ్వరు ఫోన్ చేసినా లేనని చెప్పు.. కలవడానికి వచ్చినా అంతే. ఇప్పుడు కుదరదు, మళ్ళీ రమ్మని చెప్పు" అన్నాడు.

"ఓకే సర్" అంది ఆపరేటర్.

ఛాంబర్ లోపల బోల్టు వేశాడు. కర్టెన్ తొలగించి పక్కనున్న గదిలోకి దారితీశాడు.

"బావా! ఎవరికీ అనుమానం రాదా? "

"పిచ్చిమొహమా.. నా గురించి మా ఆఫీసులో చాలా గొప్పగా చెప్పుకుంటారు.. సునందకి నామీద అనుమానం రాదు.."

మమతకి 'చెప్పేవి శ్రీరంగనీతులు, దూరేవి దొమ్మరి గుడిసెలు' అనే సామెత గుర్తొచ్చింది. కానీ పైకి ఏమీ అనలేదు.

తానొక స్త్రీ అయ్యిందీ, తనే బావ వ్యామోహంలో పడింది. ఇక మగవాడు... లక్ష చపలత్వాలు ఉంటాయి.. అతన్నెలా తప్పు పట్టగలనని అనుకుంది.

మమత గదినంతా తేరిపార చూసింది. ఒక ఖరీదైన హోటల్ రూంలా ఎంతో అందంగా, విలాసంగా, కంఫర్టబుల్‌గా వుంది.

ఆ గది తలుపు కూడా బోల్టు వేశాడు.

రామ్మోహన్ ఏసి ఆన్‌చేసి మంచంమీద కూర్చున్నాడు. మమతని రమ్మని సైగ చేసేసరికి ఆమెని సిగ్గు ఆవరించింది. పెళ్ళయిన మొదటిరోజు శోభనం గదిలో అడుగుపెట్టిన సీను రిపీటవుతున్నట్లుంది. నిలబడిన చోటే ఉండిపోయింది.

"వార్నీ.. కొత్త పెళ్ళికూతురిలా.. ఇదేంటి?" అంటూ ఆత్మీయంగా దగ్గరకు తీసుకున్నాడు రామ్మోహన్.

గదిలో సెంటు స్ప్రే చేయడాన ఆ మధుర పరిమళాలు ఒకరకమైన మత్తు కలిగిస్తున్నాయి.

ఇద్దరూ ఒకటయ్యారు.

"బావా.. నన్నెందుకు పెళ్ళిచేసుకోలేదు?" అంది మమత ఆనందలోకాల్లో విహరిస్తూ.

"అయిపోయిందాని గురించి ఇప్పుడెందుకు? ఇకనించి నువ్వు నా పెళ్ళానివే అనుకో"

"నేననుకుంటే సరిపోతుందా?"

"నేనూ అనుకుంటాగా"

"కానీ, లోకం అనుకోదుగా.."

"వెధవ లోకం.. దానితో మనకేం పని? మనం భార్యాభర్తల్లానే గడుపుదాం"

"అదెలా వీలవుతుంది? ఇన్నిన్ని అడ్డంకుల్ని, అవరోధాల్నీ దాటుకోవద్దూ?"

"దాటుదాం.. అసలప్పుడే థ్రిల్లుంటుంది"

"బావా, నువ్వు నాక్కావాలి.. నన్ను వదిలేయవు కదూ?"

"బంగారం.. నిన్నెలా వదులుకుంటానే?"

"నమ్మొచ్చా?"

"నీ ఎత్తు బంగారం కూడా నీతో సమానం కాదే" అని అతను అంటోంటే మమత ఆనందంగా చూసింది.

మమత మంచమ్మీద దుప్పటి చక్కగా సర్దింది. రామ్మోహన్ ఏసీ ఆఫ్ చేసి ఛాంబర్లోకి వచ్చాడు. ఆమె రేగిన తల దువ్వుకుని, లేచింది. రామ్మోహన్ బోల్టు తీసి, తలుపు అలాగే వుంచాడు. మామూలుగా కూడా అది ఎప్పుడూ చేరవేసే వుంటుంది.

"భోజనం తెప్పించనా?" అన్నాడు రామ్మోహన్.

"ఊహూ.. నీ వరకూ తెప్పించుకో" అంది.

"డ్రైవర్‌నిచ్చి పంపేదా, గాంధీబొమ్మ వరకూ?"

"వద్దొద్దు.. ఆటోలో వెళ్తా"

రామ్మోహన్ ఐదు వందల నోటు తీసి ఆమెచేతిలో పెట్టాడు.

"వందచాలు బావా.. ఆటోకి ఇంతెందుకు?" అంది, నోటు తిరిగిస్తూ.

రామ్మోహన్ తీసుకోకుండా "ఫర్లేదు, ఉండనీ.. దార్లో ఏమైనా కొనుక్కోవాలని

**కొత్తగాలి...**

**నాణ్యతని బట్టి**
**వస్తువుకి గిరాకీ!**
**వ్యక్తిత్వాన్ని బట్టి**
**మనిషికి గిరాకీ!**

– ఎస్.ఎమ్. గౌరీశంకర్,
విజయనగరం

పిస్తే వుంటాయి.. మరీ గీసినట్లు ఇస్తారా? " అన్నాడు.

మమత ఇక రెట్టించకుండా తీసుకుని బయటికొచ్చింది.

★ ★ ★

"భోజనం వడ్డించనా మమతా? " అంది సునంద.

"నువ్వు తినేశావా సునందా? " అడిగింది మమత.

"ఆ.. చాలా సేపు చూశాను.. ఇక తినేసి వస్తావేమోలే అని తిన్నాను"

"మంచిపని చేశావు.. నేను వడ్డించుకు తింటాలే.. నువ్వు కూర్చో"

"ఏం ఫరవాలేదు" అంటూ వచ్చి అన్నం, కూరలు వడ్డించింది.

"మాధవి కూతురు భలే సిసింద్రీ" అంది మమత.

సునంద ఏమీ మాట్లాడలేదు.

"దాంతో మాట్లాడ్తోంటే టైమే తెలీదంటే నమ్ము"

సునంద రెస్పాండ్ కాకపోవడంతో "ఏంటి, ముభావంగా ఉన్నావు.. ఏం మాట్లాడవేం? " అంది మమత.

"ఇందాక మాధవి ఫోన్ చేసింది" అంది సునంద.

మమతకి బాంబు పేలినట్టనిపించింది. 'ఈ మాధవికి ఏం పనిలేదా? ఏదో అవసరానికి తన పేరు వినియోగించుకుంటే.. చూసిచూసి ఇప్పుడే ఫోన్ చేయాలా? ' అనుకుంది.

"మమతా! నువ్వు ఎక్కడికి వెళ్తున్నదీ నాతో చెప్పడం ఇష్టం లేకపోతే.. పనిమీద వెళ్తున్నాను అని చెప్పొచ్చు. చుట్టంచూపుగా ఇక్కడికి వచ్చినంత మాత్రాన అన్నీ నాతో చెప్పనవసరం లేదు"

"అది కాదు సునందా.." అంటూ సణిగింది మమత.

"వద్దు.. నువ్వేదో తప్పు చేసినట్లు ఫీలవకు. ఇతర్లతో పంచుకోలేనివి వుంటాయి.. అలాంటివాటిని పర్టిక్యులర్‌గా చెప్పకుండా 'పనుంది' అని అవాయిడ్ చేస్తే సరిపోతుంది.. అంతేగానీ, అనవసరమైన అబద్ధాలు చెప్పడం ఎందుకు? "

"సారీ, నిజ్జంగా సారీ.."

"నువ్వు నాకు సారీ చెప్పాల్సిన పనే లేదు మమతా, టేకిటీజీ.. నాలో శాడిస్టిక్ మెంటాలిటీ లేదు.. అందుకే నువ్వు అబద్ధం చెప్పడం మొదలెట్టగానే మాధవి ఫోన్ సంగతి చెప్పేశాను"

మమత తలొంచుకుని అన్నం కెలకసాగింది.

"తిను మమతా! ఇప్పుడు నువ్వు తలొంచుకోవాల్సినంత నేరం ఏం చేశావని? నీకేదో సొంత పని వుండి వెళ్ళావు.. అది నాకు చెప్పాలనిపించలేదు.. ఆ మాత్రానికి ఏదో తప్పు చేసినట్లు అపరాధ భావం ఏమీ అక్కర్లేదు.. కాకపోతే, ఒక్కటి గుర్తుంచుకో.. ఒక అబద్ధం వెయ్యి అబద్ధాలకు కారణమవుతుంది. చెప్పడం ఇష్టం లేని విషయాలు చెప్పొద్దు.. కానీ వాటిని అబద్ధాలతో మాత్రం నింపొద్దు.. అవి మనకే ప్రతిబంధకాలుగా మారతాయి" అని నవ్వింది సునంద.

'ఈసారి చాలా జాగ్రత్తగా వుండాలి' అనుకుంది మమత.

"నువ్వు చాలా నెమ్మదస్తురాలివి సునందా.. నీ స్థానంలో నేను గనుక వుంటే పిచ్చి కోపం వచ్చేది" మనస్ఫూర్తిగా అంది మమత.

"వద్దమ్మా, నాకేమీ పొగడ్తల మాల వేయొద్దు.. ఇంతకీ వెళ్ళిన పని ఎంతవరకూ అయింది? " అంది సునంద.

మమత మళ్ళీ ఉలిక్కిపడింది. 'కొంపదీసి నేను చిన్నబావ దగ్గరికి వెళ్ళినట్లు గమనించి వుంటుందా? తనకు తెలిసిన వాళ్ళెవరైనా వాళ్ళ ఆఫీసుకు తాను వెళ్లి

చతుర ప్రపంచం

# వినూత్న ప్రయోగం!

అమెరికాలో జావాగర్ల్స్ అనే కాఫీషాప్ చెయిన్ నడుస్తోంది. చాలామంది ఆఫీసుకు వెళ్తూ బ్రేక్‌ఫాస్ట్‌ను జావాగర్ల్స్‌లో చేస్తుంటారు. అయితే అనేక కేఫ్‌చెయిన్లు అమెరికా అంతటా ఉన్నాయి. దాంతో పోటీని అధిగమించి ఎక్కువమందిని ఆకట్టుకోవడానికి ఇటీవల జావాగర్ల్స్ వెయిటర్ల విషయంలో ప్రధాన మార్పు చేపట్టింది. నవంబరు 2011లో ఫ్లోరిడా రాష్ట్రంలోని ఆర్లెండోలో దాన్ని ఆరంభించారు. స్పందన బాగుండటంతో ఈ పద్ధతిని అమెరికాలోని తమ ఫ్రాంఛైజ్ కేఫ్‌లకు విస్తరింపజేసారు. వారు చేసిన మార్పు అంతా వెయిటర్స్‌గా కేవలం యువతులనే నియమించడం. పాతికేళ్లలోపుగల వారు ఎర్రటి బికినీలు వేసుకుని చిరునవ్వుతో సప్లయ్ చేస్తుంటారు. బికినీ అంటే బ్రా, పేంటీలను మాత్రమే ధరించడం వీటితోపాటు బూట్లను వేసుకుంటారు. జావాగర్ల్స్ భాగస్వాములు టాడ్, బిల్ బ్రాగ్‌నానోలకి వచ్చిన ఐడియా ఇది. అమెరికాలోని ఏకైక బికినీ డ్రెస్ కాఫీషాప్ జావాగర్ల్స్. 'ఎక్స్‌ట్రా హాట్ కాఫీ షాప్' అనే బోర్డును వారి కేఫ్‌ల బయట ఉంచుతున్నారు. లాటే, కప్పాచినో, ఎస్ప్రెసో తదితర రకాల కాఫీలను ప్రధానంగా అమ్మే జావాగర్ల్స్‌కు మగవాళ్లు, ముఖ్యంగా టీనేజర్లు, అరవై పైబడ్డ వారు వస్తున్నారు. దాంతో వాళ్ల అమ్మకాలు రెట్టింపయ్యాయి. అమెరికన్ కాఫీ ఇండస్ట్రీలో ఇది సెన్సేషన్‌గా మారింది. అమెరికాలో ఎదుటివారి చర్యలను విమర్శించే ధోరణి లేదు. ఎవరిష్టం వచ్చినట్లు వారు జీవించవచ్చు, ప్రవర్తించవచ్చు. అది చట్టానికి వ్యతిరేకం కాకపోతే అనే ఆదర్శాన్ని అమెరికన్ ప్రజలు పాటిస్తుంటారు. దాంతో దీనికి ఎలాంటి వ్యతిరేకతా రాలేదు. ఆడవాళ్లు కూడా ఈ కేఫ్‌లకు రావడం విశేషం.




నట్లు చెప్పివుంటారా? అక్కడ బావ పర్సనల్ రూంలో గడిపినట్లు తెలిసిపోయివుంటుందా' అనిపించింది.

ఏం చెప్తే ఏం కొంప మునుగుతుందోనన్నట్టు మౌనంగా వుండిపోయింది.

★ ★ ★

మమత తాను మాధవి దగ్గరికి వెళ్తున్నానని కాకుండా మరేదైనా సాకు చెప్పి వెళ్ళాల్సిందని పదేపదే అనుకుంది. మాధవికి రామ్మోహన్ కుటుంబంతో అంత సాన్నిహిత్యం వుందని, వీళ్ళకి ఫోన్ చేసి తనకోసం అడిగే అవకాశం వుందని ఊహించలేదు. ఛఛ.. అడ్డంగా దొరికిపోయానే అని మనసులోనే చిరాకుపడింది.

తాను అబద్ధం చెప్పినట్లు తేలిపోయాక కూడా ఎలాంటి ఆవేశకావేశాలూ లేకుండా ప్రశాంతంగా మాట్లాడుతున్న సునందది ఎంతో ఉన్నతమైన వ్యక్తిత్వం, గొప్ప మనసు అని లోలోపలే ప్రశంసించింది. అంతలోనే కోపతాపాలను బయటకు వెళ్ళగక్కేవాళ్ళే మేలు.. మనసులో వుంచుకునే వాళ్ళతోనే మరీ ప్రమాదం. సమయం చూసుకుని కోలుకోలేని దెబ్బ తీస్తారని అనుకుంది.

ఇంతకీ తాను ఎక్కడికి వెళ్ళలేదో తెలిసింది.. కొంపతీసి ఎక్కడికి వెళ్ళిందో

కూడా తెలీదుగదా సునందకి అని సందేహంగా, భయంగా అనిపించింది.

'ఆ.. వాళ్ళాయనతో గడిపానని తెలిస్తే ఇంత శాంతంగా వుంటుందా? లేదులే.. తెలీదు.. తెలిసే అవకాశం లేదు.. కనీసం ఆ విధంగా ఊహించను కూడా ఊహించదు. మొత్తానికి ఈ అనుభవాన్ని దృష్టిలో వుంచుకుని ఈసారి చాలా జాగ్రత్తగా వుండాలి' అనుకుంది.

రామ్మోహన్‌కు కుటుంబరీత్యా చూస్తే తల్లిదండ్రులు, భార్య, ఇద్దరు పిల్లలు. కానీ 'తెప్పలుగా చెరువు నిండిన కప్పలు పదివేలు చేరు' చందంగా ఎందరో బంధువులు చేరారు. రామ్మోహన్ మారుటి చెల్లెలి పిల్లలిద్దరు, పెద్దమ్మ మనవరాలు వాళ్ళింట్లోనే వుండి చదువుకుంటున్నారు. అతని పెద్ద మేనత్త, ఆవిడ భర్త పెద్దవారైపోయారు. పిల్లలు ఇంట్లోంచి తరిమేయగా అనాథల్లా బతుకుతున్నారని తెలిసి, వాళ్ళని తనింట్లో వుంచుకున్నాడు. ఇంకా దూరపు చుట్టరికమే అయినా ఒకే ఊరివాళ్ళయిన మరో ఇద్దరు కూడా వీళ్ళింట్లోనే చేరారు. రామ్మోహన్ వాళ్ళందర్నీ సొంతవాళ్ళలాగే చూస్తాడు. ఏమాత్రం దర్జా, దర్పం లేకుండా ఆత్మీయంగా మాట్లాడ్తాడు.

ఇంట్లో స్థిరపడిన వీళ్ళుగాక రోజూ వచ్చి పోయేవారితో ఆ ఇల్లు సందడిగా వుంటుంది. వంటవాళ్ళు, ఇతర నౌకర్లు సరేసరి.

మమత భోజనం చేసి "కాసేపు పడుకుంటాను సునందా!" అంది.

"పడుకో.. బడలికగా ఉన్నట్టున్నావు" అనేసి సునంద తమ పడగ్గదిలోకి వెళ్ళింది.

మమత తనకు కేటాయించిన గదిలో పడుకుంది. రామ్మోహన్‌తో గడిపిన క్షణాలను గుర్తు చేసుకుంది. రెండు నిమిషాల్లో గాఢంగా నిద్ర పట్టేసింది.

"ఏమ్మా.. ఇంతసేపు నిద్రపోతే రాత్రికి నిద్రేం పడుతుంది... కాఫీ తాగండి" అంటూ పనమ్మాయి వచ్చి లేపగా మమత లేచి హాల్లోకి వచ్చింది.

"ఏంటి మమతా, బాగా నిద్ర పట్టిందా?" అంటూ రెండు సున్నుండలు, బూందీ ఉన్న ప్లేటు అందించింది సునంద.

"ఒకటి చాలు సునందా" అంటూ అందుకుని, ఆనక కాఫీ తాగింది.

★ ★ ★

ఆవేళ మధ్యాహ్నం మమత ఏమీ తోచక అల్మారాలో బొమ్మలు సర్దుతోంది.

రామ్మోహన్ నుండి ఫోనొచ్చింది. కుశల ప్రశ్నలు కాగానే ఇక అసలు విషయంలోకి దిగాడు.

"ఎంత సతాయిస్తున్నావే బంగారం.. తెగ గుర్తొస్తున్నావే" అంటూ అరగంటసేపు మాట్లాడాడు.

మమతలో ఒకటే ఉద్వేగం.. విరహాన్ని తట్టుకోలేకపోతున్నానని చిన్నబావ చెప్తోంటే మమతకు ఏదో తెలీని గర్వం కలుగుతోంది.

అది మొదలు రామ్మోహన్ తరచూ ఫోన్ చేసేవాడు. భర్త, పిల్లలు ఉన్నారని తెలిస్తే మామూలు కుశల ప్రశ్నలతో ముగించి పెట్టేసేవాడు. ఎవరూ లేరనుకుంటే ఇక ప్రేమజల్లులు కురిపించేవాడు.

## కొత్తగాలి...

**బిల్లు కంటే**
**సర్‌ఛార్జే ఎక్కువ!**
**అయినా, ఓ కరెంటా!**
**నీ జాడ ఎక్కడ?!**

– వెల్మల రాంరెడ్డి,
పూడూరు, కరీంనగర్ జిల్లా

మధ్యలో రెండుసార్లు విశాఖలో పని వుండి వచ్చినప్పుడు మమతను కలిశాడు.

రామ్మోహన్ మమతను తరచూ ఫోన్ లో హైదరాబాదు రమ్మని పోరుపెట్టే వాడు. ఆమె రాకుంటే తానే విశాఖ వస్తా నని బెదిరింపు అస్త్రం ప్రయోగించేవాడు. ఇకామె హైద్రాబాదు వచ్చాక సరసాలకు లోటే వుండదు. కొన్నిసార్లు అతని ఆఫీ సులో, ఇంకొన్నిసార్లు ఊరికి దూరంగా రిసార్ట్స్‌లో గడిపేవారు. అతని బెంజికార్లో వెళ్తోంటే ఆమెకి రాజభోగం అనుభవిస్తు న్నట్టుగా వుండేది. కార్లో ఉన్నంతసేపూ త న చిలిపి చేష్టలతో మమత తన వయసు ను మర్చిపోయేలా చేసేవాడు. ఇద్దరికీ చిన్నపిల్లలైపోయినట్లుగా వుండేది.

ఆఫీసులో ఆమెకి అంతగా భయం వేసేది కాదుగానీ, రిసార్ట్‌కి తీసికెళ్ళినప్పుడు మాత్రం హడలి చచ్చేది. ప్రాణాలు గుప్పెట్లో ఉన్నట్లే దడదడలాడేది.

న్యూస్ పేపర్లో ఎన్నోసార్లు రిసార్ట్‌లపై పోలీసు రైడింగుల గురించి చదివి వుండ టాన.. సడెన్‌గా పోలీసులు అటాక్ చేస్తే తన గతి ఏమిటని భయపడేది.

చీమ చిటుక్కుమంటే చాలు పోలీసులే అయ్యుంటారని గుండె ఆగిపోయినంత పనయ్యేది.

"బావా, నాకు భయంగా వుంది.. ఎప్పుడో హార్ట్ ఎటాక్ వచ్చి ఛస్తాను" అంది మమత ఆవేళ.

"ఓసి పిచ్చిమొహమా... అనవసరంగా టెన్షన్ పడకు.. అలాంటిదేం జరగదు.. ఒకవేళ ఎవరైనా వస్తే తడుముకోకుండా భార్యాభర్తలమని చెప్పాలి.. ఇంత తెలివిత క్కువదానివి ఎలా పుట్టావే? " అన్నాడు.

"ఏమో బాబూ.. అసలు నన్నెందుకు ఇటువైపు లాగావు? "

"మనసులో ఉన్న కోరికల్ని అనవస రంగా సమాధి ఎందుకు చేయాలి చెప్పు? అయినా నా గురించి నీకు ఇంకా అర్థం కాలేదా? బోల్డంత పరపతి వుంది.. మన జోలికి ఎవడూ రాడు" అన్నాడు గంభీ రంగా.

"అందుకే బావా.. డబ్బుంటే కొండమీది కోతి కూడా వస్తుందన్నారు.. నువ్వు చాలా ఎదిగిపోయావు.. నిన్ను చూస్తే నాకు గర్వంగా అనిపిస్తోంది తెలుసా? "

కొద్దికాలం మమతకి రామ్మోహన్‌తో గడప డమే ఆనందంగా వుండేది. అంతరాంత రాల్లో ఎన్ని భయాలున్నా, ఆ అనుభవం ఇచ్చే ఆనందం ముందు ఇవెంత అనుకు నేది.

కొంతకాలం గడిచి ఆ సంబంధం పాత బడిపోయాక తానిన్ని భయాందోళనలను సహించి అతనికోసం ఎక్కడెక్కడికో వెళ్తోంటే అతను తనకోసం ఏం చేస్తు న్నాడు అనిపించింది. కారులో తిప్పితే, ఖరీదైన భోజనం తినిపిస్తే సరిపోతుందా? అవతల కోట్ల ఆస్తులు వున్నాయి.. తన కోసం ఏమైనా ఇస్తున్నాడా? అసలు ఇవ్వా లనే ఉద్దేశం అయినా లేదే.. అలాంట ప్పుడు పిచ్చిమొద్దులా తానెందుకు లొంగి పోతోందని ప్రశ్నించుకుంది. అలాంటి స్వార్థం మమతలో తొంగి చూశాక.. నిజా నిజాలు ఆలోచించడం మొదలయ్యాక, 'త నను బేవార్సుగా వాడుకుంటున్నాడు. కొన్నాళ్ళకి మోజు తీరాక ఎంగిలాకు విసి రేసినట్లు విసిరేసినా ఆశ్చర్యం లేదు' అని పించాక ఆమెలో చాలా మార్పు వచ్చింది. అప్పటిదాకా అతనిపై ఉన్న కోరిక, వెర్రి వ్యామోహం సమాధైపోయాయి.

★ ★ ★

ఆవేళ రామ్మోహన్ యథాలాపంగా మమతకు ఫోన్ చేసి సరసాలు మొదలు పెట్టాడు. ఇంతకుముందైతే ఆ కబుర్లకు మురిసిపోయేది. కానీ అతను తనను తేరగా వాడుకుంటున్నాడని అనుకునేసరికి

మునుపటి ఇష్టం స్థానంలో కోపం, చిరాకు కలిగాయి. ఇది ప్రేమ కాదు.. కేవలం వ్యామోహం.. అవకాశం దొరికేసరికి ఆబగా వాడుకుంటున్నాడు.. అనుకుంది. రామ్మోహన్ కబుర్లకు నిరాసక్తంగా బదులిస్తోంది.

"ఏమైంది, మీ ఆయనున్నాడా? " అనడిగాడు రామ్మోహన్.

"లేదు.."

"మరేమైంది.. ఒంట్లో బాగాలేదా? "

"ఒంట్లో బాగానే వుంది.. మనసే బాగా లేదు.."

"ఏమైంది, నేను లేనని దిగులా? "

"అంతలేదు"

"నువ్వు చాలా గుర్తొస్తున్నావు.. మళ్ళీ ఎప్పుడు? "

"లేదు.. ఇంక నేను రాదల్చుకోలేదు.."

"ఏమైంది? "

"ఏమో.. ఇంకెప్పుడూ రాను"

"అంత మాటనకు.. ఏంటి సంగతి.. ఎవర్నికైనా అనుమానం వచ్చిందా? "

"అలాంటిదేం లేదు"

"మరింకేంటి? "

"ఏమో.. చిన్నబావా.. నాకే జ్ఞానోదయం అయింది..నేనింత పరువు తక్కువ పనిచేయడం అవసరమా అనిపిస్తోంది.."

"అలా అనకే బంగారం.. నీతో గడిపే క్షణాలను మర్చిపోలేను.."

"ఈ మాటలకేమొచ్చెలే.. వీటితో నీ పబ్బం గడుపుకుంటున్నావు"

"ఛా.. అలా మాట్లాడకు.. నువ్వంటే నాకెంత ప్రేమో నీకు తెలీదా? "

"ఉత్తుత్తి ప్రేమవల్ల ఒరిగేదేమైనా వుందా? "

"నువ్వు కోరుకోవాలేగానీ.. నీకోసం ఏమైనా ఇస్తాను"

"కోరుకుంటేనే ఇస్తావా.. నీ అంతట నువ్వు ఇవ్వవా? ఆయనది గవర్నమెంట్ ఉద్యోగం అన్నమాటే గానీ.. నిన్నమొన్నటి దాకా అన్నీ బాధ్యతలే. ఇద్దరు ఆడపడుచుల పెళ్ళిళ్ళు చేసేసరికి కూడబెట్టుకోవడం లేకపోగా పుట్టెడు అప్పులు మిగిలాయి. పిల్లల చదువుకి తడిచి మోపెడవుతోంది.. ఖర్చులా రోజురోజుకీ పెరుగుతున్నాయి. ఇల్లూవాకిలీ ఏమీ లేదు.." అంది మమత.

అలా చెప్పడం ఆమెకి సిగ్గుగానే అనిపించింది. కానీ తప్పలేదు. చల్లకి పోయి ముంత దాస్తే ఎలా అనిపించింది. అడగందే అమ్మయినా పెట్టదు.. తామిద్దరూ ఇంత దగ్గరైనప్పుడు బావ తన అవసరాలు కనిపెట్టి సర్దుబాట్లు చేస్తే తప్పేంటి.. చేయాలి కదా? అని కూడా అనుకుంది. అందుకే, ఎంత కష్టంగా అనిపించినా అసలు విషయం వెళ్ళగక్కింది. తానేం ఉచితంగా అడుక్కోవడంలేదు. అతన్ని నమ్మి ఒళ్ళప్పగించింది. అలాంటిది ఆమాత్రం అడక్కూడదా, తప్పకుండా అడగొచ్చు. ఇవ్వకపోతే ఈ సంబంధాన్ని తెంపేసుకోవడమే మంచిది అని కూడా అనిపించింది.

అంతా విని ఒక నిమిషం మౌనంగా వుండిపోయాడు రామ్మోహన్.

"నువ్వడిగిందాంట్లో న్యాయం వుంది.. ఒక ఫ్లాటు నీ పేరున రాయాలని నాకే అనిపించింది.." అంటూ ఆగాడు రామ్మోహన్.

"నిజంగానా బావా? " అంది మమత ఆశ్చర్యంగా.

"అవును.. నువ్వు నోరు తెరిచి అడక్కపోయినా నేనా పని చేద్దామనుకున్నాను"

"మరెప్పుడూ అన్లేదే.. నీ అంతట నువ్వు అలా అంటే నేనెంత సంతోషించే దాన్ని.. నేను అడిగిన తర్వాతే ఇచ్చావనే భావం వుండేది కాదుగా.."

"నీకు అపార్ట్‌మెంట్ ఇవ్వాలనిపించిన మాట వాస్తవం. ఇచ్చే మాటా నిజమే.."

"ఏదో సందిగ్ధంలో ఉన్నావే.. సునందకి తెలుస్తుందని భయమా? "

"సునందకి అసలు ఇలాంటి విషయా లేవీ పట్టవు.."

"మరి? "

"మీ ఆయనకి డౌటొస్తుందేమోనని.. ఒక్క మీ ఆయనకే కాదు.. ఇంకెవరికైనా వస్తుంది. అప్పుడా ఫ్లాటు గురించి ఏం చెప్తావు.. నేను కొనిచ్చానంటే ఎందుకనే అనుమానం వస్తుంది.. రాదా!? రాకుండా ఎలా వుంటుంది? ఏ సంబంధమూ లేకుండా ఉత్తినే ఎందుకు కొనిస్తాడని సందేహం రాదా.. నువ్వే ఆలోచించు"

"నిజమే బావా.." అందామె సాలోచ నగా.

**కొత్తగాలి...**

**ఆకాశంలో చంద్రుడు**
**అమెరికాలో కన్నకొడుకు**
**ఇద్దరూ అందనంత దూరంలో...!**

– బాడాల నవనీత్‌రెడ్డి,
ఆదిలాబాద్

★ ★ ★

రామ్మోహన్ మమత పేరుతో ఒక ఫ్లాట్ రిజిస్టర్ చేయిస్తానని చెప్పాడే గానీ.. ప్రాక్టికల్‌గా దాన్ని అమలుపరచ లేదు. ఒక్కసారి కూడా కాదని చెప్పడు. ఇదిగో అంటాడు, అదిగో అంటాడు.. నీకెందుకు నువ్వు నిశ్చింతగా ఉండు అంటాడు. అట్లాంటి ఇట్లాంటి ఫ్లాట్ కాదని... స్విమ్మింగ్ పూల్‌తో సహా సర్వ సౌఖ్యాలు, మార్బుల్ ఫినిషింగ్‌తో ఉన్న అపార్ట్‌మెంట్ అంటూ అరచేతిలో వైకుంఠం చూపిస్తాడు. రెండు మాటలు ఎక్కువ మాట్లాడితే దాటేస్తాడు.

ఆవేళ రామ్మోహన్ ఫోన్ చేసి సర సాలు మొదలుపెడితే మమత రుసరుసలా డింది.

"ఏంటే బంగారం.. చిర్రుబుర్రులాడుతు న్నావ్... ఎన్నాళ్లయిందే? "

"ఏంటి.. తెగ ప్రేమ ఒలకబోస్తు న్నావ్? " అంది.

"ఓసి నీ దుంపతెగ.. అంత సీరియస్ అయిపోతున్నావ్.. అమ్మో.. ఎదురుగా వుండివుంటే మాడి మసైపోయేవాణ్ణేమో"

"నువ్వెందుకు మసైపోతావ్ బాబూ? తెలివైనవాడివి.. ఎదుటివాళ్ళనే భస్మం చేస్తావు.."

"ఇదిగో బంగారం.. నీ కోపతాపాలు పక్కనపెట్టి ఒక్క నిమిషం నేను చెప్పేది ప్రశాంతంగా విను"

"ఎన్నిసార్లు విన్లేదు.. చెవుల్లో క్యాలీఫ్ల వర్లు పెడ్తూనే వున్నావుగా.. ఇవ్వదల్చుకో కపోతే ఇవ్వనని కరాఖండిగా చెప్పాలి.. అంతేగానీ.. ఈ డొంకతిరుగుళ్ళెందుకు బావా? " చాలా అసహనంగా అంది మమత.

"నే చెప్పేది వినవే బంగారం.. ఈ క్షణం నీ పేరున రిజిస్ట్రేషన్ చేయడానికి నేను రెడీ.. కానీ.."

"ఆ కానీతోనే ఇన్నాళ్ళు జరుపుకొస్తు న్నావు.. అసలు నీ ప్రాబ్లం ఏంటో చెప్పు.. సునందకి తెలుస్తుందని భయమా? "

"నీకు ఇంతకుముందే చెప్పాను.. అస లదో పిచ్చిమొద్దు.. ఆస్తుల గొడవలు, డబ్బుల లెక్కలు దానికేమీ తెలీదు.. అడ గనే అడగదు.."

"మరింకేంటి సమస్య? ! ఇంత ఆలస్యం ఎందుకు చేస్తున్నావు? మన సంబంధం గురించి ఎక్కడ మా ఆయనకు తెలుస్తుం దోనని నేను గుప్పెట్లో ప్రాణాలు పెట్టు కుని బతుకుతున్నాను... నువ్వేమో

కాసేపు జల్సా చేయడమేగానీ... నా గురించి పట్టించుకోవు.. ఎంతవరకూ నీ సుఖం నువ్వు చూసుకుంటున్నావే తప్ప నా సంతోషం గురించి ఏమైనా ఆలోచిస్తున్నావా? నన్ను పెళ్ళాంతో సమానంగా కాదుగదా కనీసం నీ మనిషిగా కూడా చూడవా? " అంటూ పోట్లాడింది మమత.

"ఓసి పిచ్చిమొద్దూ.. క్రితంసారి నీకు చూపించిన డీలక్స్ ఫ్లాట్ నిజంగా నీదేనే తల్లీ.. కాకపోతే దాన్ని నీ పేర ఎలా రాయాలనేదే ఇన్నాళ్ళూ తోచక వాయిదా లేస్తూ వచ్చాను"

"ఏంటి బావా, మళ్ళీ ఇదో కొత్త కథా? "

"నన్ను నమ్మవే బంగారం.. ఫ్లాట్ రాసిస్తే.. అందరికీ.. ముఖ్యంగా మీ ఆయనకి మనమీద డౌటు రాదా.. చెప్పు? ! మనిద్దరి మధ్యా ఏమీ లేనిదే నేనెందుకు రాసిచ్చానని అనుమానించడా? ఎంత వెర్రి వెంగళప్పకయినా డౌటొస్తుంది.. ఇక మీ ఆయనకి అనుమానం రాదా.. నువ్వే చెప్పు"

"అదంత సమస్యా ఏంటి? మావాళ్ళు కొనిచ్చారని చెప్తాను.."

"మీ ఆయనకి తెలీని నిధులు మీవాళ్ళ దగ్గరున్నాయా? ముప్ఫయి లక్షలంటే మాటలా? చాక్లెట్ కొనిచ్చినట్లు కొనివ్వడానికి"

"నీకు ఇచ్చే ఉద్దేశం లేక ఇలాంటి సాకులు చెప్పి నెట్టుకొస్తావా? "

"సరే, మీ ఆయన్ని ఎలాగో నమ్మిస్తావు.. మరి అత్తయ్యని, మావయ్యని ఎలా నమ్మిస్తావు? నేను ఊరికే రాసిచ్చాననుకుంటారా? ఒక ఆడా, మగా మధ్య ఏమీ లేకుండానే బోల్డన్ని సందేహాలు వస్తాయి.. అలాంటిది ఖరీదైన అపార్టుమెంటు ఇచ్చానంటే ఎవరికైనా అనుమానం వస్తుంది.. అది మానవసహజం.. గుట్టుగా ఉన్న సంబంధాన్ని అనవసరంగా మనమే రట్టు చేసుకున్నట్టవుతుంది"

## నీటిమీద జైలు

**న్యూ**యార్క్ సిటీ డిపార్ట్‌మెంట్ ఆఫ్ కరెక్షన్స్ నడిపే ఒక జైలు సామర్థ్యం సరిపోకపోవడంతో కొత్తజైలును కట్టించారు. అయితే వారు ఖైదీలు తప్పించుకోకూడదని నీటిమీద తేలే జైలును నిర్మించారు.

ఎనిమిది వందల పడకలు గల దీన్ని న్యూఓర్లియెన్స్ రాష్ట్రంలో 1.61 కోటి డాలర్ల ఖర్చుతో నిర్మించారు. దీనిపేరు వెర్నన్ సి బె(చె)యిన్ సెంటర్. 1992 నుంచి ఇది పని చేస్తోంది. ఈ జైల్లో 16 డార్మిటరీలు, 100






సెల్స్ ఉన్నాయి. 600 అడుగుల పొడవు, 150 అడుగుల వెడల్పు గల ఈ నీటిపై తేలేజైలులో బాస్కెట్‌బాల్ కోర్టు, జిమ్, లైబ్రరీ, హాస్పిటల్స్ కూడా ఉన్నాయి. పదునైన తీగలతో ముప్పై అడుగుల ఫెన్స్‌ను జైలు చుట్టూ ఏర్పరిచారు. సదా ఓ పోలీస్ మర పడవ కూడా సిద్ధంగా ఉంటుంది. 2002లో ఒకతను ఆ ఫెన్స్ దాటి నది లోకి దూకి పారిపోతుండగా ఆ మరపడవలో వెళ్ళి పట్టుకున్నారు. 2004లో మరో ఖైదీ తన గాళ్‌ఫ్రెండ్ ఇచ్చిన తాళంచెవితో బేడీలను విప్పుకుని, ఖైదీలను రవాణా చేసే బస్సుకింద దాక్కుని పారిపోయాడు. నెల తర్వాత పోలీసులు అతడ్ని పట్టుకున్నారు. ఈ జైలును ఓ పెద్ద బల్లకట్టుగా చెప్పవచ్చు. బల్లకట్టు మీద జైలును నిర్మించారు. న్యూయార్క్‌లోని బ్రాంక్స్‌సిటీలో, హాలెక్‌స్ట్రీట్‌లోని ఒకటో నెంబర్ ఇల్లుగా దాని చిరునామా. ఆ వీధి అంతం అయ్యేచోట ఈ జైలు ద్వారం ఉంది. అమెరికాలో మరికొన్ని చోట్ల కూడా ఇలాంటి నీటిమీద తేలే జైళ్లు ఉన్నాయి. ఇలాంటిది అక్కడ ఇదే మొదటిది కాదు.

## చతుర ప్రవేశిక

### మే చతుర చదివారా?

ఈ ప్రశ్నలకు ఒక్క మాటలో జవాబు రాయగలరేమో చూడండి. ఎక్కువమంది సరైన జవాబులు రాస్తే డ్రాతీసి విజేతలను ఎంపికచేస్తాం. ఇందులో ఉత్తర ప్రత్యుత్తరాలకు తావులేదు.

1. సూర్య స్నేహితుడు ఎవరు?
జ.
2. రామ్మోహన్ హత్యకేసు దర్యాప్తు చేసింది?
జ.
3. మమత భర్త పేరు?
జ.
4. బోసు భార్య పేరు?
జ.
5. భరద్వాజ ఏ దేశంలో ఉండి వచ్చాడు?
జ.
6. బోసు కొడుకు రాజా లక్ష్యం ఏంటి?
జ.
7. ప్రతిభారాయ్‌కు జ్ఞానపీఠం వచ్చిన ఏడాది?
జ.
8. పిన్నవయసులోనే సర్జన్ అయిన బాలుడు?
జ.
9. చినువా అచెబె తొలి నవల?
జ.
10. బెంజమిన్ ఫ్రాంక్లిన్ ఏ దేశస్థుడు?
జ.

---

పంపినవారి పేరు: ----------------

------------------వయసు (   )

చిరునామా: -----------------

-------------------------

-------------------------

పిన్‌కోడ్:          ఫోన్ నెం:

చిరునామా : సంపాదకుడు, చతుర, ఈనాడు కాంపౌండ్, సోమాజిగూడ, హైదరాబాద్-500 082

చివరి తేదీ 17

ఈ కూపన్‌లోనే సమాధానాలు రాసి పంపాలి.

విపుల వినోదిని, చతుర ప్రవేశిక ఒకే కవరులో పంపవచ్చు.

"ఈ లెక్కన ఎప్పటికీ ఏమీ ఇవ్వవు.. అంతే కదా బావా.. సరే, అయిందేదో అయింది. ఇకనుంచీ నాకు ఫోన్లు చేయకు.. కలవకు.. ఫోన్ పెట్టెయ్"

"మమతా! నీకు మరీ తొందరపాటు ఎక్కువైంది.. చెప్పేది పూర్తిగా విను"

"ఇంకేం వినాలి? ఇకనుంచి గుప్పిట్లో ప్రాణాలు పెట్టుకుని నీకోసం ఒళ్ళప్పగించాల్సిన పన్లేదు"

"సరే, అదే నీ నిర్ణయం అయితే నేనేం బలవంతపెట్టను.. కానీ ముందు అడ్డు తగలకుండా చెప్పేది విను"

"......."

"మీ ఆయనకి మా వెంచర్ గురించి చెప్పు.. ఇప్పుడు కొంటే కారుచవక.. కొద్ది రోజుల్లో రేట్లు బాగా పెరిగిపోతాయని.. అప్పుడు కొందామన్నా కొనలేమని చెప్పి ఒప్పించు.. ఇంకోమాట.. ఇదేదో కల్పితమో ఒట్టిమాటలో కాదు.. నిజంగానే ఏడాది తిరిగేలోగా ఈ రేట్లకు రెక్కలొచ్చి విపరీతంగా పెరగనున్నాయి.."

మమత విసుగుని దాచుకుని "అసలు సంగతేంటో త్వరగా చెప్పు" అంది.

"మీ ఆయన్ని కొనడానికి ఒప్పించు.."

"అందుకు నీ వెంచరే కావాలా? ఇంకెక్కడా అపార్ట్‌మెంట్లు లేవా?"

"ఒసేయ్ కోపిష్టీ.. ఇన్‌స్టాల్‌మెంట్ల రూపంలో కట్టడానికి మీ ఆయన్ని ఒప్పించు.. ఒకవేళ ఒప్పుకోకపోతే నువ్వు దాచుకున్న డబ్బో లేక మీ నాన్న సర్దుబాటు చేసిన డబ్బో అని చెప్పు... నిజానికి ఆ డబ్బు నేనే సర్దుబాటు చేస్తాను.. ఒక్క రెండు నెల్లు గడవనిచ్చి లాటరీలో మీ పేరు వచ్చిందని.. తక్కిన వాయిదాలు కట్టనవసరం లేదని డిక్లేర్ చేస్తాను.."

"నిజంగానా?" అంది మమత ఆశ్చర్యం, ఆనందం కలగలసిన గొంతుతో.

"హమ్మయ్య.. మళ్ళీ అనుమానంతో చంపక నమ్మావు.. సంతోషం.. ఇలా మీ

ఆయన్ని ఇన్‌వాల్వ్ చేసి ఎంతోకొంత ఆయనతో ఖర్చు పెట్టిస్తే.. ఇక అతనికి పొరపాటున కూడా ఎలాంటి అనుమానం రాదు. ఆయనగారు అదృష్టమంటే తనదే నని పొంగిపోతాడు.. నీ కోరికా తీరు తుంది.. ఏమంటావు? "

"ఇదైనా నమ్మొచ్చా బావా? లేక.. నన్ను మళ్ళీ మాయచేసి మోసపుచ్చుతు న్నావా? " అంది మమత.

"కాదే పిచ్చిమొద్దూ.. రెండంటే రెండు ఇన్‌స్టాల్‌మెంట్లు కట్టగానే లక్కీగా లాట రీలో వచ్చిందని చెప్తాను.. మీ ఆయనకు కాదుగదా నరమానవులక్కూడా అను మానం రాదు.. అదంతా తన గొప్పతన మేనని మీ ఆయనగారు ఎగిరి గంతే స్తాడు.. అత్తయ్య, మామయ్య కూడా ఆనందిస్తారు.. ఏమంటావు? !" అని రామ్మోహన్ అన్నప్పుడు మమత కళ్ళు మెరిశాయి.

"నాకు అంత ముందుచూపు లేకపో యింది.." అంటూ మెచ్చుకుంది.

"అన్నట్టు నేనో చిన్న ఫాన్సీ షాపు పెట్టా లనుకుంటున్నాను" అందామె మళ్ళీ.

"ఏంటీ? "

"మా ఆయనకి తొందర్లో హైదరాబాద్ ట్రాన్స్‌ఫర్ అవనుంది.."

"భలే వుందే.. ఇక ఈ బంగారం కోసం అర్రులు చాచకుండా ఎప్పుడంటే అప్పుడు దక్కుతుందన్నమాట"

"ఆ.. మా ఆయనతో అటు ఫ్లాటు, ఇటు షాపు రెండూ ఒప్పించాలి.."

★ ★ ★

భర్త ఆఫీసునుండి వచ్చేసరికి ఉల్లిపా యలు సన్నగా తరిగి పకోడీ వేసింది మమత. కాఫీ కలిపి ఫ్లాస్కులో పోసింది.

కాసేపట్లో ఆంజనేయులు వచ్చి స్నానం చేసొచ్చి టీవీ ముందు కూర్చుని పకోడీ లున్న ప్లేటు చేతిలోకి తీసుకుంటూ "పిల్లలు తిని వెళ్ళారా? " అన్నాడు.

"ఆ.. తిన్నాకే ట్యూషనుకు వెళ్ళారు గానీ.. ముందా టీవీ కట్టెయ్.. నీకు రెండు ముఖ్యమైన సంగతులు చెప్పాలి" అంది మమత.

భార్య ఏం చెప్పినా ఆంజనేయులు రెట్టించడు. వెంటనే టీవీ కట్టేసి "ఏంటో చెప్పు? " అన్నాడు.

"నీది చూస్తే ఢోకా లేని గవర్నమెంటు ఉద్యోగమే అయినా గొర్రెతోక బెత్తెడే అన్నట్టు.. ఎంతకీ ఎదుగూబొదుగూ వుండదు.. ఇలా చూసినవాళ్ళు అలా ఎది గిపోతున్నారు.. ఇళ్ళు, స్థలాలూ అంటూ ఆస్తులమీద ఆస్తులు కూడబెట్టుకుంటు న్నారు.."

"అబ్బా.. అసలు విషయమేంటో చెప్పవే"

"మొన్నటిదాకా మీ చెల్లెళ్ళ పెళ్ళిళ్లు.. మీ నాన్నగారికి మోకాళ్ళు అరిగిపోయా యంటూ ఆపరేషనూ.."

"అది నా బాధ్యత.. నేనేదో ఇంకోదా నితో తిరుగుతూ డబ్బంతా అవజేసినట్లు మాట్లాడ్తావే? " అన్నాడు ఆంజనేయులు, బాధ్యతలు నెరవేర్చడం కూడా నేరమైనట్లు ఆరోపిస్తుందేమిటని కొంచెం విసుగ్గా.

భర్త 'ఎవర్తోనయినా తిరుగుతున్నానా? ' అనడంతో మమతకి ఒక్క క్షణం ఎక్కడో

## కొత్తగాలి...

**మేపే వాడు...**
**మనిషే!**
**మేసే వాడూ...**
**మనిషే.. లంచం!!**

– యు. చిట్టిబాబు,
కొత్త పాల్వంచ, ఖమ్మం జిల్లా

గుచ్చుకున్నట్లయింది. అయినా వెంటనే తేరుకుంది.

"అది కాదయ్యా... ఇద్దరాడపిల్లల్ని ఓ దారికి తేవడమంటే మాటలా? చదువులకే తడిచి మోపెడవుతోంది.. పెళ్ళి చేసేసరికి తాతలు దిగొస్తారు.. ఆపైన కడుపుతో వుండటం అని, బారసాల.. అంటూ ఎప్పటికప్పుడు కొత్తఖర్చులు పుట్టుకొస్తాయి"

"ఇంతింత ఉపోద్ఘాతాలు వద్దుగానీ, అసలు సంగతి చెప్పు" అన్నాడు ఆంజనేయులు.

"మావాళ్ళు కట్నం పేరుతో ఇచ్చిన డబ్బు ఏనాడో కరిగిపోయింది.. నీకేమో వెనక ఆస్తులేం లేవు.. ఎన్నాళ్ళిలా అద్దెకొంపల్లో పడి అఘోరిస్తాం? మనకంటూ పెద్ద

## కొత్తగాలి...

**ముగ్గులున్న వాకిళ్లు**
**పిల్లలున్న లోగిళ్లు**
**పెద్దలున్న ముంగిళ్లు**
**స్వర్గసీమలు**

– లక్ష్మీరంగరాజన్,
చెన్నై

భవంతి కాకున్నా కనీసం సొంతకొంప అని చెప్పుకోడానికి ఒక అపార్ట్‌మెంటయినా లేకపోతే ఎలా?" అంది మమత, ఇంకా సాగదీయకుండా అసలు విషయంలోకి వచ్చేసి.

"చూస్తున్నావుగా నేనేమైనా మందుకొట్టి జల్సాలు చేస్తున్నానా? ఒక్కజీతంతో నెట్టుకొస్తున్నా.. కనీసం నువ్వు డిగ్రీ అయినా పాసయ్యుంటే ఏదైనా చిన్న ఉద్యోగం చేస్తే వేణ్ణీళ్ళకి చన్నీళ్ళు తోడులా ఎంతో కొంత వచ్చేది.. పిల్లల ఫీజులు చూస్తే కొండెక్కి కూర్చున్నాయి"

"అలాగే వుంటుంది మరి.. నా మాట వినకుండా మామూలు స్కూళ్ళు వద్దని ఖరీదైన కాన్వెంటులో చేర్చావు.. కళ్ళు తిరిగే ఫీజు కడితేనే చదువు వంటబడుతుందా? ఆ మాటకొస్తే గవర్నమెంటు స్కూళ్ళలో చదువుకుని కలెక్టర్లయిన వాళ్ళు కూడా వున్నారు"

"అది నిజమే.. కానీ.. ఇప్పుడున్న కాంపిటీషన్ తట్టుకోవాలంటే ప్రయోగాలు చేసే ధైర్యం ఎక్కణ్ణించి వస్తుంది? ఏదో ఒక స్కూల్లో చదివిస్తే.. రేపు వాళ్ళూ నీలా, నాలా తయారైతే ఎలా? "

"సరే, అయిపోయిన పెళ్ళికి బాజాలన్నట్టు ఆ సంగతులెందుగ్గానీ.. ఈ ఖర్చులు ఇంకా పెరిగేవే కానీ, తగ్గేవి కాదు.. కనుక అప్పోసప్పో చేసి మనం ఒక ఫ్లాట్ కొనుక్కోవాలి"

"అప్పు చేస్తే మాత్రం తీర్చనక్కర్లేదేంటి? "

"ఎందుకు తీర్చొద్దు.. తీర్చాలి.. ఒకేసారి ఎటూ లక్షలు ధారపోయలేం కాబట్టి.. ఇన్‌స్టాల్‌మెంట్లో తీసుకుందాం"

"బ్యాంక్‌లోన్ ఇస్తారు.. కానీ.. జీతం లోంచి ఠంచనుగా కట్టవుతుంది.. తక్కిన ఖర్చులకి ఎలా సరిపోతుంది? "

"లోన్ వద్దు.. మొన్న మా మేనమామ కొడుకింటికి వెళ్ళానుగా.."

"ఎవరూ... కన్‌స్ట్రక్షన్స్ రామ్మోహన్ గారా? "

"ఆ.. వాళ్ళది కొత్త వెంచర్ స్టార్టయిందట.. సంజీవ్‌రెడ్డి నగర్లో.."

"ఎస్సార్ నగరా.. తేలిగ్గా నలభై లక్షలుంటుంది.. మన తాహతుకి మించిన కోరికలెందుకు? "

"కొనేది సెంటర్లో కాకపోతే అడవిలో కొనుక్కుంటామా? ముందు చెప్పేది విను.. ఇన్‌స్టాల్‌మెంట్ బేసిస్‌లో కట్టించుకుంటారు.. ప్రతినెలా లక్కీ డ్రా తీస్తారు..

ఒక వేళ లాటరీలో పేరొస్తే ఇక మిగిలిన వాయిదాలు కట్టనవసరం లేదు.."

"లాటరీ వస్తుందని నమ్మకమేంటీ? రాకపోతే చివరివరకూ కట్టాల్సిందేగా.. మనవల్ల అవుతుందా? తలకి మించింది పెట్టుకుంటే ఆనక ఎంత కష్టం? "

"ఇలా నిరాశగా ఆలోచిస్తే మనం ఎప్పటికీ ఇలా అద్దెకొంపల్లోనే జీవిస్తాం.. బాగుపడే దిశగా ఆలోచించాలి... అసలిన్నాళ్ళూ నీతోబాటు నేను కూడా ఏమీ ఆలోచించకుండా కాలక్షేపం చేశాను.. ఇప్పటికైనా మేల్కొనకపోతే కష్టం.. తొందరపడాలి"

"అలాని ఆకాశానికి నిచ్చెనలు వేస్తావా? "

"నేనేం చంద్రమండలంలో ఇల్లు కట్టమన్లేదే.. ఆఫ్టరాల్ కూలి చేసుకునేవాళ్ళు కూడా సొంతింట్లో వుంటున్నారు"

"వాళ్ళకంటే 'రాజీవ్ స్వగృహ' పేరుతోనో, 'రాహుల్ సౌధం' పేరుతోనో ఇల్లు కట్టిస్తారు.. కనీసం పట్టా భూములు వుంటాయి.. మనకెవరూ దానమివ్వరే!"

"ఎవరి దయాదాక్షిణ్యాలూ అక్కర్లా.. తెలివివుంటే మనమూ బాగుపడొచ్చు. ముందు నువ్వు ఫ్లాట్ బుక్ చేయడానికి ఒప్పుకో.. ఆనక ఏ ఇబ్బందీ రాకుండా నేను చూస్తా"

"ఎలా? డబ్బు కాసే చెట్టేమైనా కొనుక్కొచ్చావా? "

"లేదు.. నేనో చిన్న ఫాన్సీ షాపు పెట్టబోతున్నా.."

"ఏంటీ? " తింటున్నది గొంతులో అడ్డుపడ్డట్టయింది ఆంజనేయులికి.

"నేనేమీ కొండని పిండి చేస్తానన్లేదు, ఆకాశాన్ని దింపుతానన్లేదు.. అంతలేసి ఆశ్చర్యాలెందుకు? "

"ఇవ్వాళేదో నీకు బుర్ర గిర్రున తిరిగిపోయినట్టుంది"

"అదేం కాదు.. ఇన్నాళ్ళు ఈ బుర్రని ఉపయోగించలేదు.. ఇప్పుడే వాడటం మొదలెట్టాను.."

## నిర్ణయకర్తలు మీరే!

ఫిలడెల్ఫియాకు గవర్నర్ అయిన బెంజమిన్ అమెరికా రాజ్యాంగంపై సంతకం చేసి, ఇండిపెండెన్స్ హాల్ నుండి ఇంటికి తిరిగొచ్చేందుకు ఉద్యుక్తుడవుతున్నాడు.



అప్పుడొక యువకుడు ఆయనను ఆపి 'డాక్టర్ బెంజమిన్! మీరెలాంటి ప్రభుత్వాన్ని మనకు ఇవ్వనున్నారు? గణతంత్ర వ్యవస్థా, లేక రాజరికమా? ' అని గట్టిగా నిలదీసాడు.

దానికి బెంజమిన్ చిరునవ్వుతో 'మీరేవ్యవస్థలో ఉంటారనేది మీ చేతిలోనే ఉంటుంది. కాబట్టి ఏ ప్రభుత్వంలో ఉంటామనేది అంతిమంగా మీ చైతన్యం మీద ఆధారపడి ఉంటుంది' అన్నాడు నర్మగర్భంగా.

దాంతో విషయం బోధపడిన ఆ యువకుడు మళ్లీ నోరెత్తలేక తల దించుకున్నాడు.

"షాపుకు పెట్టుబడి? "

"అదంతా నీకెందుకు.. అన్నీ రెడీక్యాష్‌తోనే చేయాలంటే అయినట్టే.. డబ్బున్నోళ్ళ దగ్గర అప్పు తీసుకుంటాం"

"అప్పెవరు ఇస్తారు.. ఆనక ఎలా తీరుస్తావు? "

"నామీద భరోసా వుంచు.. అన్నీ నేను చక్కబెడ్తాను. కావలసిందల్లా నీనుండి కాస్త సహకారం అంతే.. నువ్వు కాదూ, కూడదూ అనకుండా సరేనను చాలు"

"కానీ కీడెంచి మేలెంచమన్నారు.. తర్వాతేమైనా జరగరానిది జరిగితే? "

"మంచి మాటలు మాట్లాడవయ్యా మగడా! మొన్నేగా పాజిటివ్ థింకింగ్ గురించి ఓపిగ్గా గంట ప్రోగ్రాం చూశావు.. కుడిచెవితో విని ఎడమచెవితో వదిలేయడ మేనా? ఒక్కముక్క కూడా బుర్రలోకి దూరలేదా? " వెటకారంగా అంది మమత.

"నీ ఇష్టం.. నీ మాటకు నేనెప్పుడూ అడ్డు చెప్పను కానీ.. దిగేముందు లోతు తెలుసుకోవాలి.. ఇంతకంటే నేనేం చెప్పను.."

"నా మంచి మొగుడివిగా.. నువ్వు కేవలం నాకు అండగా నిలబడు చాలు.. అంతా నేనే చూసుకుంటాను.. మావాళ్ళన డిగి కొంత డబ్బు తెస్తాను.. ముందు ఫ్లాట్ బుక్ చేద్దాం.. లక్కీగా మన పేరు లాటరీలో వచ్చేసిందనుకో"

"ముందే ఆశలు పెట్టుకోవద్దు.."

"సరే.. రాకపోతే పోనీ.. మన షాపు భేషుగ్గా నడుస్తుంది.. ఆ ఇన్‌కంతో ఇన్‌స్టాల్‌మెంట్లు కట్టేద్దాం.."

"మరి, షాపు పెట్టుబడి తీర్చొద్దూ? "

"అయ్యో మొగుడా.. నీకసలు వ్యాపారం అంటే తెలుసా? రూపాయి వస్తువు మీద నలభై నుండి అరవై పైసల లాభం వేసు కుని అమ్ముతారు. కొట్టు అద్దె, టాక్సు అన్నీ కట్టగా లాభాలు బాగానే మిగు ల్తాయి"

"నీకు అంత నమ్మకం వుంటే అలానే" అని అతననగానే ఆమె సంతోషంగా వంటింట్లోకి వెళ్ళి ఇద్దరికీ కాఫీ తెచ్చింది.

త్వరలోనే మమత భర్తతో కలిసి హైద్రాబాదు వెళ్ళి ఫ్లాట్ బుక్ చేసి వచ్చింది. ఆ విలాసవంతమైన ఫ్లాట్ చూసి ఆంజనేయులు కూడా మురిసిపోయాడు. తన భర్తతో మమతకున్న సంబంధం గురించి తెలీదు కనుక సునంద ఆ భార్యా భర్తలిద్దరికీ ఎంతో మర్యాద చేసింది. "కాస్త చవగ్గా ఉన్నప్పుడే కొనుక్కోవా ల్సింది. కనీసం ఇప్పటికైనా నిర్ణయం తీసు కుని మంచిపని చేశారు" అని మనస్ఫూ ర్తిగా అభినందించింది.




ఆంజనేయులుకి మౌలాలీకి ట్రాన్స్‌ఫర యింది.

ఇల్లు, షాపు కూడా పక్కపక్కనే దొరి కాయి. మరీ మెయిన్ రోడ్డేమీ కాకపోవ డంతో యాభైవేల పగిడీ మాత్రమే అడి గారు. షాపుకు కావాల్సిన సామానంత కొ ంది మమత. వాటన్నిటికీ అవసరమైన డబ్బంతా రామ్మోహన్ ఇచ్చాడు. అతను అప్పుగా సర్దాడని, వడ్డీ కట్టనక్కర్లేదని, నెమ్మదిగా ఉన్నప్పుడు సర్దమన్నాడని భర్తతో చెప్పింది మమత.

తన భార్యకు, రామ్మోహన్‌కు ఉన్న సంబంధం గురించి అసలు విషయం తెలీదు కనుక రామ్మోహన్ ఛాలా మంచి వాడంటూ ప్రశంసించి, కృతజ్ఞత ప్రకటిం చాడు ఆంజనేయులు.

చూస్తూ చూస్తూ రెండు నెలలు ఇట్టే గడిచిపోయాయి.

రామ్మోహన్ మాట తప్పకుండా మమ తకు ఫ్లాట్ వచ్చేలా చేశాడు.

ఆంజనేయులికి ఫోను చేసి 'లక్కీ డ్రాలో మీ పేరొచ్చింద'ని చెప్పాడు.

ఆంజనేయులి సంతోషానికి అవధుల్లే కుండా పోయాయి. "ఇదంతా నీ తెలివే..

నీ చలవే.. లేదంటే మనకెప్పటికీ ఇంత చక్కటి ఫ్లాట్ వుండేది కాదు" అంటూ భార్యను మనసారా మెచ్చుకున్నాడు.

మమతకు ఒక పక్కన సంతోషంగా, గర్వంగా ఉన్నా.. తనను పొరపాటున కూడా అనుమానించని భర్తను చూస్తే గిల్టీగా అనిపించింది. ఇంత ఘోరమైన తప్పిదం చేశానేమిటని పశ్చాత్తాప పడింది. మళ్ళీ అంతలోనే.. ఈ తప్పే చేయకపోతే ఇదంతా జరిగేదా? అసలు దీన్ని తప్పని ఎందుకనుకోవాలి? తాను మరెవరితోనో సంబంధం పెట్టుకోలేదు.. మొదట్నించీ మనసుపడ్డ బావతోనే కదా.. ఏమీ కాదు.. ఇష్టమైన వ్యక్తితో సంబంధం కళంకం ఎలా అవుతుంది? ఆ ఇష్టాన్ని, కోరికని మనసులోనే సమాధి చేసుకున్నంత మాత్రాన పవిత్రమైపోయినట్లు అవుతుందా? సమాజానికి భయపడి పైకి ఏమీ పొక్కక పోయినా కోరిక, కాంక్ష అంటూ కలిగితే, అలాంటి ఊహలు చేస్తే మనసు స్వచ్ఛంగా ఉన్నట్లా? కళంకం అంటినట్లే కదా?! దానికంటే ఇదే మేలు. మనసుకి ఏది న్యాయం అనిపిస్తే అదే చేయాలి.. లోకంలో న్యాయాలు, నీతులు ఎప్పుడూ మారుతూ వుంటాయి. ద్రౌపది పంచపాం డవులని ఏకకాలంలో చేసుకుంది. ఆ కాలంలో అది న్యాయం. కనుక నీతికి, న్యాయానికీ నిర్వచనమే లేదు. రాజులెం దరో అనేక పెళ్ళిళ్ళు చేసుకునేవారు. మరెందరితోనో సంబంధాలు పెట్టుకునేవా రు. అవన్నీ సర్వసాధారణమైనప్పుడు తాను చేసింది మాత్రం తప్పెందుకు అవు తుంది?!

సగం జీవితం ముగిసేపోయింది.. ఇక ఇప్పటికైనా కళ్ళు తెరిచి తనకు నచ్చినట్లు చేసింది. అందుకు దిగుళ్ళు, పశ్చాత్తాపాలూ అక్కర్లేదు.. ఏదో తప్పు చేశాను, మహాప రాధం జరిగిపోయింది అనుకుంటే తనలో దిగులు నిప్పు రగులుతుంది. ఆ బాధ తనను దహించడానికి వీల్లేదని అనుకుంది మమత.

వెంటనే జోరీగల్లా ముసురుతున్న ఆలో చనలను నియంత్రించుకుని మామూలు మనిషైపోయింది. రొటీన్లో పడింది.

ఆంజనేయులు ఫ్లాటును భార్య పేరు తోనే రిజిస్టర్ చేయమని చెప్పాడు.

నామమాత్రంగా గృహప్రవేశం చేసి, అద్దెకు ఇచ్చేశారు. ఆ ఫ్లాటుకు పద్దెనిమిది వేలు అద్దె వస్తోంది. ఫ్యాన్సీ షాపుమీద ఆదాయం బాగానే వుంది.

మమత షాపుకు చుట్టుపక్కల మరే ఫ్యాన్సీ షాపు లేకపోవడంతో అతి కొద్దికా లంలోనే బేరం పుంజుకుందని, కొంతకా లంలో మరింత ఆదాయం వస్తుందని భార్యాభర్తలిద్దరూ సంతోషించారు.

మరి కొన్నాళ్ళు గడిచాయి.

మమత ఆరోజు పనిమీద అటుగా వెళ్ళి, పక్కనే కదాని రామ్మోహన్ ఇంటికెళ్ళింది. ఎప్పట్లాగే ఇంటినిండా జనం.. కోలా హలం..

కాసేపటికి సునంద బయల్దేరింది.

"ఎక్కడికి వెళ్తున్నావు సునందా.. నువ్వు లేకపోతే.. నేనుండి ఏం చేస్తాను.. నేనూ బయల్దేరతాను" అంది మమత.

"అయ్యో, ఇప్పుడొచ్చి, ఇప్పుడే వెళ్ళడ మేంటి? నువ్వొస్తావని తెలీదుగా.. మా పిన్నికూతురు ఎప్పట్నించో గొడవపెడ్తోంటే ఇవాళ వస్తానని చెప్పాను.. నాకోసం చూస్తుంటుంది.. లేకపోతే మానేద్దును.. వీళ్ళందరూ లేరా ఏంటీ.. నువ్వు కూర్చో. నేనెంత.. మూడునాలుగ్గంటల్లో వచ్చే స్తాను" అంది.

"నేను కూడా కొంచెంసేపు వుండి వెళ్ళి పోతాను సునందా.. అసలు వస్తానని నాకే తెలీదు.. పెద్దపాపకి ఇక్కడి టైలర్ కుడితే తప్ప నచ్చడం లేదు.. రేపు వాళ్ళ



స్కూలు యానివర్సరీ.. కుట్టడానికిచ్చిన డ్రెస్ తీసికెళ్దామని వచ్చాను.. ఆయన ఆఫీసునుండి వస్తూ తెస్తానన్నారు.. కానీ... ఏమైనా తేడా వుంటే సరి చేసుకోడానికి కుదరదని ముందే తెమ్మని బతిమాలితే వచ్చాను"

"నువ్వు రాగానే నేను వెళ్తున్నందుకు సారీ మమతా! పోనీ ఇప్పుడు రానులే, ఇంకోసారి వస్తానని మా పిన్ని కూతురికి చెబుదామంటే.. అది కోపం తెచ్చేసుకుంటుంది. ఊరుకోదు" అంటూ చెప్పులేసుకుంది సునంద.

"మరి... నువ్వెళ్ళవా బావా, సునందను దింపడానికి? " అంది మమత రామ్మోహన్ వంక చూసి.

"లేదు. నాకు బద్ధకంగా వుంది..."

"డ్రైవరున్నాడుగా మమత... నే వెళ్తాను... ఓకే వుంటానండీ"" అని ఇద్దరితో చెప్పేసి సునంద వెళ్ళిపోయింది.

రామ్మోహన్‌కి మమత అనుకోకుండా రావడం, తనకు ఏకాంతం అందిస్తున్నట్టుగా అప్పుడే సునంద బయటకు వెళ్ళిపోవడం పరమానందం కలిగించింది. కానీ, ఇంటినిండా జనాలు.. మరదలితో పడగ్గది చేరలేదు. ఎంత అందరూ హాల్లో టీవీ చూస్తూ మైమరచి ఉన్నా... తమ బాగోతం పొరపాటున ఎవరికంటైనా పడితే పరువుపోతుంది అని నిట్టూర్చాడు.

సునంద వెళ్ళగానే "బంగారం.. స్టోర్ రూంలోకి పదవే..." అన్నాడు లో గొంతుతో ఎవరూ వినకుండా...

"ఛ... ఊరుకో బావా... నువ్వు మరీ అతి చేస్తున్నావు..." గొణిగింది మమత.

"రెండంటే రెండు నిమిషాలు... ప్లీజ్... ప్లీజ్ స్టోర్‌రూం వైపు ఎవరూ రారు... నా బంగారం కదూ!" అంటూ బతిమాలాడు.

రామ్మోహన్ మాట కాదనలేక మమత స్టోర్ రూంవైపు నడిచింది. ఆమె వెళ్ళిన రెండు నిమిషాలకి అతనూ అందులోకి వెళ్ళాడు. వెళ్ళీ వెళ్లడంతోనే అమాంతం గుండెలకు బలంగా హత్తుకున్నాడు.

"ఎన్నాళ్ళయిందే నీతో గడిపి... నీతో వుంటే స్వర్గంలో ఉన్నట్లే వుంటుంది..." అంటున్నాడు తమకంగా.

మమతకు ఏదో అయిపోతోంది. కానీ అంతలోనే జరగరాని ఘోరం జరిగింది.

చేరవేసిన తలుపులు ఊహించని విధంగా దఢాలున తెరుచుకున్నాయి.

ఎదురుగా నిప్పులు కక్కుతోన్న కళ్లతో సునంద!

మమత, రామ్మోహన్ ఇద్దరూ ఉలిక్కిపడి చూశారు.

మమతకి సిగ్గుతో తల వాలిపోయింది.

"నువ్వసలు మనిషివా, పశువ్వా? " అంది సునంద ఉగ్రనరసింహావతారమెత్తి.

"ఏయ్, అరవకు.. అందరూ వింటారు" అన్నాడు రామ్మోహన్.

"పెళ్ళాన్ని అటు వెళ్ళనిచ్చి.. మరదలితో రంకు సాగిస్తున్నావా... నేనేమో అరవకూడదా? " ఊగిపోతూ అంది సునంద.

"ఏం లేదు. చిన్న సరదా... అంతే..."

"అదే, నేనూ ఇలా ఇంకోడితో వుంటే..."

"నోర్మూసుకో... అవతలికి పద. పెత్తనాలకి బయల్దేరిందానివి మళ్ళీ ఎందుకొచ్చావు? " అనేసి రామ్మోహన్ విసవిసా అక్కణ్ణించి వెళ్ళిపోయాడు.

మమతకు భూమిలోకి కుంగిపోతున్నట్టుగా వుంది.

సునంద ముఖం చూసే ధైర్యం లేక అటు తిరిగి నిలబడింది.

"ఏం మమతా, నీకేం తక్కువైంది... అంత మంచి మొగుణ్ణి పెట్టుకుని... ఈయనగారితో ఇలా చేయడానికి నీకెలా మనసొచ్చింది... ఇంకో ఆడదానికి ద్రోహం ఎలా చేయాలనిపించింది? " అంటోన్న

సునంద గొంతు పూడుకుపోయింది. కళ్ళలో నీరు నిండింది. ఆ సన్నివేశాన్ని చూసి తట్టుకోలేనట్లుగా పరుగులాంటి నడకతో తన గదికి వెళ్ళిపోయింది సునంద.

మమత రామ్మోహన్ ఇంటినుండి ఎలా బయటపడిందో, టైలర్ షాపులో కూతురి డ్రెస్ ఎలా తీసుకుందో, ఇంటికెలా చేరిందో తెలీదు.

ముఖం వేళ్ళాడేసి, బేలగా ఉన్న తల్లిని చూసి పిల్లలిద్దరూ ఆందోళన చెందారు. "ఏమైందమ్మా? " అంటూ ఇద్దరూ భయపడుతూ అడిగారు.

"ఏం లేదురా కన్నా... లో బీపీ... బాగా నీరసంగా వుంది... నన్ను కాసేపు పడుకోనివ్వండి... మీ నాన్నొచ్చినా లేపొద్దు..." అంటున్న మమత స్వరం నూతిలోంచి వస్తున్నట్టుగా వుంది.

"సారీ అమ్మా... నాన్న తెస్తానంటే కూడా మొండిగా నిన్ను వెళ్ళమన్నాను..." అంటూ నొచ్చుకుంది పెద్ద కూతురు.

"నిజమే, ఇవాళ వెళ్ళకపోతే బాగుండేది" అంది మమత.

"ఇంకెప్పుడూ నిన్నలా ఫోర్స్ చేసి పంపను... నువ్వయినా బాగాలేదని చెప్పొచ్చుగా..." అంది కూతురు బాధపడ్తూ.

"సర్లే, అయ్యిందేదో అయ్యింది. ఇంకా నయం. ఏ దార్లోనో కళ్ళు తిరిగి పడలేదు.. అమ్మా.. ఒక్కసారి లేచి, ఏమైనా తాగి పడుకో" అంది చిన్న కూతురు.

"వద్దు నాన్నా... ఇప్పుడేం వద్దు... నన్ను పడుకోన్వండి... అవతలికెళ్ళండి" అంది మమత.

మమతకు తల కొట్టేసినట్లయింది. ఎవరైనా చూస్తారేమోనన్న భయం ఎప్పుడూ నీడలా వెంటాడినా, మరీ సునంద కళ్ళలోనే పడతామని, ఇంత సిగ్గుపడాల్సిన హీనమైన పరిస్థితి దాపురిస్తుందని ఎప్పుడూ అనుకోలేదు.

## ఎవరు ఎవరిని జయించారు?

అమెరికా విప్లవం కొనసాగుతున్నప్పుడు బెంజమిన్ తన దేశ రాయబారిగా ఫ్రాన్స్‌లో ఉంటున్నాడు. అప్పుడు ఒక దుర్వార్త ఆయన చెవినపడింది. ఫిలడెల్ఫియా నగరాన్ని బ్రిటిష్ జనరల్ హోవ్ పట్టుకున్నాడనీ, అది అతడి



అధీనంలోకి వెళ్లిపోయిందనేది ఆ వార్త సారాంశం. అది విన్న బెంజమిన్ నింపాదిగానే ఉన్నాడు.

ఈ దుర్వార్త విన్నా అంత ప్రశాంతంగా ఎలా ఉండగలుగుతున్నావని మిత్రులు ఆయనను అడిగారు. దానికాయన 'ఫిలడెల్ఫియాను తన అధీనంలో పెట్టుకోవడం జనరల్ హోవ్‌కు శక్తికి మించిన పని. ఫిలడెల్ఫియాను జనరల్ హోవ్ పట్టుకున్నాడన్న దానికి భిన్నంగా త్వరలోనే ఫిలడెల్ఫియానే జనరల్ హోవ్‌ను పట్టుకుందన్న సువార్తను మీరు మీ చెవులారా వింటారు' అన్నాడాయన చమత్కారంగా. ఆ తర్వాత అదే నిజమైంది కూడా.

అసలు వెళ్ళినట్లే వెళ్ళిన సునంద ఎందుకు వెనక్కి వచ్చినట్లు? అంటే ఆమెకి తనమీద ముందే అనుమానం వుందన్న మాట. ఇన్నాళ్ళూ ఏమీ తెలీనట్లు అమాయకత్వాన్ని నటించింది, అంతేనా? ఆవేళ చిన్నబావ తన భుజమ్మీద చెయ్యేసినప్పుడే తనకు అనుమానం వచ్చింది. నిజానికి సునంద అప్పుడు కొంచెం గ్రహించివుంటుంది. కానీ అప్పుడసలు ఏమీ చూడనట్లే ఎంత బాగా నటించింది.. మహానటి

సావిత్రి కాబోలు. ఇలాంటివాళ్ళు నిజంగా చాలా డేంజర్. ఆవిడగారు తమ విషయం గ్రహించినట్లుగా రవ్వంత అనుమానం చూపినా తాను జాగ్రత్తపడేది. కానీ రెడ్‌హ్యాండెడ్‌గా పట్టుకోవడం కోసం ఇంతగా నటిస్తుందనుకోలేదు.

దొంగ మొహంది... పిల్లి మాదిరిగా ఎంతమాత్రం చడీచప్పుడు లేకుండా వచ్చి కొంప ముంచింది. ఈవిడగారిని తెలివైన ఆడది అనుకోవాలా, తెలివితక్కువ ఆడది అనుకోవాలా? ఒకవేళ బావ తనమీద చెయ్యేసిన రోజున అనుమానం వస్తే... ఆ సంగతి తనవరకూ రాకుండా ఒంటరిగా మొగుణ్ణి నిలదీసి అడగాలి కానీ... కడుపులో కుళ్ళు దాచుకుని ఇలా చేస్తుందా? అప్పుడూరుకుని ఇప్పుడీ ఏడ్పేంటి? నిజానికి తెలివైనదే అయితే పరిస్థితి ఇంతదాకా వచ్చిందని తెలిశాక నోరుమూసుకుని ఊరుకోవాలి కానీ ఇదేం పద్ధతి? ఈ వరసన పరాభవిస్తుందా? అయినా ఇప్పుడావిడగారికి ఏం లోటొచ్చింది? మొగుడు కోట్లు కోట్లు సంపాదిస్తున్నాడు... రోజూ తనతోనే వుంటాడు... ఎప్పుడో అమావాస్యకో, పౌర్ణమికో తనతో వుంటే ఇద్దరూ కాస్తంత ఆనందం పంచుకుంటే ఏమైనా సంపదలు తరిగిపోతాయా? పోనీ, ఆవిడే అతడి ఇష్టప్రకారం సుఖపెడితే నాకోసం వెంపర్లాడడు కదా... అమ్మ పెట్టదు, అడక్కుతిన్నివ్వదు అంటే ఎలా? ఇంతకీ ఇప్పుడు తన మొగుణ్ణి సణగడం, గొణగడంతో వదిలిపెడ్తుందా లేక తన భర్తతో చెప్పి పుణ్యం కట్టుకుంటుందా? ఒకవేళ తన భర్తకి ఈ సంగతి తెలిస్తే తనని బతకనిస్తాడా? ఎంత మంచివాడైతే మట్టుకు ఇంకో సంబంధం పెట్టుకున్నానంటే ఊరుకుంటాడా? తీగ లాగితే డొంక కదిలినట్లు... తాను చాన్నాళ్ళుగా ఏదో మిషతో హైదరాబాదు వస్తున్నది ఇందుకేనని, అపార్ట్‌మెంట్ అందుకే ఇచ్చాడని, షాపు నడుపుకోడానిక్కూడా అందుకే సహకరించాడని మొత్తం పూస గుచ్చినట్లు తెలిసిపోదూ? అప్పుడాయన తనను తన్ని తగలేయడూ? ఇంట్లోంచి వెళ్ళగొట్టడూ? తల్లిదండ్రులతో సహా అందరూ ఛీ కొట్టరూ? పిల్లలు తన మొహమ్మీద ఉమ్మేయరూ? అలా జరిగితే తాను భరించగలదా? ఏ ఎలకల మందో తిని చావాల్సిందేగా? ఇంకా ప్రపంచం తెలీని తన పిల్లల గతేంటి? వాళ్ళెలా బతుకుతారు? వాళ్ళను దిక్కులేని వాళ్ళను చేయడం న్యాయమా?

అసలు తనకెందుకీ బుద్ధి పుట్టింది? బావను చూడగానే తన పాతివ్రత్యమంతా గంగలో కలిసిందే... ఎంతటివాళ్ళయినా ఎక్కడో ఒకచోట, లోబడతారా? తనకింత వయసొచ్చినా కోరికలు చావలేదేంటి? బావ మాటలు, చేతలు తననెందుకంతగా రెచ్చగొడతాయి? బొత్తిగా నిగ్రహించుకోలేదేంటి? అతన్నుండి తాను సొమ్ము ఆశించింది ఎప్పుడో తర్వాత... కానీ అంతకంటే ముందే అతనంటే తనకు విపరీతమైన ఆకర్షణ... చెప్పలేనంత వ్యామోహం... అతని స్పర్శకోసం తన శరీరంలోని అణువణువూ తహతహలాడుతుంది. అతని చేయి తాకితే చాలు తనను తాను నియంత్రించుకోలేదు. ఆర్తిగా వాటేసుకుంటుంది. లతలా అల్లుకుపోతుంది. తామిద్దరి మధ్యా గాలి కూడా చొరబడకుండా వుంటే బాగుండుననిపిస్తుంది. ఎవరూ లేని ఏకాంతాలకు పారిపోవాలనిపిస్తుంది.

ఎందుకిలా...? ఎందుకిలా...?

ఉహూ...! ఇలా ఎన్ని వేలసార్లో ప్రశ్నించుకుంది. ఎన్నడూ సమాధానం లేదు... ఇదంతా తనకు అయోమయంగా అనిపిస్తోంది.

తన భర్త మంచివాడు కాదా అంటే... ఇంత మంచివాడు కోటికొక్కళ్ళు కూడా

వుండరు. మరి అంత మంచివాణ్ణి తానెలా వంచిస్తోందని కూడా చాలాసార్లు బాధపడింది. కానీ దానికీ సమాధానం లేదు. తన భర్తతో గడుపుతున్నప్పుడు ఏదో రొటీన్‌గా వుంటుంది. కానీ అదే చిన్నబావతో అలా కాదు. మాటలకందని ఆనందం అనుభూతికొస్తుంది. బావే అన్నట్లు దొంగచాటు వ్యవహారం మరింత థ్రిల్‌గా కలిగిస్తుంది కాబోలు. దొరక్క దొరక్క దొరికే అవకాశం... ఈ కాసేపే అతనితో వుండేది అనుకోవడం... ఎవరైనా చూస్తారేమో.. మళ్ళీ ఎప్పుడో ఇంత మాధుర్యాన్ని చవిచూసేది.. అనే భయాలు,

> ## కొత్తగాలి...
>
> **చెప్పేవాడు**
> **అమ్ముకునేది**
> **చూపించుకునేవాడు**
> **నమ్ముకునేది ... జాతకం!**
>
> – యు. చిట్టిబాబు,
> కొత్తపాల్వంచ, ఖమ్మం జిల్లా

బెంగలు కోరికని మరింత పెంచుతున్నాయి. రెట్టింపు ఆనందాన్ని ఇస్తున్నాయి. ముందు మమతకు ఆ సంగతులు బోధపడలేదు. కానీ... రామ్మోహన్ చెప్పాక అదంతా నిజమని అర్థమైంది.

ఈ అగమ్యగోచరమైన ఆలోచన్లు, అంతులేని దుఃఖం సంగతి అలా వుంచితే ఇప్పుడేమిటి కర్తవ్యం? ఏం జరగనుంది? ఏం చేయాలి?

చాలాసేపు ఆలోచనల జోరీగలు ఎడతెరిపి లేకుండా హోరు పెట్టిన తర్వాత మమతలో ఒక విధమైన మొండి ధైర్యం వచ్చింది. ఇతరత్రా ఏమైనా జరగొచ్చు కానీ, సునంద ఈ సంగతి తన భర్తకు అయితే చెప్పదని నమ్మకంగా అనిపించింది. మహా అయితే బంధువుల్లో ఎవరితోనైనా అంటుందేమో! వాళ్ళెవరి ద్వారానైనా తన తల్లిదండ్రులకి చేరుతుందేమో... ఒకవేళ వాళ్ళొచ్చి తనను నిలదీస్తే.. 'లక్కీ డ్రాలో ఫ్లాటు వచ్చిందని ఈర్ష్య అయ్యుంటుంది... ఈ రకంగా ప్రచారం చేస్తోంది... ఏదో వరసైందాన్ని కాబట్టి బావ కొంచెం చనువుగా మాట్లాడినంతలో ఇలా అక్రమ సంబంధాలు అంటగడుతుందా?' అని తానే ఎదురు వాదిస్తే సరి... అంతే అయ్యుంటుందని వాళ్ళూ నమ్ముతారని అనుకునేసరికి మమతకి ఇందాకటి భయాలన్నీ తోకముడిచి పారిపోతున్నట్లు అనిపించింది. లోలోపలి అలజడి అంతా మాయమైంది. మనసు ప్రశాంతపడింది.

ఏం జరగనుందో తెలీదు.. కానీ ఏం జరిగినా ధైర్యంగా ఎదుర్కోవాలి...స్థిరంగా నిలబడాలి.. ఓడిపోకూడదు.. పారిపోకూడదు.. అంతే.. తాను ఆత్మస్థైర్యానికి పెట్టింది పేరు. తాను ఇతరులకి ధైర్యం చెప్పేట్లు వుండాలే గానీ, తానే అధైర్యపడితే ఎలా? ఎట్టి పరిస్థితిలోనూ డీలా పడకూడదు- అనుకుంది మమత.

"బాగాలేదంట. ఏమైంది, డాక్టరు దగ్గరికి వెళ్దామా?" అంటూ రాత్రి ఎనిమిద గంటల వేళ పడగ్గదిలోకి వచ్చాడు ఆంజనేయులు.

"ఏంలేదు, బాగానే వుంది" అంది మమత.

"నువ్వు ప్రతిదానికీ అంతే... పద, డాక్టర్ దగ్గరికి వెళ్దాం..."

"ఇది మరీ బాగుంది... కాస్తంత నీరసానికే డాక్టరా?"

"మొండితనం చేయకు... ఇందాక పడిపోయేట్లున్నావంట... పిల్లలు చెప్పారు"

"నీరసం అంతే... నీకు అంతగా ప్రేమ

కారిపోతోంటే కొంచెం గ్లూకాన్ డీ కలిపివ్వు" అంది మమత నవ్వుతూ.

ఆంజనేయులు క్షణాల్లో గ్లూకాన్ డీ కలిపి తెచ్చి గ్లాసు నోటికి అందించాడు.

"చాలు... ఈ పూటకి నన్నిలా పడుకోన్వండి... మీరెళ్ళి అన్నాలు తినండి" అంది.

"అదేంటి, నువ్వు తినవా? "

"ఊహూ, ఈపూట తినాలనిపించడం లేదు"

"కుదర్దు... పిల్లలు అన్నం వండేశారు. కూరలు పొద్దుటివి వుండనే వున్నాయిగా... మైక్రోవేవ్‌లో వేడి చేస్తాను... కాస్త తిని పడుకో" అన్నాడు.

"ప్లీజ్, వద్దు. మామూలుగా నేను ఆకలికి ఆగలేనని తెల్సుగా. ఇవాళ మాత్రం సహించడం లేదు. బలవంతంగా తిన్లేను"

ఇంక ఆంజనేయులు రెట్టించలేదు "సరే, లైట్ తీసి వెళ్తున్నా... నిద్రపో" అనేసి గది తలుపులు చేరవేసి హాల్లోకి వెళ్ళాడు.

★ ★ ★

సునంద రెడ్‌హ్యాండెడ్‌గా పట్టుకున్న తర్వాతైనా రామ్మోహన్, మమతల్లో మార్పేం రాలేదు. అప్పుడప్పుడూ కలుస్తూనే ఉన్నారు.

అలా నాలుగేళ్ళు గడిచాక రామ్మోహన్ కన్‌స్ట్రక్షన్ బిజినెస్ నుండి వైదొలగాడు.

తర్వాత యాదగిరిగుట్ట, భువనగిరి, శంకర్‌పల్లి, ఘట్‌కేసర్, దుండిగల్ మొదలైన ప్రాంతాల్లో ఎకరాల కొద్దీ స్థలం కొని ప్లాట్ల వ్యాపారం చేశాడు. మినిమం వెయ్యి గజాలకు తక్కువ లేకుండా ప్లాట్లు వేయించేవాడు. ఎక్కడ ఏ వెంచర్ మొదలెట్టినా హాట్‌కేకుల్లా అమ్ముడుపోయేవి. అతని అంచనా అంత గొప్పది. అప్రోచ్ అయ్యే పద్ధతికి తిరుగుండదు. ఇతర్లకంటే కమీషన్ కూడా ఎక్కువ ఇచ్చేవాడు. వ్యాపారం మంచి ఊపుమీద ఉన్నప్పుడే దాన్ని విరమించేసి జువెలరీ వ్యాపారంలోకి దిగాడు.

ఒకేసారి నాలుగు బ్రాంచీలు ఓపెన్ చేశాడు.

ఇటు మమత ఫ్యాన్సీ షాపు కూడా బాగా నడుస్తోంది. క్రమంగా చీరెలు, డ్రెస్ మెటీరియల్సు తెచ్చి అమ్మడం మొదలుపెట్టింది. అది కూడా మూడు పూవులు, ఆరు కాయలుగా సాగడంతో డిజైనర్ షోరూం పెట్టాలని ఆలోచన వచ్చింది. అనుకున్నదే తడవు అక్కణ్ణించి మకాం మార్చేసింది. ఫ్యాన్సీ షాపును లాభసాటిగా మరొకరికి అమ్మేసింది.

బంజారాహిల్స్‌లో ట్రిబుల్ బెడ్‌రూం ఫ్లాట్ తీసుకుంది. ముంబయి వెళ్ళి డిజైనర్‌వేర్ కొంత తెచ్చింది. ఫ్యాషన్ డిజైనింగ్ కోర్సు చేసిన పండరిని తనవద్ద నియమించుకుంది. మరో ఇద్దరు టైలర్లను కుదుర్చుకుంది. ఫ్యాషన్ ప్రపంచం పట్ల అవగాహన పెంచుకుంటూ, లేటెస్టు ట్రెండులు ఫాలో అవుతూ వ్యాపారం పెంచుకుంది. టీనేజ్ పిల్లలు మొదలు నడివయసు స్త్రీల వరకూ ఎవరికేవి నచ్చుతాయో ఊహించే తెలివి కొద్దిరోజుల్లోనే సాధించింది.

కస్టమర్లకు దుస్తులు చూపిస్తూనే వారికి ఎలాంటివి నప్పుతాయో సలహా ఇస్తుంది. 'ఇది వేసుకుని ఆఫీసులో అడుగుపెట్టారంటే అటెండర్ దగ్గర్నుంచీ ఆఫీసర్ వరకూ మీవంకే చూస్తారు' అంటుంది ఉద్యోగినితో. 'నువ్వు ఇది తీసుకోమ్మా... లిటిల్ ఏంజెల్లా వుంటావు' అంటుంది ఓ కుర్రపిల్లతో. ఇవన్నీ బిజినెస్ టాక్టిక్స్ అని వచ్చినవాళ్ళకూ తెలుసు. కానీ మమత వాక్చాతుర్యానికి అడ్డంగా పడిపోతారు. నోరు మెదపకుండా ఆమె చూపించింది కొంటారు.

అంతా బాగుందనుకున్న దశలో ఆమెలో ఒక అసంతృప్తి మొదలైంది. రామ్మోహన్ తన దగ్గరకొచ్చినప్పుడల్లా

పండరితో మాట్లాడ్తాడు. పండరి పనంతా ఆపేసి రామ్మోహన్‌తో క్లోజ్‌గా కబుర్లు చెప్తుంది.

ఒక దశలో రామ్మోహన్ పండరికోసమే వస్తున్నాడా అనే అనుమానం బలపడింది. ఒంటిమీద సోయి లేకుండా ఆ అమ్మాయి అతని మీదికి ఒంగుతూ, అతన్ని తాకుతూ మాట్లాడ్తుంది. అవసరం లేకపోయినా గొల్లున నవ్వుతుంది.

ఆవేళ వుండబట్టలేక "ఏయ్ పండరీ! ఆ బ్రింజాల్ కలర్ శారీ పూర్తయిందా? " అన డిగింది.

"లేదు మేడం" పండరి నిర్లక్ష్యంగా చెప్పి రామ్మోహన్ చేతిలో చెయ్యేసి నవ్వుతోంది.

'నీకెంత నిర్లక్ష్యమే? ' అని పళ్ళు నూరు కుంది మమత.

"కబుర్లు తర్వాత... ముందు వెళ్ళి ఆ చీర సంగతి చూడు" అంది చిరాకును అది మిపట్టి, వీలైనంత నార్మల్‌గా వుండేందుకు ప్రయత్నిస్తూ.

"ఇప్పుడెలాగూ లంచ్‌బ్రేక్‌గా... చూస్తాలే మేడం" అంది తప్ప కనీసం పని పక్కన పెట్టి వృథా కాలక్షేపం చేస్తున్నా నన్న వెరపు ఆమెలో వెతికిచూసినా లేదు.

"ఇప్పుడేమైంది మమతా.. చీరో చీరో అని లబలబలాడిపోతున్నావు? ఇంతకీ ఆ చీర కోసం ఎవరొస్తున్నారేంటి... కత్రినా కైఫా, బిపాసా బసూనా? " అన్నాడు రామ్మోహన్.

మమతకు చిర్రెత్తుకొచ్చినా కంట్రోల్ చేసుకుని "నువ్వేదో మాట్లాడుతున్నావు కదాని ఈ పిల్ల పని వదిలేసి కబుర్లు చెప్తోంది... ఇలా అయితే నా బిజినెస్ దివాళా తీయడం ఖాయం" అంది.

"ఓసినీ... పది నిమిషాలు కాలక్షేపం చేస్తేనే దివాళా తీస్తారా? అలా అయితే అందరూ నెత్తిన చెంగేసుకోవాల్సిందే"

"సర్లే బావా, బయల్దేరు. మళ్ళీ కలుద్దాం" అంది మొహమాటాల్ని మూట గట్టి అవతల పారేసి.

"ఆ.. వెళ్తాను..." అంటూనే మరో నలభై నిమిషాలు కూర్చుని వెళ్ళాడు రామ్మోహన్.

అతను వెళ్ళాక పండరి హ్యాండ్‌బ్యాగ్ లోంచి లంచ్‌బాక్స్ తీసుకుని డైనింగ్ హాల్లోకి వెళ్ళింది.

మామూలుగా అయితే మమత తాను చేసిన కూరో, పచ్చడో వడ్డిస్తుంది. కానీ ఆవేళ అలా చేయాలనిపించలేదు. చిరాగ్గా పని చేసుకుంటూ కూర్చుంది. ఇంత టైం వృథా చేశాను కదాని కూడా పండరి భోజనం గబుక్కున ముగించలేదు. మెతుకు మెతుకు చొప్పున తీరిగ్గా గంట సేపు తిని, ఆ పైన ఎవరెవరికో ఫోన్లు చేసుకుని 'తప్పదురా.. దేవుడా' అన్నట్లు పనిలోకి దిగింది.

అసలు ఆ అమ్మాయిని నియమించుకుని తప్పు చేశానా? అనుకుంది. మొదటిసారి పండరిని చూసిన రామ్మోహన్... "అరే, ఈ పిల్ల భలే వుందే" అన్నాడు.

"ఏంటీ? " అంది మమత.

"నీ సెలక్షన్ బాగుందే బంగారం.. మా ఆఫీసులో ఇలాంటి కత్తి ఒక్కటి కూడా లేదు"

"కత్తులు కటార్ల వల్ల గొడవలే తప్ప పనులు కావు"

"ఆ పిల్లని పొగిడితే నీక్కొంచెం ఈర్ష్యగా వుంది కదూ? "

"నువ్వు ఆ పిల్లని పొగిడితే.. నీ టేస్ట్ ఇంత హీనమనుకుంటానేగానీ నాకెందుకు అసూయ... ఆమె కంటే నేను వందరెట్లు బాగుంటానని నాకు తెల్సు"

"ఎట్టెట్టా? ? " అంటూ బుగ్గలు నొక్కుకు న్నాడు రామ్మోహన్.

"అవును... అట్టట్టాగే... ఏం బావా, కొంపతీసి గాలి అటు తిరుగుతోందా

ఏంటి? " అని కళ్ళెగరేసింది.

"ఛఛ... ఊరికే అన్నాలే... నువ్వు రంభవి... నీ తర్వాతే ఎవరైనా? "

"నా తర్వాత కాదుగదా... నా చెలికత్తె పాటి కూడా చేయదు"

"చాల్లే బడాయి... ఇంతకీ ఎంతిస్తున్నా వేంటి? "

"పదివేలు"

"నేను పదిహేనిస్తాను... నా దగ్గర చేరుతుందేమో అడుగు"

"రోజుకా, నెలకా? " తిక్కరేగి అడిగింది.

"అదేం మాట బంగారం... మరీ డబుల్ మీనింగులు మాట్లాడేస్తున్నావు... నేనంటోంది ఉద్యోగానికి. మరింకెందుకో కాదు" అంటూ అదో మాదిరిగా నవ్వేడు.

"నేనన్నది ఉద్యోగం లెక్కతోనే... నీకు ఇంకేవో తిమ్మిరి ఆలోచనలు తడితే నేనేం చేయను? "

మమత బదులు చెప్పకపోవడంతో కోపం వచ్చిందని గ్రహించి టాపిక్ మార్చాడు రామ్మోహన్.

"అది సరేగానీ... నువ్వేంటి బంగారం ఇంత సాదాసీదా చీరలు కట్టుకుంటు న్నావు... డిజైనర్ శారీస్ అమ్మడాని కేనా... కట్టుకోడానికి పనికిరావా? "

"ఆ.. ఏ పెళ్ళికో, పేరంటానికో అయితే గానీ... ఒట్టి పుణ్యానికి సింగారించుకోమం టావా? "

"ఏదీ, ఆ నేవీ బ్లూ శారీ తియ్యి... దాని ఖరీదెంత? "

"పదివేలు... ఏం ఆ సుందరాంగికి కానుకగా ఇస్తావా? "

"సూపర్ ఐడియా... ఈ చీరిస్తే పడిపోతుందంటావా? " కొంటెగా అడిగాడు.

మమత చిరాగ్గా అతని చేతిలోంచి చీరను ఒక్క లాగు లాగి తీసుకుంది.

రామ్మోహన్ పకపకా నవ్వి జేబులోంచి డబ్బు తీసి, పది వెయ్యి నోట్లు తీసి ఆమె చేతిలో పెట్టి "ఈ చీర అమ్మకు బంగారం.. దీన్ని నువ్వే కట్టుకోవాలి సరేనా? "

మమత ముసిముసిగా నవ్వి "కొంప తీసి, నాకంటే ఆ పిల్లకైతే ఇంకా బాగుంటుంది అనవు కదా? !" అంది.

"ఆ మాట ప్రత్యేకంగా చెప్పాలా? "

"అయితే దానికే ఇచ్చుకో ఫో" అని చీరని అతని ఒళ్ళోకి విసిరికొట్టింది.

"ఓసి, నీ దుంపతెగ... జోక్ కూడా అర్థం కాదా? ఆ పిల్లకి నిండైన చీర కంటే జానాబెత్తెడు పొట్టిబట్టలు సూటవుతాయి"

మమతకి ఎంత కోపం వచ్చినా తమాయించుకుంది.

రామ్మోహన్ మళ్ళీ వస్తానని చెప్పి వెళ్ళాడు. ఆ మర్నాడు మమత పండరిని ఉద్యోగం మాన్పించేసింది.

★ ★ ★

ఓ మధ్యాహ్నం మమత షాపులో పనిచేస్తున్న సీత, మమత దగ్గరికొచ్చి "మేడం, పండరి ఫోన్ చేసింది" అంది.

'మళ్ళీ చేర్చుకోమని రికమండేషన్ కాబోలు... సమస్యే లేదు... తెలిసితెలిసి ఆ చెత్త పిల్లని మరోసారి నెత్తిన పెట్టుకునేదే లేదు' అనుకుని పైకి మాత్రం "అలాగా? " అంది మమత.

"తను.. రామ్మోహన్ సార్ ఆఫీసులో చేరిందట.. జీతం స్టార్టింగే పదిహేను వేలట" అంది.

ఊహించని ఆ పరిణామానికి మమత ఉలిక్కిపడింది. రామ్మోహన్ మీద పిచ్చ కోపం వచ్చింది.

మనసులో పరిపరివిధాలుగా ఆలోచించుకుంది మమత. 'తనకు ఎంతమాత్రం నచ్చదని తెలిసి కూడా అక్కున చేర్చుకున్నాడా? తనతో ఆమె గురించి మాట్లాడ్డం మానేస్తే మారిపోయాడనుకుంది. వెనక ఇంత కుట్ర చేస్తూనే నయగారాలు పోతున్నాడా? ఆ హీనురాల్ని చంకలో చేర్చుకుని రెండో చంకలో తనతో ప్రేమాయణాలా? ఛీ... ఇతను మనిషా, పశువా? ' అనుకుంది.

తన భావాలేమీ ప్రదర్శించకుండా సీతతో "అయ్యోపాపం పదిహేనేనా? పాతికవేలు ఇవ్వాల్సింది... ఒళ్ళు దాచుకోకుండా కష్టపడ్తుందిగా" అంది.

"పండరి ఎప్పుడూ రామ్మోహన్ సార్‌కి ఫోన్ చేసి ఏమేమో మాట్లాడేది... ఆయనకేదో జాలేసి ఇచ్చినట్లున్నారుగానీ మేడం... నాలుగు రోజులు చూస్తే తెలీదూ... పని తక్కువ, బిల్డప్ ఎక్కువా అని" అంది సీత.

"మనకెందుకులే సీతా, ఎలాగోలా అఘోరించనీ" అంది మమత.

సీతముందు బయటపడ్డం ఇష్టంలేక ఆ విషయాన్ని అక్కడితో తుంచేసింది కానీ, మనసు అలజడికి గురైంది.

★ ★ ★

పండరి రామ్మోహన్ దగ్గర చేరిందన్న విషయం తెలిసిన రెండ్రోజులకి అతన్నుంచి ఫోనొచ్చింది.

ఆమె ముభావంగా ఉండడంతో "ఏమైనా కావాలా? కొత్త వెరైటీ నెక్లెస్ వచ్చింది... చూస్తే ఎగిరి గంతేస్తావు... నా చేతుల్తోనే నీ మెళ్ళో వేస్తాను"

ఏడ్చేసింది. కంట్రోల్ చేసుకుందామన్నా ఆమెవల్ల కాలేదు.

దాంతో రామ్మోహన్ కంగారుపడ్డాడు.

"ఏమైందిరా బంగారం... ఎందుకేడుస్తున్నావు? మీ ఆయనకేమైనా తెలిసిందా?" అన్నాడు.

"తెల్సినా బాగుండు. పీక పిసికి చంపేసినా బాగుండు... నేను మహాపరాధం చేశాను... నువ్వు నన్నో వేశ్య కింద జమ కడితే భరించలేను"

"నీకేమైనా పిచ్చా... నేనెప్పుడైనా అలా అన్నానా?"

"అనక్కర్లేదు... నీ చేష్టలే చెప్తున్నాయి..."

"ఛీ, ఊరుకో"

"నేన్నీ డబ్బుకోసమే లొంగిపోయాను... శరీరాన్ని అప్పగించాను అని మాత్రం అనుకోకు... నీకెలా చెప్పాలో తెలీదు... నాకు ఊహ తెలిసినప్పట్నించీ నువ్వంటే చాలా ఇష్టం... అదే నాలో కోరికలు రగిలించింది..."

"ఇప్పుడు దానికి పశ్చాత్తాప్పడాల్సిన పనేం లేదు... మనిద్దరికీ ఒకరంటే ఒకరికి ఇష్టం... అందుకే దగ్గరయ్యాం..."

"నన్ను మాట్లాడనీ... నీకు ఒళ్ళప్పగించాక నువ్వు నావాడివి అనిపించింది... సునందే నీ భార్య అని తెల్సినా సరే... ఇది అజ్ఞానం అనుకో... అమాయకత్వం అనుకో... స్వార్థం అనుకో... దురాశ అనుకో... ఇంకేమైనా అనుకో... నాకు లోలోన నువ్వు నావాడివేనన్న భావం... అందుకే నీనుంచి ఏం ఆశించినా తప్పు లేదనిపించింది... భయాలు, దిగుళ్ళను అధిగమించి నీతో గడుపుతున్నప్పుడు... నిన్ను అంతగా ఇష్టపడ్తున్నప్పుడు... నీనుండి తీసుకోవడంలో తప్పు లేదనిపించింది..."

"హే... ఆపు... నువ్వంత సంజాయిషీ చెప్పాల్సిన పనిలేదు. నీకు నేనేం ఇచ్చినా ఇష్టంగానే ఇచ్చాను... నువ్వేమీ నన్ను ప్రలోభపెట్టి తీసుకోలేదు..."

"ప్లీజ్ బావా... నువ్వు అడ్డు రాకు... మధ్యలో నన్ను ఆపకు... నేను మనసులో ఎంత వేదన పడుతున్నానో, కుంగిపోతున్నానో నీతో చెప్పితీరాలి... నా దగ్గర లేని డబ్బు... నీ దగ్గర తీసుకోవడంలో తప్పు లేదనిపించింది. అందుకే కొన్నిసార్లు డిమాండ్ చేసి అడిగాను. కానీ నువ్వు నన్ను అచ్చం ఒక బ్రోతల్‌లా ట్రీట్ చేస్తావని మాత్రం కల్లో కూడా అనుకోలేదు"

"నీకు నిజంగా పిచ్చిపట్టినట్లుంది" చాలా విసుగ్గా అన్నాడు రామ్మోహన్.

"లేదు, పిచ్చి వదిలింది... నువ్వే గనుక ఆ పండరిని చేరదీయకపోతే ఇంకా ఆ పిచ్చిలోనే ఉండేదాన్ని... వీలైనప్పుడల్లా తప్పు చేస్తూనే ఉండేదాన్ని... థ్యాంక్స్ బావా... ఒకరకంగా నువ్వు మంచిపనే చేశావు. నా కళ్ళు తెరిపించావు. పండరితో నీ ప్రవర్తన నాకు షాక్ ట్రీట్‌మెంట్‌లా పనిచేసింది. పట్టిన పిచ్చి వదిలింది"

రామ్మోహన్ నిజంగానే పండరితో సంబంధం పెట్టుకున్నాడు కనుక ఓ క్షణం రియాక్షన్ లేకుండా ఉండిపోయాడు.

"ఈ విషయం దీనికెలా తెలిసింది? అనుకుంటున్నావు కదూ... తెలీకుండా ఎలా ఉంటాయి? కొన్ని దాద్దామన్నా దాగవులే" అంటూ నిట్టూర్చింది.

రామ్మోహన్ వెంటనే తేరుకుని "ఏం

## కొత్తగాలి...

**ఎస్సెమ్మెస్‌ల తుపాన్‌కి పోస్టుకార్డు కొట్టుకుపోకుండా 'కొత్తగాలి' ఒడిసి పట్టుకుంది!**

– లోగిశ లక్ష్మీనాయుడు,
సింహాచలం

మాట్లాడ్తున్నావు? ” అన్నాడు.

“ఉన్నదే మాట్లాడ్తున్నాను... వాదించీ అబద్ధాలు చెప్పి ఇంప్రెస్ చేయాల్సిన పని లేదు...” స్థిరంగా అంది.

“ప్లీజ్ బంగారం... నీకోసం ఆశగా ఎదురు చూస్తూ వున్నానే” అన్నాడు రామ్మోహన్ దీనంగా.

“నువ్వు డబ్బు ఖర్చుపెడితే గంటలెక్కన నీతో గడపడానికి రెడీగా ఉండేవాళ్ళు చాలామంది ఉంటారు బావా... నాకు మాత్రం ఇంకెప్పుడూ ఫోన్ చేయకు. . ఇంటికీ రాకు... ఒకవేళ నువ్వు మొండికేసి వస్తే నా చావె చూస్తావు... నేనేదో బెదరిస్తున్నాను అని మాత్రం అనుకోకు...

**కొత్తగాలి...** 

**పొరుగువాడి దుఃఖం**
**నీకు సుఖం అనుకుంటే**
**వాడికి సుఖం కలిగే**
**రోజు కూడా వస్తుంది!**

– భానుమూర్తి,
హైదరాబాద్

మంచికైనా, చెడ్డుకైనా మొండిదాన్నే... తెల్సుగా.. నా చావు గనుక కళ్ళ చూడదల్చుకుంటే రా” ఫోన్ పెట్టేసింది మమత.

రామ్మోహన్ అవాక్కయినట్లున్నాడు, మరేం మాట్లాడలేదు.

ఆ తర్వాతెప్పుడూ రామ్మోహన్ ఆమెకు ఫోన్ చేయలేదు, ఆమె ఇంటికి రాలేదు. బంధువుల ఇంట్లోనో, మరే ఫంక్షన్లోనో కనిపించినా చూడనట్లు తలొంచుకు వెళ్ళిపోయాడే గానీ ఆమెని ఎన్నడూ ఏవిధంగానూ ఇబ్బంది పెట్టలేదు.

★ ★ ★

మమత కళ్ళముందు గతమంతా సినిమా రీళ్ళలా మెదిలింది.

ఈ మధ్యకాలంలో రామ్మోహన్ని కలిసిందీ లేదు, అతని గురించి ఆలోచించిందీ లేదు. పిల్లలు డిగ్రీ చదువులైపోయి ఉద్యోగాల వేటలో ఉన్నారు. ఇన్నాళ్ళుగా ఆమె తన వ్యాపారంలో, పిల్లల చదువుల గోలలో మునిగి తేలుతోంది. రామ్మోహన్తో సంబంధ బాంధవ్యమంతా పూర్వజన్మ వృత్తాంతంలా అనిపిస్తుంది.

ఇప్పుడిన్నాళ్ళకి ఆ విషయాలు గుర్తు చేసుకోవడం కూడా బాధగానే ఉంది. మానిపోయిన గాయాన్ని మరోసారి కెలికినట్లయింది.

గతమంతా గుర్తుచేసుకున్న మమత ఒక నిర్ణయానికి వచ్చి బోసుకి ఫోన్ చేసింది.

“యస్, డిసీజ్ ఇన్స్పెక్టర్ బోస్”

“నేను మమతని... బంజారాహిల్స్ నుండి... పొద్దున వచ్చారు... మీ కార్డ్ తీసుకున్నాను...”

“ఓకే.. ఓకే... రామ్మోహన్ కేసేగా... రేపు ఎన్నింటికి రావాలి? ”

“రేపు కాదు... ఇప్పుడే రాగలరా? ”

“పొద్దునేమో రేపు రమ్మన్నారు... ఇప్పుడేంటిలా? ” అన్నాడు.

“లేదండీ... నేను చాలా డిస్టర్బ్ అయ్యాను... తప్పో ఒప్పో నేను చేసింది చెప్పేస్తాను... లేకపోతే ఈ భయం, ఆందోళనా నన్ను బతకనిచ్చేలా లేవు”

“సరే.. మీకు దగ్గరలోనే ఉన్నాను. పావుగంటలో వస్తాను”

అన్నట్లుగానే బోసు కొద్దిసేపట్లోనే మమత ఇంటికొచ్చాడు.

ఆమె ఇప్పటికే మెయిన్ డిజైనర్ని పిలిచి “పొద్దున వచ్చిన పోలీసాఫీసరు మళ్ళీ వస్తారు.. మీరెవరూ ఆఫీసు రూంలోకి రాకండి.. ఒకవేళ నన్ను కలవాలని, నాతోనే మాట్లాడాలని ఎవరైనా

అన్నా నేను లేనని చెప్పేయండి. మొహ మాటమే లేదు. చాలా రోజులుగా పెండిం గ్‌లో ఉన్న కేస్ గురించి మాట్లాడ్డానికి వస్తున్నారు" అని చెప్పింది. ఆ సంగతి ఇతర్లతోనూ చెప్పమంది.

బోసును ఆఫీసు గదిలోకి తీసికెళ్ళి మమత గతమంతా చెప్పింది.

దాపరికం లేకుండా జరిగింది జరిగినట్లు గానే చెప్పింది. ఆ స్వరంలో నిజాయితీ ప్రవహించింది. ప్రతి అక్షరంలో సత్యం తొంగిచూసింది. ఆమె తన మోహావేశం దగ్గర్నుంచి, మొదట్లో స్వార్థంగా ఆలోచిం చిన తీరు, ఆ తర్వాత రామ్మోహన్ మరో యువతితో... అది కూడా ఒక వెకిలి పిల్లతో దగ్గరగా ఉండటం చూశాక తనలో ఎంత ఏహ్యత కలిగిందీ, రామ్మోహన్ మీద ఎంత విరక్తి కలిగిందీ... తనలో ఎలా మార్పు వచ్చిందీ, తన భర్తకు ద్రోహం చేశానని తల్చుకుని పశ్చాత్తాపంతో ఎంతగా కుంగిపోయింది- వరకూ పూస గుచ్చినట్లు చెప్పింది.

అంతా చెప్పి "ఇదండీ జరిగింది... మా చిన్నబావ ఎప్పుడైతే పండరికి దగ్గర య్యాడో నేనప్పుడే దూరమయ్యాను... ఆ తర్వాత ఆయన్ని కలిసింది లేదు... రెండుసార్లు ఫంక్షన్స్‌లో చూశానుగానీ... కనీసం మాట్లాడను కూడా లేదు" అంది.

"ఒక రకంగా రామ్మోహన్, పండరితో సంబంధం పెట్టుకున్నాడు కనుకనే మీలో మార్పు వచ్చిందేమో... అంతేనా?" అన్నాడు బోసు.

"నిజమేనండీ..." అని ఒప్పుకుంది.

బోసు తమాయించుకోలేక "రామ్మోహన్ పండరితో సన్నిహితంగా ఉన్నాడని మీకే అంత చిరాకేసిందే... మరి ఆయన అసలు భార్య సునందకి మిమ్మల్ని చూసినా రగిలి పోయే ఉంటుందిగా? !" అన్నాడు.

"ఎందుకు రగలదు? అందుకేగా కుళ్ళి కుళ్ళి ఏడ్చాను... కానీ... దయచేసి ఒకటి అర్థం చేసుకోండి... నేను పండరిలాంటి దాన్ని కాను... మా బావంటే నాకు మొద ట్నించీ ఇష్టం... తనను చేసుకోవాలనుకు న్నాను"

"అనుకున్నారేగానీ చేసుకోలేదు... పైగా ఇద్దరూ వేరేవేరే వాళ్ళని చేసుకున్నారు. మీ సంబంధంవల్ల అతని భార్య ఎంత నష్టపోయింది..."

"ఆ మత్తులో తెలీలేదు... నేనేమైనా పూర్తిగా ఉంచేసుకున్నానా... కాసేపు కలి సుంటే ఏమిటి నష్టం అనిపించేది"

బోసుకు ఇంకా కెలకాలనిపించలేదు. ఆమెమీద పూర్తి నమ్మకం కలిగినా పోలీసు కనుక "అయితే ఈ హత్యకూ, మీకూ ఎలాంటి సంబంధమూ లేదని నమ్మొచ్చుగా" అన్నాడు.

"పండరితో సంబంధం పెట్టుకున్నాక ఆయనంటే అసహ్యమేసిన మాట నిజం... ఇలాంటి దౌర్భాగ్యుడికోసమా నేను వెంప ర్లాడాను... నా భర్తని వంచించాను అని ఛీత్కరించుకున్న మాట నిజం... కానీ... అతన్ని చంపాలన్న ఆలోచన కూడా నాకు రాలేదు... మీరు దేవుణ్ణి నమ్ముతారో లేదో నాకు తెలీదు... నేను నమ్ముతాను... కావాలంటే చేతిలో హారతి అంటించుకుని గుళ్ళో ప్రమాణం చేస్తాను..." అంది.

## కొత్తగాలి... 

**వెన్నెల ఇరగకాసింది తెల్లార్లూ**
**ఎరువులేవీ వేయకుండానే!**
**సంబరపడే లోపు**
**సూర్యుడొచ్చి ఎత్తుకెళ్లాడు**
**వెన్నెల పంటని!**

– పి.వి.ఎన్. ప్రసాద్, నవులూరు

"అవన్నీ మూఢనమ్మకాలు... మీరు చెప్పేది పచ్చి నిజమే అయినా మీ చేయి కాలి తీరుతుంది... ఓకే గతాన్ని మార్చ లేంగా" అన్నాడు బోసు.

"ఈ విషయాలు లీక్ చేయకండి" అంది మమత చేతులు జోడించి.

"ఈ హత్యకు మీకు సంబంధం లేదు కనుక మీ గతాన్ని బయటపెట్టాల్సిన అవ సరం లేదు..." అనేసి అక్కణ్ణించి వెళ్ళిపో యాడు ఇన్‌స్పెక్టర్ బోసు.




ఈలోపు ఫోరెన్సిక్ నిపుణులు అందిం చిన రిజల్టంతా చేతికొచ్చింది.

రామ్మోహన్ ఉపయోగించిన రెండు సిమ్ కార్డుల సమాచారం అంతా వచ్చింది. గత నాలుగు నెలలుగా అతను మాట్లాడిన విషయమంతా టేపులతో అందించారు. అదంతా రివైండ్ చేసి స్పష్టంగా వినొచ్చు.

వ్యాపార లావాదేవీలు, మామూలు కుశల ప్రశ్నలు, కాలక్షేపపు కబుర్లు లాంటి వన్నీ ఫిల్టర్ చేసి ముఖ్యమైన అంశాలకు సంబంధించిన వాయిస్‌లన్నీ ఎడిట్ చేసి ఉంచుకున్నారు.

మమత చెప్పిన నిజాన్ని సెల్‌ఫోన్ వాయిస్ రికార్డు సమాచారం కూడా నిర్ధా రణ చేసింది. రామ్మోహన్ మొబైల్స్‌లో మమతకు ఇన్‌కమింగ్‌గానీ ఔట్ గోయింగ్ కానీ లేనే లేదు. పోనీ, వేరు నెంబరు నుండి మాట్లాడుకున్నారు అనుకో డానికి అసలు ఆమె స్వరమే రికార్డయి లేదు.

రికార్డెడ్ వాయిస్ ఆధారాలు చేతిలోకి వచ్చాక పండరి దగ్గరికి బయల్దేరాడు బోసు.

యూనిఫాంలో ఉన్న బోసును చూడ గానే కొంచెం జంకింది పండరి. భయాన్ని కనపడనివ్వకుండా "సార్! రూంలోకి రండి" అంటూ రామ్మోహన్ గదిలోకి దారి తీసింది.

"నాకు మీమీద కొన్ని సందేహాలు న్నాయి" అన్నాడు బోసు.

"చెప్పండి సార్"

"రామ్మోహన్ని మీరే హత్య చేశారని డిపార్ట్‌మెంట్ అనుమానిస్తోంది"

"ఆ? నేనా? నేను మర్డర్ చేశానంటే మీరు నమ్మగలరా? !" అంది పండరి.

"రామ్మోహన్‌తో మీకే సంబంధమూ లేదా? " సీరియస్‌గా అడిగాడు బోసు.

"ఛఛ... ఆయన మా బాస్ అంతే"

"ఆయన్తో రిలేషన్ పెట్టుకోలేదా? "

"ఆయన బాస్ గనుక.. క్లోజ్‌గా వుండక తప్పదు"

"ఇద్దరి మధ్యా ఎక్స్‌ట్రా మ్యారిటల్ రిలే షన్ లేదా? అనవసరంగా వాదించాలని చూడొద్దు.. పోలీసులంటే చెవుల్లో పూలు పెట్టుకుని కనిపిస్తున్నారా? ఏ ఆధారమూ లేకుండానే వచ్చానా? " అంటూ బోస్ ఇరి టేట్ అయిపోయాడు.

పండరికి ముచ్చెమటలు పోశాయి.

"ఎన్నాళ్ళుగా సాగుతోంది మీ మధ్య సంబంధం? "

"అదేం లేదు.. అవన్నీ గాసిప్స్"

"ఆయన సల్మాన్‌ఖానూ, తమరు కత్రి నాకైఫూ అనుకుంటున్నారా? గాసిప్స్ ఏంటి? "

ఆమె బిత్తరపోయి చూసింది.

"చూడమ్మా.. మీకు సంబంధించిన సాక్ష్యాధారాలన్నీ వున్నాయి... దయచేసి నా టైం వేస్ట్ చేయకుండా అడిగిందానికి సరైన సమాధానాలిస్తే బాగుంటుంది.. లేదంటే స్టేషన్‌కి తీసికెళ్ళి విషయం రాబట్టాల్సి వుంటుంది... పోలీస్ స్టేషన్లో ఏం జరుగుతుందో తెల్సుగా" అన్నాడు బోసు కోపాన్ని నిగ్రహించుకోలేక. ఈసారైతే పండరికి వెన్నులోంచి వణుకు పుట్టుకొచ్చింది. పోలీసులు పెట్టే చిత్రహింసల గురించి చాలాసార్లు విని వుంది. ఏం చెప్తే ప్రమాదమో, ఏం చెప్పకపోతే ప్రమాదమోనని భయపడింది.

"నేను సీరియస్‌గా చెప్తున్నాను పండరీ.. జరిగింది జరిగినట్లు ఒప్పుకుంటే శిక్ష తక్కువ పడ్తుంది... ఒప్పుకోకుండా వాదిస్తే పరిణామాలు మరీ తీవ్రంగా వుంటాయి."

దాపరికాల్లేకుండా జరిగింది చెప్పడమే మంచిదనుకుని పండరి చెప్పడం మొదలు పెట్టింది.

★ ★ ★

పండరి చెప్పిన కథనం సారాంశం ఇలా వుంది.

పండరికి తల్లితండ్రీ ఇద్దరూ లేరు. అన్నావదినలతో వుంటోంది. ఆమెకి పెళ్ళి చేసి కట్నం, పెళ్ళి ఖర్చుల రూపంలో చమురు వదిలించుకునే ఉద్దేశం వాళ్ళకు లేదు. అలా పెళ్లీ గిట్రా లేకుండా ఇంట్లోనే వుంటూ జీతం తెచ్చిస్తే తిండి పెట్టి ఓ మూలన వుండనిద్దాం అనుకున్నారు. కానీ పండరి అలా వుండిపోదల్చుకోలేదు. అక్కడికీ సిగ్గు విడిచి గొప్ప చదువులు, ఉద్యోగాలూ లేకపోయినా పరవాలేదు... తమ తాహతుకు తగ్గవాడినే చూసి పెళ్ళి చేయమని, అలాంటి సంబంధం కోసం ఆరా తీయమని అడిగింది. "చూస్తున్నాం... తెల్సిన వాళ్ళందరికీ చెప్తున్నాం..." అంటూ కాలక్షేపం చేస్తూ ఏళ్లు గడిపేస్తుంటే వాళ్ళు తన పెళ్ళి ఎన్నటికీ చేయరని స్పష్టంగానే బోధపడింది పండరికి.

ఈ లోపు రామ్మోహన్ పరిచయం కావడంతో కొండంత ఆశ కలిగింది. అతను తన కంటే ఇరవయ్యేళ్ళు పెద్దవాడని తెల్సినా ఆశపడింది. పురుష సహజమైన ఆసక్తి, కుతూహలంతో రామ్మోహన్ ఆమె వంక చూసేవాడు. ఆ ఆకర్షణను ఉపయోగించుకోవాలనుకుంది పండరి. యోగ్యుడితో పెళ్ళయ్యే రాత లేనప్పుడు వయసులో పెద్దయితే మాత్రమేంటి అనుకుని ఆమె తనంతట తాను అతనితో పరిచయం పెంచుకుని, సన్నిహితురాలైంది. తనను రెండో పెళ్ళి చేసుకుంటే బాగుండునని కలలు కంది. 'పెళ్లానికి దక్కేవన్నీ ఇస్తాను... పెళ్ళి అని మట్టుకు పేచీ పెట్టకు' అని కచ్చితంగా చెప్పేశాక జరగని పెళ్ళి కోసం తపించడం ఎందుకని అర్థం చేసుకుని ఆ ఊసెత్తలేదు. 'సర్లే... తాళి బొట్టు ఏం ఉద్ధరిస్తుంది? ఇతర సుఖసౌఖ్యాలన్నీ దొరికేటప్పుడు, ఆ తాడొక్కటి లేకపోతే నష్టమేంటి... ఇతన్నెందుకు దూరం చేసుకోవాలి' అనుకుంది.

మొదట్లో కొన్నాళ్ళు హోటళ్ళలో గడిపారు. ఆ తర్వాత పండరికి ఒక ఫ్లాట్ కొనిపెట్టాడు. చనిపోయేవరకూ వీలైనప్పుడల్లా రామ్మోహన్ ఆమె దగ్గరికి వచ్చేవాడు.

రామ్మోహన్ తనకు పండరితో సంబంధం ఉన్నట్లు పొరపాటున కూడా ఎవరికీ అనుమానం రాకుండా వుండాలని ఎంతో జాగ్రత్తగా మసలుకునేవాడు.

అదంతా ఓపిగ్గా విన్నాక "ఇంతకీ రామ్మోహన్ని చంపాల్సిన అవసరం ఎందుకొచ్చింది?" అనడిగాడు బోసు.

"ఛఛ. .నేను చంపడమేంటి?" అంది

పండరి.

"ఇదిగో పండరీ... నా మాట విని నిజం చెప్పు... రామ్మోహన్నేమైనా పెళ్ళి చేసుకోమని ఒత్తిడి చేశావా? లేక ఆస్తి నీ పేరున రాయమని అడిగావా?"

"లేదు సార్... ఒట్టేసి జెప్తున్నా.. నన్ను నమ్మండి..."

"నీక్కాకుండా ఆయన్ను చంపే అవసరం ఎవరికుంటుంది?" అన్నాడు సాలోచనగా.

"నాకు తప్ప ఎవర్కైనా వుంటుంది సార్... నాకు ఆయన బతికుంటే లాభం గానీ.. పోతే కాదుగా?" అంది.

"అద్సరే... రామ్మోహన్ని చంపించేంత శత్రుత్వం ఎవరికుంది?"

ఒక నిమిషం మాట్లాడలేదు. చెప్పాలా వద్దా అన్నట్లు తటపటాయింపుగా చూసింది.

ఆ సంగతి గ్రహించిన బోసు "నీకు ఎవరిమీదైనా అనుమానం వుందా?" అన్నాడు.

పండరి కొంచెం బెదురుగా చూసింది.

"ఎందుకు సందేహిస్తున్నావు? నేనొక పోలీసునని మర్చిపోకు... నువ్వు చెప్పినట్లు మూడో వ్యక్తికి తెలీనివ్వను..."

"నిజమే సార్.. కానీ.. నేను చెప్పానని ఎవరికీ చెప్పకండి... ప్లీజ్..."

"ఉహూ, నీకు ఎవరివల్లా ఎలాంటి ఇబ్బందీ రాకుండా చూసే బాధ్యత నాది.. చెప్పు.. ఒకవేళ నువ్వు ఎవరి పేరైతే చెప్తున్నావో.. వాళ్ళు దోషులయినా కాకపోయినా నీ పేరు మాత్రం బయటపెట్టను"

"రామ్మోహన్ సార్ గోల్డ్ షాపుకంటే ముందు కన్‌స్ట్రక్షన్ బిజినెస్ చేశారు."

"తెల్సు... రియల్ ఎస్టేట్ వ్యాపారి, బిల్డర్! చివర్లో స్టార్ హోటల్స్ ప్లాన్ చేశాడు... పాపం ఆ కోరిక తీరకుండానే హరీ అన్నాడు..."

"ఎర్రన్న గురించి తెల్సా మీకు?"

"తెలీదు... ప్రొఫెషనల్ సైడ్ నుంచీ ఇంకా ఇన్వెస్టిగేషన్ స్టార్ట్ చేయలేదు.. నీకు తెలిసినంతవరకూ.. దాపరికం లేకుండా చెప్పు.." అన్నాడు బోసు.

"రామ్మోహన్ సార్ కన్‌స్ట్రక్షన్ బిజినెస్ ఆపేశాక్కూడా ఎవరైనా లార్జ్ స్కేల్లో ప్లాట్లు కొనేదుంటే ఆయనే మీడియేటర్‌గా వుండేవారు.."

"అవును, నెగోషియేషన్స్ జరిపినందుకు కమీషన్ తీసుకుంటారు..."

"ఎర్రన్న అమెరికాలో చాలాకాలం వుండి ఇండియా తిరిగొచ్చారు"

"కొంచెం వివరంగా చెప్పు"

పండరి జరిగింది గుర్తు చేసుకుని బోసుతో చెప్పసాగింది.

★ ★ ★

ఎర్రన్న అసలు పేరు అది కాదు... భరద్వాజ... ఎర్రగా వుంటాడని రామ్మోహన్ ఆ పేరు ఖాయం చేశాడు. అమెరికాలో పాతికేళ్ళకుపైగా వుండి చాలామంది ఎన్నారైల మాదిరిగానే డబ్బు సంపాదించుకుని ఇండియా వచ్చాడు భరద్వాజ.. హైద్రాబాద్ ఊరు శివార్లలో ఫ్యాక్టరీ పెట్టేందుకు స్థలం కోసం ప్రయత్నిస్తున్నాడని తెలుసుకున్న రామ్మోహన్ అతన్ని కలిశాడు. ప్లాట్ల బిజినెస్ మానేసినప్పటికీ అలాంటి పెద్ద పార్టీల పనులకు నడుం బిగించేవాడు. వాటిల్లో కమీషన్ బాగా మిగుల్తుంది మరి. పెట్టుబడి పెట్టే పని వుండదు, నెలల తరబడి నిరీక్షణ వుండదు. ఇన్‌స్టంట్ కాఫీ మాదిరిగా అప్పటికప్పుడు పనైపోతుంది.

మేడ్చల్ అవతల పదిహేను ఎకరాల స్థలం చూట్టం, మాట్లాడ్డం, ఎర్రన్నను ఒప్పించడం అంతా వేగంగా జరిగింది. ఎర్రన్న సగం డబ్బు ముందే ఇచ్చేశాడు. రెండు వారాల్లో తక్కిన పైకమిచ్చి రిజిస్ట్రేషన్ చేయించుకునేట్లు ఒప్పందం కుది

# అత్యంత విలువైన పెన్నీ!



విలువలేని వస్తువులకు విలువను ఆపాదించడమే సేకరణదారులు చేసేపని. ఏ వస్తువైనా విస్తారంగా లభ్యమైతే విలువ తగ్గుతుంది. అది అరుదైన కొద్దీ ధర పెరుగుతుంటుంది. ముఖ్యంగా దాన్ని పొందాలనేవారు తక్కువమందే ఉన్నా, దాన్ని పొందే తీవ్ర కాంక్ష వారిలో ఉంటుంది.

తపాలాబిళ్లలు, అగ్గిపెట్టెమీద అతికించే లేబుల్స్, నాణాలు లాంటి సేకరణదారులకు వాటిని సొంతం చేసుకోవాలన్న తీవ్ర కాంక్షే ఆ వస్తువుల ధర పెరగడానికి కారణమవుతుంది. ఇటీవల ఓ పెన్నీ నాణెం ఇలా పదకొండు లక్షల పదిహేను వేల డాలర్లకు అమ్ముడుపోయింది. 1792లో ఆ పెన్నీ రాగి, వెండి కలిపి తయారైంది. ప్రపంచంలో ఈ రకం పెన్నీలు కేవలం పద్నాలుగు మాత్రమే ఇంతదాకా వెలుగు చూసాయి. షికాగోలోని స్కోంబర్గ్ కన్వెన్షన్ సెంటర్లో జరిగిన వేలంలో ఆ నాణెం ఆ ధరకు అమ్ముడుపోయింది. ఆ నాణెం చలామణిలో లేకపోవడంతో ఇంత ధర పలికింది. అంటే సరికొత్తగా తళతళ మెరుస్తోంది.




అందువల్ల ఇది మిగిలిన 13 కన్నా అసాధారణమైన నాణెం. కాలిఫోర్నియాలోని బెవర్లీహిల్స్‌కు చెందిన కెవిన్ లిప్టన్ అనే అతను గోప్యంగా ఉండదలచిన కొందరు పెట్టుబడిదారుల తరపున వేలంలో పాల్గొని ఈ నాణేన్ని చేజిక్కించుకున్నాడు. దీన్ని షికాగోలోని న్యూమిస్‌మేటిక్ సొసైటీ సదస్సులో 1974లో వేలం వేస్తే కొందరు గుప్త పెట్టుబడిదారుల తరపున ఒకరు దాన్ని లక్షాఐదువేల డాలర్లకు కొన్నారు. ఈ నాణెం ఆన్‌లైన్ పాట మొదలవ్వగానే దాని ధర పదిలక్షల డాలర్లు పలికింది. వారు స్వయంగా పాటలో పాల్గొన్నాక దీని దీని ధర 11.15 లక్షల డాలర్లకు చేరుకుంది. ఆ ఆక్షన్‌హౌస్‌కు ఈ మొత్తంలోంచి 15 శాతం కమీషన్ లభించింది.

రింది.

భరద్వాజ ఉరఫ్ ఎర్రన్నకు నమ్మకాలు ఎక్కువ. "పదో తారీఖు.. సప్తమి.. పైగా గురువారం కూడా.. ఆరోజు రిజిస్ట్రేషన్ చేయించుకుంటాను" అని చెప్పాడు.

"దాందేముంది.. అలాగేకానిద్దాం.." అంటూ నవ్వేడు రామ్మోహన్.

స్థలం అమ్మే వ్యక్తి సరేనన్నాడు. ఎర్రన్న డబ్బు సిద్ధం చేసుకున్నాడు. మొత్తం సిద్ధం అయింది. తీరా పదో తారీఖు రేపనగా రామ్మోహన్, ఎర్రన్నకు ఫోన్ జేసి 'ఆ స్థలం కాన్సిలైంది' అని చెప్పాడు. ఎర్రన్న గుండెలు బాదుకుంటూ "మరి, నేనిచ్చిన డబ్బు? " అన్నాడు.

"కంగారుపడాల్సిందేమీ లేదు... మీ డబ్బు మీకు పువ్వుల్లో పెట్టి తెచ్చిస్తాను.. మరో అరగంటలో నేను మీముందుంటాను" అని చెప్పి... అన్నట్లుగానే ఎర్రన్న చెల్లించిన డబ్బు తీసికెళ్ళి అతనికిచ్చి "ఒకసారి లెక్క చూడండి" అన్నాడు రామ్మోహన్.

అప్పటిదాకా డబ్బు వస్తుందో రాదోనని ఆందోళన చెందుతూ దడదడలాడిన ఎర్రన్న గుండె సేదతీరింది.

"అసలు చివరి క్షణంలో రిజిస్ట్రేషన్ కాన్సిలవడం ఏంటి.. ఏమైంది.. విషయమేంటి? " అనడిగాడు భరద్వాజ.

"మీరేమో విదేశాల్లో ఆర్జించుకొచ్చిన ధనంతో ఫ్యాక్టరీ పెట్టి స్వదేశానికి మేలు చేయాలనుకున్నారు.. అలాంటి మీరు నష్టపోవడం, నెత్తిన చెంగేసుకోవడం నాకు ఇష్టం లేదు... అందుకే... విషయం తెలీ

గానే భూస్వామితో దెబ్బలాడి ముందిచ్చిన సొమ్ము తెచ్చాను.. కొంత తక్కువిచ్చాడు.. కానీ మీరు ఎంతమాత్రం నష్టపోకూడదని నా జేబులోంచి తీసి ఇచ్చాను... ఏం పర్లేదు.. నేనెలానో వసూలు చేస్కుంటాను... మీరెంత అదృష్టవంతులో.. ముందుగానే విషయం తెల్సింది... లేదంటే కొంపలంటుకునేవి.. అమెరికాలో సంపాదించుకొచ్చిందంతా కర్పూర హారతిలా కరిగిపోయేది..” అన్నాడు రామ్మోహన్ సుదీర్ఘంగా విషయాన్ని విశదపరిచే ప్రయత్నం చేస్తూ.

“అంటే? నాకర్థం కాలేదు.. అసలేం జరిగింది? ” అనడిగాడు భరద్వాజ.

“ఆ స్థలం లిటిగేషన్లో ఉన్నదట... ఈ మధ్య ఇలాంటి మోసాలెక్కువయ్యాయి... రిజిస్ట్రేషన్ అయ్యిందిగదా మనకేంటి అనుకుంటాం.. కానీ.. అంతా ఫేక్.. అమ్మేసిన జాగాకి వారసులం అంటూ బయల్దేరి వస్తారు. డబ్బు ధారపోసి కొనుక్కున్న స్థలంమీద దావా వేస్తారు.. మీరు నిజంగా ఎంతో అదృష్టవంతులు అనుకోవాలి... ముందే తెలియబట్టి బతికిపోయారు.. ఇంకా నయం.. ఇప్పుడేమీ బయటపడకుండా తీరా ఫ్యాక్టరీ కట్టేశాక స్టే ఆర్డర్లు తెచ్చారనుకోండి... అప్పుడెంత తలనొప్పి వ్యవహారంగా మారేది చెప్పండి.. మనదేశంలో కోర్టు విషయాల గురించి మీకు తెలీందేముంది.. చచ్చేవరకూ తిప్పుతారు.. మన మనవళ్ళ టైంకి గానీ కేసులు తేలవు... ఈలోపు జరగాల్సిన అన్యాయమంతా జరిగిపోతుంది.. ఇలాంటి లిటిగేషన్ స్థలం ఇప్పించానని మీరు పెట్టే శాపనార్థాలన్నీ నాకు తగిలేవి...” అంటూ చెప్పుకొచ్చాడు రామ్మోహన్.

అంతా విన్న ఎర్రన్న... ఉరఫ్ భరద్వాజ తాను పెనుప్రమాదం నుంచి బయటపడ్డందుకు సంతోషించాడు.

“మీరేం వర్రీ కాకండి.. నర్సాపూర్ రోడ్డులో... దిండిగల్ దగ్గర్లో బ్రహ్మాండమైన స్థలం వుంది... ఈసారి ఒకటికి రెండుసార్లు ఎంక్వైరీ చేశాకే ఓకే చేయిస్తాను... కొన్నందుకు మీరుగానీ, మాట్లాడి పెట్టినందుకు నేను గానీ బాధపడే పరిస్థితి రాకూడదు.. నాకొక్క పదిరోజులు టైమివ్వండి చాలు” అన్నాడు రామ్మోహన్ హుషారుగా.

ఎర్రన్న నవ్వుతూ తల పంకించగా, రామ్మోహన్ అక్కణ్ణించి బయల్దేరాడు.

అదంతా రామ్మోహన్ బ్రహ్మాండంగా అల్లి చెప్పిన కథ మాత్రమే! నిజానికి అసలు సంగతి అదికాదు.

అంతకుముందురోజు రామ్మోహన్ సికింద్రాబాద్ కంటోన్మెంట్ ఏరియా మీదుగా వెళ్తోంటే అతని స్నేహితుడు జగన్నాథం కొడుకు హరి రోడ్డు పక్కన కన్పించాడు. బండి పాడయిందని చూడగానే అర్థమైంది. రామ్మోహన్ కారాపి, విషయం తెలుసుకున్నాడు. “ఈ దగ్గర్లో ఎక్కడా మెకానిక్ షాపు వుండదురా హరీ... ఒక పనిచేద్దాం.. ఆ ఇంటివాళ్ళతో మాట్లాడి.. బైక్‌ను వాళ్ళ ఇంట్లో పెడదాం... నాకు తెల్సిన కుర్రాడు ఈ దగ్గర్లోనే ఉంటాడు... వాడికి ఫోన్‌చేసి చెప్తాను.. వాడు దాన్ని బాగుచేయించే సంగతి చూస్తాడు.. ఇంతకీ

## కొత్తగాలి...

**వాడు క్యాష్**
**చేసుకుంటున్నాడు!**
**వీడు క్రాష్**
**అవుతున్నాడు!!**

– నేహా దూసి,
బెంగళూరు

నువ్వెక్కడికి బయల్దేరావు?" అన్నాడు రామ్మోహన్ క్షణంలో పరిష్కారమార్గం అంతా సూచించేసి.

"నిజం చెప్తే నన్ను బేవార్స్‌గాడు అనుకుంటారేమో?" అన్నాడు హరి మొహమాటంతో నసుగుతూ.

"చాల్లేవోయ్... మేమంతా మీసాలు రాగానే మొనగాళ్ళయిపోయి సంపాదించామా ఏంటి?! ఈ ఏజ్‌లో ఏవో సరదాలు, అల్లర్లు... అన్నీ కామనే... ఇంతకీ ఏంటి విషయం. సిటీ ఔట్‌స్కర్ట్స్‌కి పోయి బీర్ కొడదామనుకున్నావేంటి?" అన్నాడు రామ్మోహన్ సరదాగా.

"అయ్యయ్యో... ఛఛ... అలాంటిదేం లేదు" అన్నాడు హరి కంగారు కంగారుగా.

"అయితే ఎవరైనా.. ఆడపిల్ల..." అంటూ కళ్ళెగరేశాడు రామ్మోహన్.

"మైగాడ్... మీరేంటంకుల్... నన్ను మరీ అంత స్పాయిల్డ్ బాయ్ అనుకుంటున్నారా ఏంటి?" అన్నాడు హరి గాబరాగా.

"మరేంటో చెప్పవోయ్" వదలకుండా అడిగాడు రామ్మోహన్.

"ఊరికినే అంకుల్.. ఈ రోడ్లు నిర్మానుష్యంగా ఉంటాయి కదా.. హాయిగా ఉంటుందని బయల్దేరా... నాన్నకి తెలిస్తే 'ఈ వరసన బలాదూర్లు తిరగడానికి మనకేం పెట్రోల్ బావులున్నాయా.. దుబాయ్ నుంచి పైప్ లైన్లేయించుకున్నామా.. అంటూ ఛడామడా తిట్టేస్తారు" అన్నాడు నసుగుతూ.

"మీనాన్నకి ఇంకా ఆదిమానవుడి లక్షణాలు పోలేదులే... అక్కడే బిగుసుకుపోయాడు... ఎంతసేపూ తిని తొంగోవడం తప్ప ఇంకో యావ వుండొద్దంటే ఎలా? పిల్లలన్నాక ఆ మాత్రం సరదాలుండవా? సర్లే, కారెక్కు... ఇంకా లాంగ్ డ్రైవ్ కెళ్దాం..." అన్నాడు.

కారు శరవేగంగా మేడ్చల్ వైపు దూసుకుపోతోంది.

"నాకిలాంటి ప్రయాణాలంటే భలే సరదా అంకుల్... నా సబ్జెక్ట్ జియాలజీ కదా... దారిలో అక్కడక్కడా ఆగి, ఎక్కడ ఎలాంటి నేల ఉంది అని చూసుకుంటూ వెళ్ళాలనిపిస్తుంది... ఇంతకీ ఎక్కడికంకుల్?" అన్నాడు.

"ఓ పెద్దమనిషి రెసిడెన్షియల్ స్కూలు పెట్టబోతున్నాడురా.. ఆరెకరాల స్థలం కావాలంటేనూ... కొన్ని సైట్లున్నాయి.. చూద్దామని బయల్దేరాను" అన్నాడు రామ్మోహన్.

మధ్యలో ఎర్రన్న కోసం బేరమాడి పెట్టిన పదిహేనెకరాల స్థలం దగ్గర కారాపి "ఇప్పుడు ఇదంతా అడవిలా ఉంది కదరా హరీ... కొద్దికాలంలో ఇక్కడో

## కొత్తగాలి...

**ఏ గ్రూపు**
**రక్తాన్నయినా**
**పీల్చే ఆకతాయి**
**దోమ!**

– నితీష్ చంద్రశేఖర్,
కర్నూలు

ఫ్యాక్టరీ రాబోతోంది... ఇక ఈ ప్రాంతమంతా సందడిగా మారుతుంది" అంటూ రామ్మోహన్ ఉత్సాహంగా చెప్తోంటే...

హరి ఆ మాటలేం పట్టించుకోకుండా మట్టిని కెలుకుతూ కనిపించాడు.

"ఏమైందిరా హరీ, పెన్నుగానీ పడిపోయిందా?" అడిగాడు రామ్మోహన్.

"అంకుల్... మీకో షాకింగ్ న్యూస్ చెప్పనా... ఇది మామూలు నేల కాదు... వండ్రఫుల్ సైట్... ఇందులో గ్రానైట్స్.. గెలాక్సీ గ్రానైట్స్..." అంటూ మెరిసే



కళ్ళతో చెప్పాడు హరి.

రామ్మోహన్‌కి నమ్మశక్యం కాలేదు. "ఏం జోక్ చేస్తున్నావా? " అన్నాడు.

"మీలాంటి పెద్దవాళ్ళతో జోకులేస్తానా అంకుల్ ? "

రామ్మోహన్ ఇంకా అపనమ్మకంగానే చూశాడు. "ప్రామిస్ అంకుల్... నేను చదివింది జియాలజీ... కావాలంటే తవ్వించి చూడండి" అన్నాడు.

రామ్మోహన్ ముందు ఆశ్చర్యపో యాడు. తర్వాత ఆనందించాడు. వెంటనే తక్షణ కర్తవ్యం ఏమిటో ఆలోచించాడు. మరి కొంతదూరం వెళ్ళి స్కూలు సైటు చూశాడేగానీ మెదడు పనిచేయలేదు. మనసు ఎర్రన్న కోసం ఖరారు చేసిన స్థలం చుట్టూనే గిర్రున తిరుగుతోంది. రామ్మోహన్ కారు ఎంత స్పీడుగా డ్రైవ్ చేస్తున్నాడో, అతని బ్రెయినూ అంతే స్పీడుగా, షార్ప్‌గా పనిచేస్తోంది.

హరిని కంటోన్మెంట్ దగ్గర డ్రాప్ చేశాడు. అంతకుముందే కుర్రాడికి ఫోన్ చేయడాన అతను బాగుచేసిన బండితో అక్కడ సిద్ధంగా ఉన్నాడు. ఎంత ఖర్చ యిందో అడిగి, అతడికి చెల్లించేశాడు.

రోజులు ఆలస్యం కావచ్చు.

మొత్తానికి వారంలోపుగా తక్కిన పైక మంతా మీ చేతుల్లో పెట్టే పూచీ నాది... అతను చేతులెత్తేస్తే ఇంకెవరికో అమ్మిపె డ్తాను... మీరైతే నిశ్చింతగా వుండండి..." అని చెప్పాడు.



ఆ పెద్దమనిషి తలాడించాడు. ఆయనకేం నష్టం.. తనకు బయానా ఇచ్చారు.. రిజిస్ట్రేషన్ చేయించుకోకపోతే వాళ్ళకే నష్టం... ఆ డబ్బు తిరిగివ్వాల్సిన పని కూడా వుండదు.. ఇంకెవరికో అమ్ముకోవచ్చు. అది అందరికీ తెలిసిందే... అందుకే ఆయన చిరునవ్వులు చిందించాడు.

హరి ఇవ్వబోతోంటే "ఇదే మీ నాన్నయితే ఇవ్వడా?" అని భుజమ్మీద చరిచాడు. హరికి, బండి తెచ్చిన కుర్రాడికి చెయ్యూపి వెళ్ళిపోయాడు.

మల్కాజ్‌గిరిలో తనకు తెల్సిన ఎక్స్‌పర్ట్ జియాలజిస్టును వెంటబెట్టుకుని సైటుకు వెళ్ళాడు. అతను కూడా ఖరారు చేశాక ఇక రామ్మోహన్ సంతోషానికి అవధుల్లేకపోయాయి. అతనికి ఫీజిచ్చి, అతని ఆఫీసులో దింపేసిన తర్వాత అనుకోకుండా కలిసొచ్చిన అదృష్టలక్ష్మిని తల్చుకుని విపరీతంగా సంతోషించాడు.

ఎర్రన్నకు నమ్మశక్యమైన కథ అల్లి ఒప్పించినట్లే స్థలం అమ్మజూపిన ఆసామికీ మరో విధంగా కథ అల్లి చెప్పి, అతన్ని కూడా ఒప్పించాడు.

"ఈ స్థలం కొందామనుకున్న పెద్దమనిషికి ఏదో సమస్య వచ్చింది. సమయానికి డబ్బు అందేట్లు లేదు.. ఇంకో నాలుగైదు

కానీ, పాపం బంగారం లాంటి గెలాక్సీ గ్రనైట్లు అందులో ఉన్నాయని, ఆ సంగతి తెలీక కారుచవగ్గా అమ్మేసుకుంటున్నానని ఆయనకేం తెలుసు? కథల్లో అయితే దేవతలు కల్లో కనిపించి 'ఫలానా చోట తవ్వు.. లంకెబిందెలు దొరుకుతాయి' అని చెప్తారు. కానీ, పాపం ఆ ఆసామికి ఏ లక్ష్మీదేవి కూడా కల్లో గ్రనైట్ల సంగతి చెప్పనేలేదు. ఉత్తినే పడున్న స్థలాన్ని అమ్మి బ్యాంకులో డిపాజిట్ చేద్దామనుకున్నాడే గానీ బంగారాన్ని గిల్టు మాదిరిగా చవగ్గా అమ్మేసుకుంటున్నానని తెలీదు.

మొత్తానికి రామ్మోహన్ ఎవరికి చెప్పేది వారికి చెప్పాడు. అతను చెప్పిన వైఖరిని బట్టి ఇద్దరికీ కోపం రాకపోగా రామ్మోహన్ పట్ల ఎంతో సద్భావం కలిగింది. తాను మోసపోయినా పరులకు మాత్రం

అన్యాయం కలగనివ్వడు అనిపించి ఆత్మీయభావం కలిగింది.

ఎర్రన్నకు చెప్పినట్లుగానే దిండిగల్ రోడ్డులో స్థలం ఇప్పించాడు. గ్రనైట్లు ఉన్న స్థలాన్ని తన భార్య పేరుతో రిజిస్ట్రేషన్ చేయించాడు. కానీ అతని భార్యేనని ఎవరికీ అనుమానం రాకుండా ఆమె పేరులోని ఇన్షియల్స్‌ని మాత్రమే పెట్టి జె.ఎస్. ఎస్. నంద పేరుతో చేయించాడు. వైఫాఫ్ అని రాయించకుండా డాటరాఫ్ అని రాయించాడు.

★ ★ ★

పండరి అంతవరకూ చెప్పాక ఇక తర్వాతేం జరిగుంటుందో బోసుకు స్పష్టంగా అర్థమైంది. పండరి ఇంకా తన ధోరణిలో చెప్పుకొచ్చింది.

"బిజినెస్‌లో ఇవన్నీ కామనే... నేలతల్లి ఎక్కడేం దాచుకుంటుందో ఎవరికి తెల్సు.. కొన్నిచోట్ల మైకా వుంటే.. ఇంకొన్నిచోట్ల బంగారం ఉంటుంది..

మరికొన్ని చోట్ల పెట్రోల్ ఉంటుంది.. నేను ఆ స్థలాన్ని అమ్మిపెట్టడం కోసమే బేరమాడాను. కాదన్ను. కానీ... అందులో లక్ష్మీదేవీ వుందని తెలిశాక నేనెలా వదిలిపెట్టగలను? తెల్సితెల్సి అంత విలువైనదాన్ని ఇంకెవడి చేతిలోనో పెట్టగలనా అన్నారు రామ్మోహన్ సార్... అసలాయనకి తాను తప్పు చేశాననే ఫీలింగే లేదు సార్. ఇంకెందుకు భయపడ్తారు?"

బోసు ఆసక్తిగా వింటున్నాడు.

మరో రెండు నిమిషాలు పండరితో మాట్లాడి "రామ్మోహన్‌తో రిలేషన్ వుంది కనుక.. హత్య చేయించి వుంటావని సస్పెక్ట్ చేశాం... సరే.. కాదని చెప్తున్నావు... అవసరమైతే మళ్ళీ వస్తాను.. ముఖ్యమైన విషయం... ఎర్రన్న.. అదే భరద్వాజ గురించి తెల్సనిగానీ... అదంతా నాతో చెప్పిన సంగతిగానీ మరెక్కడా అనకు. ఇదొక్కటే కాదు. అసలే విషయమూ మాట్లాడొద్దు... నీ సేఫ్టీకోసమే చెప్తున్నా..." అని అక్కణ్ణించి వెళ్ళిపోయాడు బోసు.

★ ★ ★

'రామ్మోహన్ మర్డర్ మిస్టరీ ఇప్పటికి వీడిందన్నమాట.. పెద్ద వ్యాపారి కనుక, మొట్టమొదట ప్రొఫెషనల్ శత్రువుల గురించే ఆలోచించాడు. రామ్మోహన్ విరోధులు డ్రైవర్ వీర్రాజును ట్రాప్‌చేసి హత్యకు పన్నాగం పన్నారేమో... వాళ్ళీ హత్య చేయడానికి వీర్రాజు సహకారం వుందేమోనని అనుమానించి అతన్ని విచారించారు. కానీ వీర్రాజువల్ల వాళ్ళకేమీ తెలీలేదు. అతను మందుబాబే తప్ప మరేం కాదని తేలింది.

ఎవర్ని కదిలించినా రామ్మోహన్ మంచివాడు, లౌక్యుడు.. అసలు గొడవలు పెట్టుకునే తత్వమే కాదు అని చెప్పడం వల్ల ముందు కేసును ఇటుగా నడిపిస్తూ వచ్చాడు. భార్యతో సత్సంబంధాలు లేకపోవడంతో సునంద మీదికి అనుమానం పోయింది. ఆ తర్వాత మమత.. ఆపైన పండరి..

పండరి ఎర్రన్న గురించి బయటపెట్టేవరకూ ఆమే హత్య చేయించి వుంటుంది అనుకున్నాడు బోసు..

సో... రామ్మోహన్ని హత్య చేయించింది ఎర్రన్న.. ఉరఫ్.. భరద్వాజ అన్నమాట.

రాజు తల్చుకుంటే కొరడా దెబ్బలకేం కొదవ అన్నట్లు పోలీసు తల్చుకుంటే ఇన్ఫర్మేషన్‌కేం కొదవ? భరద్వాజ వివరాలు క్షణాల్లో తెలిశాయి. భరద్వాజ నర్సాపూర్ రోడ్డులో బయోకెమికల్స్ ప్లాంట్ స్టార్ట్ చేశాడు. ఎంతో పలుకుబడి సంపాదించి మహారాజులా వెలిగిపోతున్నాడు.

అసలు విషయం చెప్పక ఆ ఏరియా ఎస్సైకె ఫోన్‌చేసి మాట్లాడాడు బోసు.

".. భరద్వాజని నేనైతే పర్సనల్‌గా చూళ్ళేదు సార్.. కానీ.. గొప్పగా చెప్పుకుంటారు.. సంగతేంటో చెప్తే నేను ఎంక్వయిరీ చేస్తాను సార్.. మొత్తానికి అతని వల్ల చాలామందికి ఉపాధి దొరికింది. అందుకే అతనంటే ఆ ప్రాంతంవాళ్ళకి గౌరవం" అన్నాడు.

"ఉపాధిదేముందిలే.. బ్రోతల్ హౌజ్ పెట్టినా కొందరికి జీవనోపాధి దొరుకుతుంది.. సారీ టు సే లైక్ దిస్.. పెద్ద మనుషులుగా చెలామణీ అయ్యేవాళ్ళు కూడా హత్యలు, దోపిడీలు చేయించడం కామనేగా.. సరే.. థ్యాంక్యూ.." అని ఫోన్ పెట్టేశాడు బోసు.

'ఇంతకీ రామ్మోహన్ని భరద్వాజ హత్య చేయించి వుంటాడా? లేక స్థలం అమ్మిన వ్యక్తి చేయించి వుంటాడా? అతను చేయించడానికి ఆస్కారం లేదు. ఎందుకంటే, ఎటూ అమ్మదలచాడు. అమ్మేశాక అందులో బంగారం ఉందని తెల్సి బాధ కలుగవచ్చుగానీ... కోపం రావడానికి ఛాన్స్ లేదు... చెప్పిన ధరలో కానీ, రిజిస్ట్రేషన్ టైంలోగానీ తేడా లేదు. మారిందల్లా కొనుక్కున్న వ్యక్తి పేరొక్కటే. కేవలం పేరు మార్పిడివల్ల అతనికొచ్చిన నష్టం ఏమీ లేదు. రామ్మోహన్ మధ్యలో ఆడిన నాటకం బహుశా ఓనరుకి తెలిసుండదు. ఒకవేళ ఎప్పుడో తెల్సినా.. తాను అనవసరంగా తొందరపడి అమ్మానని తల బాదుకుంటాడే తప్ప తనను మరెవరో వంచన చేశారనే ఆలోచన రావడానికి అవకాశం లేదు.

ఏమో, ఎవరు చెప్పగలరు? ఎంతో ఖరీదైన స్థలం కారుచవగ్గా పోయినందుకు అతనికి దిగులు కలిగుండొచ్చు. అది కక్షగా మారడంలో ఆశ్చర్యం ఏముంది? కనుక స్థలం అమ్మినవ్యక్తి ఆ హత్య చేయించడానికి ఆస్కారం వుంది.

భరద్వాజ మీద కొంత అనుమానంగా ఉన్నప్పటికీ అతనీ హత్య చేయించి వుండకపోవచ్చని బలంగా అనిపిస్తోంది. ఎందుకంటే అతను మొదట కొందామనుకున్నది మేడ్చల్ వైపు కాగా, చివరికి కొన్నది దిండిగల్ అవతల. రెండిటికీ మధ్యలో చాలా దూరం. పైగా ఈ వ్యవహారం జరిగి చాలాకాలం అయ్యింది. జె.ఎస్.ఎస్.నంద అంటే రామ్మోహన్ భార్యేనని తెల్సుకోవడం కష్టం కాకపోయినా ఆ విధంగా అనుమానం వచ్చే అవకాశం లేదు కనుక అసలు ఎంక్వయిరీనే చేయకపోవచ్చు. తాను కొందామనుకుని కొంతడబ్బు కూడా చెల్లించిన మాట నిజమే.. కానైతే.. మరోచోట ఇంకా

> **కొత్తగాలి...**
>
> **పేగు బంధం**
> **పిడుగైంది**
> **వృద్ధాశ్రమం**
> **గొడుగైంది**
>
> – రఘుపాత్రుని శ్రీనివాసరావు, శ్రీకాకుళం

తక్కువ వెలకి స్థలం ఇప్పించాడు కనుక రామ్మోహన్ తనకేదో ద్రోహం చేశాడనే ఆలోచన అతనికి రాకపోవచ్చు. అన్నిటినీ మించి.. ఎన్నో సంవత్సరాలు విదేశాల్లో వుండివచ్చినవాడికి హత్య చేయించడం తెలికేగానీ.. పట్టుబడితే ఎంతకష్టమో తెలీదా? పేరు, పరపతి అన్నీ గంగలో కలవ్వా? అంత బుర్ర లేకుండా ఎలా వ్యవహరిస్తాడు? రామ్మోహన్‌మీద ఎంత కోపం వచ్చినా, జీవితాంతం జైల్లో కూర్చోడానికి చేతులారా తనకి తానే ఏర్పాటు చేసుకుంటాడా?

బోసు ఆలోచనలు పరిపరివిధాల సాగుతున్నాయి. ఇంటికి వెళ్ళి భోజనం చేశాడు. ఫ్రెషప్పయి యూనిఫాం కాకుండా సివిల్ డ్రెస్ వేసుకున్నాడు.

"ఏంటి... వేట తీవ్రమైనట్లుందే" అంది బోసు భార్య అరుణ కళ్ళెగరేసి నవ్వి.

"నీకేంటమ్మా... ఇంట్లో కూర్చుని వంట చేస్తే సరిపోతుంది... మా బతుకుల్లో వుండేది వేటే మరి... దొంగలు, హంతకుల చుట్టూ పరిగెత్తి వేటాడాలి... పట్టుకోకపోతే ఉద్యోగాలకే వేటు.." అంటూ బ్రహ్మాండమైన ఎక్స్‌ప్రెషన్లిచ్చి బయల్దేరాడు.

★ ★ ★

బోసు మొదట సునందకు ఫోన్ చేసి

**కొత్తగాలి...**

**పెళ్ళి అంటే**
**మూడు ముళ్ళు**
**ప్రేమంటే**
**ఒక పువ్వు, రెండు నవ్వులు!**

*– డి. చంద్రావంశీ,*
కర్నూలు

మేడ్చల్ రోడ్డులో 'జె.ఎస్.ఎస్. నంద' పేరుతో ఉన్న ప్లాటు వివరాలు చెప్పమని అడిగాడు. సునంద "డాక్యుమెంట్లు వెతకడానికి కొంచెం టైం పడ్తుంది. పైగా ఇలాంటివి కొన్ని ఆయన ఆఫీస్‌రూంలో కూడా వుండే అవకాశం వుంది. ఇక్కడుంటే మాత్రం నేను చెప్తాను" అంది. ఆమె చాలా హడావిడిగా బీరువాలో ఉన్న వంద డాక్యుమెంట్లలోంచి అతనడిగినది సాధించగలిగింది. సర్వే నంబరు, పూర్తి వివరాలు చెప్పింది.

బోసు వెంటనే మేడ్చల్ వైపు దారితీశాడు.

చౌరస్తాలో ఓ కిరాణాకొట్టు కనిపించడంతో బోసు బైక్ పార్క్ చేసి, స్థలం వివరాలు అడగటం కోసం వెళ్ళాడు.

తాను పోలీసుననే అనుమానం రాకుండా జాగ్రత్తపడ్డాడు బోసు.

"ఏక్ కిలో చెక్కెర కావాలంట, జోకరా" అని షాపులో కుర్రాడికి ఆజ్ఞ జారీ చేసి, ఇటు బోసువైపు తిరిగి "ఏం సార్.. యేడకెల్లి వచ్చింద్రు.. యెవరు గావాల్న?" అన్నాడు శ్రీశైలం.

"సిటీ నుండి వచ్చానయ్యా... ఇక్కడేమైనా స్థలం వుంటే కొనాలని.. రేట్లెలా వున్నాయేంటి?" అంటూ శ్రీశైలాన్ని అసలు సంగతేమీ చెప్పకుండా మాటల్లోకి దింపాడు బోసు.

"గింతదూరం వస్తరా సారూ? వస్తున్నర్లే మస్తుమంది... అబ్బో.. మస్తు పెంచిన్రు... గజం పదివేలు చెప్తున్రు..."

"ఏంటో బాగా లేట్ చేశాను. మొన్నటిదాకా.. ఇక్కడంతా కారుచవకంట కదా?"

"ఎందుకడుగుతరు సార్? తల్చుకుంటే దిమాక్ ఖరాబైతది.. మా తాత మస్తు కమాయించిండు.. కానీ.. మా నాయ్న పుల్కాలమ్మిన వైనం జమీన్ అమ్మి చనిపోయిండు... అంతకన్న బ్యాడ్‌న్యూస్ ఏందంటె.. మా జాగల... గ్రనైట్లు పడిన్రె... అయిగూడ.. గెలాక్సీ గ్రనైట్లు... అయ్యేంత గనమొ మీకెర్కనె గంద.. ఆ జాగిప్పుడుంటే.. ఈ కిరాణ దుకాణం ఎందుకన్న... పెద్ద సూపర్ మార్కెట్ పెట్టకపోతిని? ఒకటేంటి... పది పెడ్తుంటి" అన్నాడు శ్రీశైలం దిగులు ముఖంతో. బోసుకి ఇది వీళ్ళు చేయించిన హత్య కాదని క్షణంలో అర్థమైపోయింది. అయితే తాను పరోక్షంగా సమాచారం సేకరిస్తున్నట్లు అనుమానం రాకుండా ఇంకో రెండుమాటలు మాట్లాడి అక్కణ్ణించి

బయల్దేరాడు.

★ ★ ★

బోసు బాగా అలోచించాడు. సమర్ధుడు, నమ్మకస్థుడైన ఇన్‌ఫార్మర్ని బయోకెమికల్స్‌కి పంపాడు. విషయం తేటతెల్లంగా వివరించి "అరెయ్ రఘూ.. ఆ భరద్వాజ కంపెనీలో పి.ఆర్.ఓ.ని పట్టుకో.. వాడు మందుకి పడిపోతాడట.. వాణ్ణి పట్టుకుని పీకల్దాకా పోయించైనా మనకి అవసరమైన సమాచారం రాబట్టు.. అన్నట్టు భరద్వాజ పర్సనల్ సెక్రటరీతో జాగ్రత్త... ఆ పిల్లకి అతని రహస్యాలన్నీ తెలియడమే కాదు, స్టాఫ్‌ని, వచ్చేపోయే వాళ్ళందర్నీ ఓ కంట కనిపెడుతూ వుంటుందట... అనుమానం రాకుండా చూసుకో..." అంటూ జాగ్రత్తలు చెప్పాడు.

అలాగే టెలిఫోన్ ఎక్స్‌ఛేంజ్‌కి కాన్‌స్టేబుల్ని పంపి అలకనంద జువెలరీస్, ఇంకా రామ్మోహన్ ల్యాండ్‌లైన్ల కాల్ లిస్టులు తెప్పించాడు.

అడిగింది పోలీస్ డిపార్ట్‌మెంట్ కనుక కాల్ లిస్ట్ వెంటనే వచ్చింది. నంబర్లన్నీ ట్రేస్ చేశారు. రామ్మోహన్ హత్యకు గురయిన రోజు ఉదయం తొమ్మిది నుండి పదిన్నరలోపు ఒక నంబరు నుండి రెండు కాల్స్ వచ్చాయి. ఆ నంబరు మొదటి మూడు అంకెల్ని బట్టి లక్డీకాపూల్ ఏరియా అని అర్ధమవడంతో బోసు కళ్ళు చమక్కుమన్నాయి. వెంటనే టెలిఫోన్ ఎంక్వయిరీకి చేసి ఆ నంబర్ లక్డీకాపూల్ హోటల్ ఆశయాదని తెలియగానే అలర్టయ్యాడు.

రామ్మోహన్ స్నేహితుడు నరసింహం, ఆవేళ రామ్మోహన్ను దింపింది హోటల్ ఆశయా దగ్గర. అయితే రామ్మోహన్ ఆశయాలో పని వుంది అని చెప్పాడే గానీ, ఎవర్ని కలవడానికి వెళ్తోందీ చెప్పలేదు. అతన్ని చంపినవారెవరో కచ్చితంగా అక్కడ బసచేసి వుంటారు.

బోసు వెంటనే రామ్మోహన్ మొబైల్‌కు ఆయన చనిపోయే రోజు, అంతకుముందు రోజు వచ్చిన కాల్స్ మరోసారి చెక్ చేశాడు. అందులో ఈ ల్యాండ్‌లైన్ నంబర్ లేదు.. మొబైలయితే రికార్డవుతుందని దానికి చేయలేదు. ఈ రోజుల్లో ల్యాండ్‌లైన్ నంబర్లను కూడా ట్రేస్ చేయొచ్చని ఆ వెధవలకి తెలీదా? ఒకవేళ తెలిసినా షాపు కనుక ల్యాండ్ టు ల్యాండ్ వంద కాల్స్ వస్తాయి... ఎవరికీ డౌటు రాదని అనుకుని వుంటారా? మొత్తానికి ల్యాండ్‌లైన్‌కి చేసి రామ్మోహన్ గురించి ఆరా తీస్తే రిసెప్షనిస్టు ఇంటర్‌కమ్‌లో ఇన్ఫర్మేషన్ అందించి వుంటుంది. రామ్మోహన్ రెసిడెన్షియల్ నంబర్‌కు వచ్చిన కాల్స్ లిస్ట్ కూడా చెక్ చేశాడు. అందులోనూ ఆ నంబరు లేదు.

> ## కొత్తగాలి... 
>
> **ఆమె నడక**
> **హంస నడక!**
> **అతడి నడక**
> **హంస వెనక!**
>
> – బిక్కునూరి రాజేశ్వర్,
> పొన్కల్

మరోసారి అలకనంద జువెలరీస్‌కు ఫోన్ చేసి రిసెప్షనిస్టుతో మాట్లాడాడు.

"ఏమ్మా! మీ ఎం.డి.గారి హత్య జరిగిన రోజున నువ్వు డ్యూటీలో ఉన్నావా?" అనడిగాడు బోసు.

"ఉన్నానండీ"

"హోటల్ ఆశయా నుండి ఎవరైనా కాల్ చేసినట్లు గుర్తుందా?"

"ఏమో, నాకేం గుర్తులేదండి.. ఎక్క

ణ్ణించి... ఎవరు అనేది ఆ క్షణంలో తప్ప తర్వాత గుర్తుండదు... కొందరు డీటెయిల్స్ అడిగినా చెప్పరు. మీ సార్‌కి కనెక్ట్ చేయి... అని దురుసుగా కూడా మాట్లాడ్తారు" అంది.

ఇక ఆమెవల్ల దొరికే సమాచారం ఏమీ లేదని అర్థం కాగానే కాల్ డిస్‌కనెక్ట్ చేశాడు బోసు.

చటుక్కున లేచి ఆశయాకు బయల్దేరాడు.

పోలీసు ఇన్‌స్పెక్టర్ బోసుని చూసి రిసెప్షనిస్టులు ఇద్దరూ గౌరవపూర్వకంగా లేచి నిలబడ్డారు.

"ఎయిటీంత్ మానింగ్ డ్యూటీలో ఎవరున్నారు? " అనడిగాడు.

వాళ్ళలో ఓ కుర్రాడు తనకు రెండో షిఫ్టని చెప్పగా ఇంకో కుర్రాడు బిక్కుబిక్కుమంటూ ఆవేళ ఉదయం తాను డ్యూటీలో ఉన్నట్లు చెప్పాడు.

"ఎందుకంత భయపడ్తున్నావు.. నీ పేరేంటి? "

"సురేష్"

"చూడు సురేష్! ఓ హత్య కేసులో కాస్త వివరాలు కావాల్సి వచ్చాను... దట్సాల్.. రిలాక్స్‌గా వుండు" అని జేబులోంచి ఇందాక రాసుకున్న లిస్టు తీసి "మీ హోటల్లో దిగినవాళ్ళు డైరెక్ట్‌గా కాల్ చేసుకునే సదుపాయం వుందా లేక త్రూ రిసెప్షన్ మాట్లాడ్తారా? " అనడిగాడు.

"ఏ రూంలోనూ డైరెక్ట్ ఫోన్ మాట్లాడే వీల్లేదండి... ఎవరికి ఏ నంబర్ కావాలన్నా రిసెప్షన్‌కి చేసి అడిగితే మేమే కనెక్ట్ చేస్తామండి... ఆ ఖర్చు వాళ్ళమీదే పడుతుంది.. లేదంటే వేల బిల్లొస్తుంది కదండీ.." అన్నాడు సురేష్.

"వేల బిల్లే కాదు... బెదిరింపు కాల్సు చేయడానికి, మరేమైనా చేయడానికి ఆస్కారం వుంది... అద్సరే... ఎయిటీన్త్ మానింగ్ ఇక్కణ్ణించి అలకనంద జువెలరీస్‌కి రెండు కాల్స్ వెళ్ళాయి... ఏ రూం నుండి ఈ నంబర్ కనెక్ట్ చేయమని అడిగారో చూసి చెప్పాలి"

సురేష్ భయపడ్తూ "మా మేనేజర్ ఊరుకుంటారో లేదో.. నేనిలా చెప్పొచ్చో లేదో? " అన్నాడు.

"నాయనా... ఇదో మర్డర్ కేస్.. చెప్పి తీరాలి.. ఏదీ.. మీ మ్యానేజర్‌కి కనెక్ట్ చెయ్యి... నేను మాట్లాడ్తాను" అన్నాడు.

బోసు మాట్లాడి ఫోను రిసెప్షనిస్టుకి ఇచ్చాడు. అవతల్నుంచి మేనేజర్ అవసరమైన సమాచారం చెప్పమనడంతో సురేష్ నిర్భయంగా రిజిస్టర్ తీశాడు. చకచకా ఆ తేదీకి వెళ్ళి, చెక్ చేసి చెప్పాడు. "రూం నంబర్ 202 నుండి అడిగారు సార్" అన్నాడు.

"ఆ వేళ ఆ గదిలో ఎవరు దిగారు? "

"సూరి, గిరి అని ఇద్దరు"

"ఎప్పుడు దిగారు, ఎన్నిరోజులున్నారు? వీళ్ళింకా ఏయే నంబర్లకు ఫోన్ చేశారు? వాళ్ళ అడ్రసు, ఫోన్ నంబర్లు అన్నీ ఇవ్వవయ్యా.." అన్నాడు బోసు.

సురేష్ మొత్తం వివరాలన్నీ పేపర్‌మీద రాసిచ్చాడు. అది తీసుకుని బోసు స్టేషన్‌కి వచ్చాడు. వాళ్ళు మెన్షన్ చేసిన అడ్రస్ ఫేక్‌దని తెల్సిపోయింది. అందులో వాళ్ళు రాసిన ఫోన్ నంబర్‌కు ఫోన్ చేయగా అసలలాంటి నంబరే లేదని తెల్సింది.

'ఈ హోటళ్ళవాళ్ళు చాలా కేర్ తీసుకుంటున్నారుకానీ, క్రిమినల్ బ్రెయిన్స్ కదా... దొరక్కుండా జాగ్రత్తపడ్తుంటాయి. ఇచ్చిన అడ్రసు, ఫోన్ నంబరు చెక్ చేసుకున్నాకే రూం ఇచ్చే పద్ధతి వుంటే సరి..' అనుకున్నాడు బోసు. అనుమానితులుగా భావించిన సూరి, గిరి ఆ హోటల్ నుండి మరో మొబైల్ నంబర్‌కు కూడా కాల్ చేసినట్లు రిసెప్షనిస్టు ఇచ్చిన వివరాల్లో వుంది.

# వెండితెర వెనుక గాధలు!



సినిమా నటుడు కాకముందు కొంగర జగ్గయ్య ఆలిండియా రేడియోలో వార్తలు చదివే ఉద్యోగం చేసేవారు. అలాగే నేటి హాలీవుడ్ నటీనటులు కూడా తాము వెండి తెర ప్రవేశం చేయక ముందు అనేక చిత్ర విచిత్రమైన ఉద్యోగాలు చేసారు. రాబిన్ విలియమ్స్ స్ట్రీట్‌మైమ్‌గా పని చేసాడు. రిక్‌రాస్ అనే నటుడు జైల్లో కరెక్షన్స్ ఆఫీసర్‌గా పనిచేసి ఖైదీలను మంచి మార్గంలో పెట్టాడు. కాని తెర మీద విలన్ వేషాలు వేస్తున్నాడు.

చతుర ప్రపంచం

సిల్వెస్టర్ స్టాలోన్ సర్కస్ సింహాలకు శిక్షణనిచ్చే ఉద్యోగం చేసేవాడు. ఇదే పనిచేసిన మరో హాలీవుడ్ నటుడు క్రిస్టఫర్ వాల్కెన్. జేమ్స్ బాండ్ పాత్రధారి సన్‌కానరి మిల్క్‌మేన్‌గా ఇంటింటికి తిరిగి పాలసీసాలను ఇచ్చేవాడు. జానిడెఫ్ అనే నటుడు ఫోన్‌కాల్స్ ద్వారా ఖరీదైన పెన్నీలను అమ్మేవాడు. రాడ్ స్టీవార్డ్ అనే నటుడు నిత్యం శవాలను పాతే గోతులను తవ్వే ఉద్యోగాన్ని ఓ పెద్ద సెమెట్రీలో చేసేవాడు. ఉపీ గోల్డ్‌బెర్గ్ అనే అకాడమి అవార్డు పొందిన నటి ఓ మార్చురీలో శవాలకు మేకప్ చేసే ఉద్యోగం చేసింది.

కోరిమోంటెయిత్ అనే నటుడు కాస్తంత శుభ్రమైన ఉద్యోగం చేసాడు. వాల్‌మార్ట్ సూపర్ బజారుకి వచ్చే కొనుగోలుదారులను గ్రీట్ చేసే ఉద్యోగం అది. జాన్‌హేమ్ అనే హీరో, నటుడు తన వృత్తికి సంబంధించిన ఉద్యోగం చేసాడు. ఓ హైస్కూల్‌లో డ్రామా టీచర్‌గా పని చేసాడు. అలెక్‌బాల్డ్‌విన్ అనే నటుడు బార్లలో బౌన్సర్ ఉద్యోగం చేసాడు. అంటే తాగి గొడవ చేసేవాళ్లను బయటకి తోసేసే ఉద్యోగం. రే రొమేనో అనే నటుడు శుభ్రంగా ఓ బ్యాంకులో టెల్లర్ ఉద్యోగం చేసాడు. హగ్‌జాక్‌మేన్ అనే నటుడు బఫూన్ ఉద్యోగం చేసాడు. ఇప్పుడతను కమెడియన్‌గా కాక సీరియస్ వేషాలను వేస్తున్నాడు. ఊజ్ ఆస్‌బర్న్ బందెలదొడ్డిలో పని చేసింది. పేట్రిక్ డెంప్‌సే అనే నటుడు జగ్లర్‌గా పని చేసాడు. అమెరికాలోని జాతీయ పోటీలో జగ్లర్‌గా రెండో స్థానాన్ని కూడా పొందాడు. హీరో హేరిసన్ ఫోర్డ్ జోసఫ్‌లా వడ్రంగి పనిచేసాడు. కమెడియన్ డేని డెవిటోకు బట్టతల. అను క్షురకుడిగా పని చేసాడు. హీరోయిన్ ఈవా మెండెస్ ఓ మాల్‌లోని పెట్‌షాపులో కుక్క పిల్లలని అమ్మే ఉద్యోగం చేసేది. మడొన్నా డంకిన్ డొనట్స్ అనే ఫాస్ట్‌ఫుడ్ రెస్టారెంట్‌లో వెయిట్రెస్‌గా పని చేసింది. కేనివెస్ట్ గేప్ అనే ఖరీదైన దుస్తుల తయారీ దుకాణంలో పని చేసాడు. మేథామేక్ కొనోఘే అనే హీరో కోళ్లఫారాన్ని శుభ్రం చేసే ఉద్యోగం చేసాడు. ఏ ఉద్యోగంలో ఉన్నా వారి దృష్టంతా వెండితెర మీదే లగ్నం అవడంతో వారు చివరికి హాలీవుడ్‌కు చేరి విజయులయ్యారు.

బోసు ఆ మొబైల్‌కు ఫోన్చేస్తే రెస్పాన్స్ లేదు. స్విచ్ఛాఫ్ అని వస్తోంది. ఆ సిమ్ ఎలాట్ చేసిన మొబైల్ కంపెనీకి ఫోన్ చేసి అడ్రెస్ తీసుకున్నాడు. అది పాండు పేరు మీద నమోదై వుంది.

మర్నాడు పొద్దున్నే వెళ్ళి. వింటే మామూలుగా, లేదంటే తన్ని మరీ ఆ పాండు అనేవాణ్ణి ఈడ్చుకు రమ్మని ఇద్దరు కానిస్టేబుళ్లకి ఆ పని అప్పజెప్పాడు బోసు.

బోసు చెప్పినట్లుగానే తెల్లారేసరికల్లా పాండు ఇల్లు చేరారు కానిస్టేబుళ్ళు.

పోలీసులు పక్కన నిలబడి ఓ స్కూలు

పిల్లాడితో డోర్‌బెల్ కొట్టించారు. చాలాసే పటికి మత్తుమత్తుగా వచ్చి తలుపు తీశాడు పాండు. తలుపు తీస్తున్న శబ్దం విని ఆ పిల్లాణ్ణి పంపించేశారు. వాళ్ళు తలుపు ఎదురుగా కాకుండా కొంచెం పక్కగా నిల బడ్డారు. పాండు వ్యూ పాయింట్‌లోంచి ఎవరా అని చెక్ చేసుకుంటున్నట్లు పోలీసులకి అర్థమైపోయింది. రెండు క్షణాల తర్వాత పాండు తలుపు కొంచెం తీసి 'ఎవరు?' అన్నట్లు వంగి చూసి గబుక్కున మళ్ళీ తలుపు వేయబోయాడు. అందు కోసం కాచుక్కూర్చున్న పోలీసులు తలుపును ఒక్కతోపు తోసి లోనికి చొరబడ్డారు.

## కొత్తగాలి... 

**గొడుగుతో ఉంటే వానాకాలం**
**కూలరుతో ఉంటే ఎండాకాలం**
**స్వెట్టరుతో ఉంటే చలికాలం**
**లవరుతో ఉంటే పెళ్లయ్యేకాలం**

– సి. ఉమాబాల,
హైదరాబాద్

పాండుకి పాతికేళ్ళుంటాయి. రాత్రి కొట్టిన మందు నిషా ఇంకా దిగలేదు.

"ఏయ్.. ఏంటిది? ఎవరికోసం వచ్చారు, ఎందుకొచ్చారు?" అంటూ గింజుకున్నాడు పాండు.

"ఆ.. ఈ మహారాజుగారి కోసమే వచ్చాం... సన్మానం చేద్దామని" అన్నాడో కానిస్టేబుల్.

"నా దగ్గర పిస్టలుంది... కాల్చానంటే దెబ్బకి ఛస్తారు" అంటూ జేబులోకి చెయ్యి పెడుతోంటే చెంప ఛెళ్ళుమనిపించి పిస్టలు లాక్కుని తన జేబులో పెట్టుకున్నాడో కానిస్టేబుల్.

మొరాయిస్తున్న పాండుని కష్టమ్మీద స్టేషన్‌కు తీసికెళ్ళారు. ఈ లోపు అతను 'ఒక్క ఫోన్ చేసుకుంటాను' అని బ్రతిమాలినా వినిపించుకోలేదు.

పాండుని తీసుకొచ్చినట్లు చెప్పగానే బోసు నిమిషాల్లో స్టేషనుకు వచ్చేశాడు.

రెండు కోటింగులు అయ్యాక తానొక ఏజెంట్‌ని మాత్రమేనని, స్వయంగా ఏ దొంగతనం కానీ, హత్య కానీ ఇంతవరకూ చేయలేదని చెప్పాడు. ఈ రకమైన పనిలో చేరింది ఈ మధ్యేనని చెప్పాడు. ఇంకా కుళ్ళబొడిచిన తర్వాత "ఇందులో సూరి, గిరిల తప్పేంలేదు. వాళ్ళే నా జీవితాన్ని నిలబెట్టారు. వాళ్ళంటే నాకు పిచ్చి ప్రేమ" అంటూ ఏడ్పు లంకించుకున్నాడు పాండు.

"ఛ... ఊరుకో.. దొంగ నా కొడకా.. ఖూనీలు చేసే లఫంగిగాళ్ళమీద నీకు లవ్వొకటి.. తన్నేనంటే వెళ్ళి థార్ ఎడారిలో పడ్తావు జాగ్రత్త.. ఇది తప్ప నీకింకేం ఉద్యోగం దొరకలేదురా బద్మాష్.."

"ఏం దొరుకుతున్నయ్ సార్... ఉద్యోగాలు కూరగాయల్లెక్క అమ్ముతున్నరా?"

"బొక్కలిరగదంతారా.. అమ్మాబాబూ నానా కష్టాలూ పడి పెంచి పెద్దచేస్తే ఇలా తయారౌతార్రా బేవార్స్ కొడకా? నువ్వెళ్ళి జైల్లో ఊచలు లెక్కబెడ్తోంటే కన్నవాళ్ళకి కడుపు తరుక్కుపోదురా?"

"అందుకే వదలేయండి సార్... ఇంకెప్పుడూ ఇలాంటి పని చేయను..."

"నువ్వ్రా మారేది? థూ... నీ మొహాన ఉమ్మెయ్యా..."

పాండు తల వంచుకున్నాడు.

"ఎవ్రా నీకు పిస్టలిచ్చింది? దాంతోనే కాల్చి చంపుతాన్రోయ్..."

"హత్య చేసేవాళ్ళని కాదు సార్, చేయించేవాళ్ళని పట్టుకోండి... వాళ్ళిచ్చే డబ్బుకి కక్కుర్తిపడి మేమంతా ప్రాణాలమీదికి

తెచ్చుకుంటాం."

"ఇంకా వాగుతున్నావా? మిమ్మల్నం దర్నీ నడిరోడ్డుమీద ఉరితీయాలి. చదువూ సంధ్యా లేకుండా జులాయిగా తిరిగితే ఉద్యోగాలేం వస్తాయి? అదే ఖూనీలు చేస్తే... నిమిషాల్లో నోట్లు రాలిపడ్తాయి... శ్రమలేకుండా ఈజీ మనీ.. అంతే ఈజీగా పతనమవుతున్నామని తెలిసేసరికి నాశన మైపోతారు" అంటూ గొణిగాడు.

"టీవీ వాడన్నావు ఎవరు... ఏ ఛానల్లో పనిచేస్తాడు?" అడిగాడు బోసు.

"అతను కెమెరామన్ అని మాత్రమే తెలుసండీ.. దయచేసి కొట్టమాకండి..." అని గట్టిగా కాళ్ళు పట్టుకున్నాడు పాండు.

బోసు బాగా ఆలోచించి ఒక నిర్ణయా నికి వచ్చాడు.

"చూడు... నేను చెప్పినట్లు వింటే సరి... లేదంటే.. తల కిందికి, కాళ్ళు పైకి కట్టేస్తాం. వారం రోజులు తిండీ నీళ్ళా లేకుండా అలమటించాల్సి వస్తుంది. పైపెచ్చు లాఠీలు విరిగేలా కొట్టాల్సి వస్తుంది..." అన్నాడు చాలా సీరియస్‌గా పాండుతో.

పాండు అప్పటికే చావు తప్పి కన్ను లొట్టబోయిన చందంగా వున్నాడు. పోలీసు చిత్రహింసలంటే ఇంత ఘోరంగా ఉంటాయా... నరకం గురించి చెప్పి భయపెడతారు. కానీ అది కూడా ఇంత భయంకరంగా వుండదేమో అనుకున్నాడు. అందుకే మళ్ళీ వీరబాదుడు గురించి చెప్తోంటే హడలిపోయి "చెప్పండయ్యా... ఏం చెయ్యమంటే అది చేస్తాను..." అన్నాడు.

"సూరికి ఫోన్‌చేసి వివరాలు అడుగు... స్పీకర్ ఆన్‌చేసి మాట్లాడు... ఏమైనా కోడ్ భాషలో ఉప్పందించే ప్రయత్నం చేశావో... మళ్ళీ ఫ్రెష్‌గా కోటింగ్ స్టార్టవు తుంది" అన్నాడు బోసు.

పాండు హడలిపోయాడు.

"సార్... నన్ను నమ్మండయ్యా... అన్న నంబరేంటో నాకు తెలీదు... నేనెప్పుడూ చేయలేదు... తనే చేసి, ఎక్కడ కలవాలో చెప్తాడు... ఎప్పుడూ పబ్లిక్‌బూత్ నుండే కాల్ చేస్తాడు... తను ఎవరికీ దొరక్కూడదని అలా జాగ్రత్తపడ్డాడు..."

"హత్య జరిగాక నీకు ఫోన్ చేశాడా?"

"లేదు సార్..."

"సుమారు ఎన్నాళ్లకోసారి ఫోన్ చేస్తాడు?"

## కొత్తగాలి...

**న స్త్రీ**
**స్వాతంత్ర్యమర్హసి..?**
**పురుషాధిక్య సమాజంలో**
**స్త్రీ.. మగవాడి ఆస్తి మరి!**

– ఎస్. నాగేందర్‌నాథరావు,
ఇల్లెందు

"అలా లెక్కేం లేదు... తనకి నాతో ఎప్పుడు అవసరం పడితే అప్పుడు చేస్తాడు..."

"సరే... మళ్ళీ వాడు ఫోన్ చేసేదాకా మా ఆతిథ్యంలోనే వుండు..." అనేసి అవతలికి వెళ్లిపోయాడు బోసు.

పాండు ఫోను బోసు దగ్గరే వుంది. అందులో ఉన్న నంబర్లను ఎంక్వయిరీ చేయించాడు. పాండు చెప్పినట్లే సూరి, గిరి నంబర్లు అతని దగ్గరలేవు. పాండు ఫోనుకు చార్జింగ్ అయిపోకుండా పెడుతూ సూరి నుండి వచ్చే కాల్ కోసం ఎదురు చూడసాగాడు బోసు.

★ ★ ★

పండరి చెప్పిన తర్వాత భరద్వాజపై అనుమానం ఏర్పడినప్పటికీ పేరుప్రతిష్టలు ఉన్నవాడు కనుక నేరుగా అతన్ని ఇంటరాగేట్ చేయలేదు బోసు. బయోకెమికల్స్ పి.ఆర్.వో. బెనర్జీ ద్వారా సమాచారం రాబట్టేందుకు రఘుని పంపాడు. ఏ ఆధారమూ లేకుండా కేవలం అనుమానంతో వెళ్తే ప్రయోజనం లేకపోగా లేనిపోని సమస్యలు వస్తాయి..

బోసు పంపిన పోలీస్ ఇన్‌ఫార్మర్ రఘు భరద్వాజ బయోకెమికల్స్ పి.ఆర్.వో. బెనర్జీని పరిచయం చేసుకున్నాడు. తానెవరో, ఎందుకోసం వచ్చాడో ఎంత మాత్రం చెప్పకుండా అతనితో పని వుండి వచ్చి కలిసినట్లే నటించాడు. తన చెల్లెలు బి. ఫార్మసీ చేసిందని, ఆ కంపెనీలో కొంచెం మంచి పోస్టు ఏమైనా ఇప్పించమని, ఎవరికైనా సమర్పించాలి అంటే కొంత డబ్బు కూడా ఇచ్చుకుంటానని చాలా నమ్మకంగా చెప్పాడు.

బెనర్జీకి ఎక్కడా, ఎంత మాత్రం సందేహం రాలేదు. ఈలోపు రఘు అతన్ని బార్‌కి తీసికెళ్ళి తాగించి, వాగించడం మొదలుపెట్టాడు. ఏమాత్రం అనుమానం రాకుండా రామ్మోహన్ హత్యకు సంబంధించి భరద్వాజ హస్తం ఎంతవరకూ ఉంది... అతనేనా హంతకుడికి డబ్బు అందించింది అనే విషయం కనిపెట్టేందుకు రఘు ప్రయాసపడుతున్నాడు.

★ ★ ★

ఈలోపు ఊహించని విధంగా ఒక పబ్లిక్ ఫోన్నుంచి పాండు నంబర్‌కి ఫోనొచ్చింది.

"గిరి చేసిన కాల్ కనుక అయితే ఇన్‌ఫర్మేషన్ రాబట్టు... వాడికి ఏమాత్రం సందేహం రాకూడదు... జాగ్రత్త..." అని హెచ్చరించాడు బోసు.

మాట్లాడ్డంలో ఏమైనా తేడా వస్తే చితకబాదుతారని తెలుసు కనుక పాండు చాలా జాగ్రత్తగా వ్యవహరించాడు.

# మందు పాతరలు!



ప్రపంచంలో తరచుగా యుద్ధాలు జరిగే దేశాల్లో మందుపాతరలు ఉండటం సహజం. నేడు యుద్ధాలు జరిగే దేశాలు పాతిక పైనే ఉన్నాయి. వాటిలో మందుపాతరలు అధికంగా గల దేశాలేవో చూద్దాం. గత నలభై ఏళ్లుగా యుద్ధాలలో పాల్గొంటున్న సోమాలియా మందు పాతర్లలో ఐదోస్థానంలో ఉందట. 1964లో మొదటిసారి లాండ్‌మైన్‌ను అక్కడ ప్రయోగించారు. ప్రాంతీయ, అంతర్గత యుద్ధాలవల్ల ఆ దేశ ఆర్థిక వ్యవస్థ చితికిపోవడమేకాక, మందుపాతర్ల బారినపడి అమాయకులు అసువులు బాసారు. ఐక్యరాజ్య సమితి ప్రకారం మందుపాతర్లు ఆ దేశ ఆర్థిక, సామాజిక వ్యవస్థల్లో అనేక సమస్యల్ని తెచ్చిపెట్టాయి. ఆ దేశంలోని మందుపాతర్ల సంఖ్య పదిలక్షలు.




రెండో స్థానం మొజాంబిక్ దేశానిది. ఆఫ్రికాలోని అతి పేద దేశాల్లో ఒకటైన ఇక్కడ ముప్పై లక్షల మందుపాతర్లు ఉన్నాయి. పదిహేను దేశాలనుంచి వాటిని ఆ దేశం దిగుమతి చేసుకుంటోంది. ఆహారధాన్యాలను కూడా ఈ దేశం దిగుమతి చేసుకోవాల్సి వస్తోంది. నెలకు సగటున ఇరవై మంది పౌరులు మందుపాతర్ల మీద తెలియక కాళ్లుంచి మరణించడమో, వికలాంగులు కావడమో జరుగుతోంది.

మూడోస్థానం బోస్నియా దేశానిది. ముప్పై లక్షల మందుపాతర్లు 1992-95 మధ్య జరిగిన యుద్ధంలో ఈ దేశంలో ఉంచారు. నాలుగోస్థానం కువైత్ దేశానిది. యాభై లక్షల లాండ్ మైన్స్ ఈ దేశంలో ఉన్నాయి. 1990-91 మధ్య జరిగిన గల్ఫ్ యుద్ధంలో వీటిని అమర్చారు.

ఇక ప్రపంచంలో లాండ్‌మైన్స్ అత్యధికంగా గల దేశం కంబోడియా. ఎనభై లక్షల నుంచి ఒక కోటి మందుపాతరలు ఈ దేశంలో ఉండవచ్చని నిపుణుల అంచనా. ముప్పైఏళ్ల యుద్ధం మిగిల్చిన విషాదానికి గుర్తులుగా ఇవి ఇంకా ఉన్నాయి.

"ఎట్లున్నవు గిరన్నా?" అనడిగాడు.

"బాగున్నా... నీ గొంతేంటి అలా వుంది... ఎక్కడున్నావు... మందుకొట్టి పడుకున్నావా?"

"లేదన్నా... కొంచెం బీమారైన... చిన్న జ్వరం అంతే..."

"అలాగా... అన్నట్టు... రేపు నువ్వొకణ్ణి కలవాలి.. వివరాలు మళ్ళీ చెప్తాను..."

స్పీకర్ ఆన్‌లో వుంది.

పాండు సమాధానం ఏం చెప్పాలా అన్నట్టు భయంగా చూస్తోంటే బోసు "సరే" అనమని సైగ చేశాడు.

దాంతో "వస్తనన్నా..." అన్నాడు పాండు.

"సరే.. ఈ మాట అడగడానికే చేశాను... నీకు నేనంటే చాలా లవ్వు కదరా... అందుకే ముందు నిన్ను అడుగుతున్నా... నీకు ఒకవేళ ఇష్టం లేకపోతే మరెవర్నయినా అడుగుదామనుకున్నాను.. మరి... వుండనా.. నువ్వు రావడానికి ఏర్పాటు చేసి మళ్ళీ ఫోన్ చేస్తాను" అన్నాడు..

బోసు అసలు విషయం అడగమని షర్టు లాగి సైగ చేయడంతో కంగారుగా "అన్నన్నా.. ఫోన్ పెట్టేయకన్నా.. ఆ టీవీ వాడు... ఫోన్... చేశాడు... అదేం టీవీ అన్నా?" అన్నాడు పాండు గబగబా.

"వాడెందుకు ఫోన్ చేశాడురా?"

అన్నాడే తప్ప అవతల్నుంచి గిరి వివరం చెప్పలేదు.

"ఏమో... అన్న... రెండుసార్లు చేశాడు.. అంతా డిస్టబెన్స్‌గా వుంది... ఏం మాట్లాడిందీ అర్థం కాలా.. ఇంతకీ వాడు చేసేది ఏ టీవీలో అన్నా?" అనడిగాడు పాండు, చాలా జాగ్రత్తగా.. ఎంత మాత్రం అనుమానం రాకుండా.

"నీ మొహం... వాడు నీకెందుకు చేస్తాడు... నీ నంబరే వాడి దగ్గర లేదు.. ఇంకేదో రాంగ్ నంబర్ అయ్యుంటుంది" అనేసి ఫోన్ పెట్టేశాడు గిరి.

పాండు ఫోన్ పెట్టేశాక "అలాగట్రా వివరాలు అడిగేది... దొంగ వెధవా?" అంటూ తిట్టాడు బోసు.

"నీకు పుణ్యముంటుంది.... నన్ను నమ్ము సారూ.. అంత జాగ్రత్తగా అడిగాను కాబట్టి సరిపోయింది... లేదంటే అన్నకి అనుమానం వచ్చేస్తుంది... ఎలా అడిగినా ఆయన చెప్పడు సార్... తెలివిగా వుంటాడు" అన్నాడు పాండు.

పాండు ఫోను ద్వారా సూరి నుంచి సమాచారం సేకరించడం సాధ్యం కాదని తెలిశాక బోసుకు ఒక ఐడియా వచ్చింది. 'హైదరాబాద్‌లో ఉన్న ఛానల్స్ అన్నిటికీ పాండును తీసికెళ్ళి ఫొటోగ్రాఫర్లందర్నీ చూపిస్తే సరి గుర్తుపడ్తాడు... దాంతో హంతకుల ఆచూకీ పట్టుకోవడం ఈజీ అయిపోతుంది' అనిపించింది. రామ్మోహన్ హత్య కేసులో ఇన్‌వాల్వ్ అయిన ఫొటోగ్రాఫర్ని గుర్తుపట్టి ఎవరో చెప్తే పాండుని వదిలేస్తామని ఆశ చూపించారు. మళ్ళీ నేరకలాపాల్లో కనుక తల దూర్చకపోతే పూర్తిగా విడిచిపెట్టేస్తామని బోసు నిజాయితీగా చెప్పాడు. దాంతో పాండులో ఆశ కలిగింది. తెలిసి కూడా గుర్తుపట్టనట్లు నటిస్తే చంపేస్తారని కూడా తెలుసు. అందుకే వారు చెప్పినట్లు సివిల్ డ్రెస్‌లో ఉన్న కానిస్టేబుళ్ళతోబాటు వెళ్ళి ఛానళ్ళ దగ్గర మాటేయసాగారు.

మూడు ప్రముఖ ఛానళ్ళలో అన్వేషించడం పూర్తయ్యాక టీవీ త్రి ఆఫీసుకు వెళ్ళారు. అక్కడ మహేష్ కనిపించేసరికి పాండు ఉత్సాహంగా "వాడేనండీ... వాడే.." అన్నాడు గొంతు బాగా తగ్గించి.

పాండు గుర్తుపట్టగానే కానిస్టేబుళ్ళు అక్కడేమీ హడావిడి చేయలేదు. మహేష్ సెక్యూరిటీలో కార్డ్ పంచ్ చేసి లోపలికి వెళ్ళిపోయాక అక్కడికి వెళ్ళి "ఇప్పుడెళ్ళిన కెమెరామన్ ఇక్కడ పనిచేస్తారాండీ... లేక ఫ్రీలాన్సరా?" అనడిగాడు వెంకట్రావ్ అనే కాన్‌స్టేబుల్.

"ఆ వివరాలు మీకెందుకు?" సీరియస్‌గా అడిగాడు సెక్యూరిటీలో ఉన్న వ్యక్తి.

"అయ్యో... అంత విసుగెందుకండీ? అతన్ని మా పిన్నిగారమ్మాయికి చేసుకుందామని... పిల్లాడు ముచ్చటగా వున్నాడు.. ఇక్కడ ఉద్యోగం అయితే ధోకా వుండదు కదాని" అన్నాడు వెంకట్రావు.

అవసరమైన విషయాలు రాబట్టడానికి పోలీసులు ఎన్నోసార్లు ఇలాంటి చిన్నచిన్న నాటకాలు ఆడటం కామనే.

"నాయనా... అతనిక్కడే జాబ్ చేస్తాడు గానీ.. ఆల్‌రెడీ పెళ్ళయిపోయింది... కొడుకు కూడా పుట్టినట్లున్నాడు" అని పుసుక్కున నవ్వేడు సెక్యూరిటీ అతను.

వెంకట్రావు తనక్కావలసిన సమాచారం దొరకడంతో "అయ్యో... పెళ్ళయిపోయిందా?" అని మరో వాక్యంతో నటన ఆపేసి వెనక్కి వచ్చాడు.

ఇవతలికి వచ్చాక "వాడు ఇక్కడే ఉద్యోగం వెలగబెడ్తున్నాడట.. సార్‌కి చెప్పి.. ఎలా డీల్ చేయమంటే అలా చేద్దాం" అన్నాడు రెండో కాన్‌స్టేబుల్‌తో.

★ ★ ★

పాండుని మరోసారి సరిగ్గా చూడమని

అతనే అని తేల్చుకున్న తర్వాత బోసు రంగంలోకి దిగాడు.

అతని పేరు మహేష్. టీవీ త్రీలో కెమెరామన్. మొదట ఎంతగానో గింజుకున్నాడు.

"అసలు రామ్మోహన్ ఎవరు... తనకు, అతనికి సంబంధం ఏమిటి? తాను హత్య చేయించడమేంటి? నా గురించి మీరేం అనుకుంటున్నారు... మా ప్రెస్‌వాళ్ళు తల్చుకుంటే మీ పోలీస్ జులుం గురించి ఒక స్టోరీ చేసి పొద్దుట్నుంచీ సాయంత్రం దాకా ప్రసారం చేస్తారు..." అంటూ డాంబికాలు పలికాడు.

బోసు అతడి మాటలను ఖాతరు చేయలేదు. పోలీస్ పవరేంటో తెలియజేశాడు. రెండుదఫాలుగా పోలీసు దెబ్బలు రుచి చూశాక మహేష్ దారికొచ్చి జరిగిన విషయం ఇలా చెప్పుకొచ్చాడు.




మహేష్ భార్య నెలలు నిండి పురిటికి వెళ్ళగా అతను మాత్రమే వుంటున్నాడు. అతని ఫ్లాట్‌కి ఎదురుగా వుండే ఫ్లాట్‌లో పండరి వుంటుంది. పండరి ఎదురైనప్పుడల్లా మహేష్ మనసు లాగేస్తుంది. అతని చూపుల్ని ఆమె వ్యతిరేకించకపోగా కవ్విస్తున్నట్లుగా వుంటుంది. సాధారణంగా పరాయి మగవాడు తనను గమనించడం ఆడవాళ్ళకు నచ్చదు. మొహం చిట్లిస్తారు. కానీ పండరి అతని చూపుల్ని కాంప్లిమెంట్లుగా తీసుకుంటున్నట్లు అతనికి అర్థమైపోయింది. ఆమె గ్రీన్ సిగ్నల్ ఇస్తోందని, తాను ఇంకాస్త ఎడ్వాన్సవ్వొచ్చని గ్రహించాడు మహేష్.

"వైఫ్ డెలివరీకి వెళ్ళినట్లుంది.. ఎప్పుడొస్తుంది? "

"ఉయ్యాల కూడా అయ్యాకే"

"భోజనమైందా? "

"మెస్‌లో తినాలి"

"రోజూ బయట తింటే ఆరోగ్యం పాడవదూ? "

"సర్లేగానీ ఈ డ్రెస్‌లో ఎంత బాగున్నావో తెల్సా? " అన్నాడు.

పండరి నవ్వి వెనుతిరిగింది.

పండరి తన ఫ్లాటు తాళం తీసి లోపలికెళ్ళి డ్రెస్ మార్చుకుని హాల్లో టీవీ చూస్తూ కూర్చుంది.

కాసేపటికి తలుపును మెల్లగా తట్టిన శబ్దమయ్యింది. తలుపు సగం తెరిచి, కొంతవరకూ దగ్గరకు వేసి ఉండటాన పండరి కూర్చున్న చోటు నుంచి లేవకుండానే "ఎవరది? " అంది.

"నేనే" అంటూ లోపలికొచ్చి తలుపు ఇంకొంచెం దగ్గరగా వేసి "టీవీ చూస్తున్నావా? " అన్నాడు.

"లేదు... టీవీ నన్ను చూస్తోంది" అని నవ్వుతూ పండరి లేచి నిలబడింది.

"ఏమీ తోచడంలేదు... కొంచెం టీ తాగాలనిపిస్తోంది. వెళ్ళి తాగొద్దామంటే బద్ధకం అనిపించింది."

"ఈ నసుగుడెందుకు? టీ కావాలా? ఇవ్వనా!" అంది పండరి.

"రామ్మోహన్‌గారు ఇప్పుడు రారు కదా..." అన్నాడు మహేష్.

"వచ్చినా చాయ్ పైసలడగరులే" అని నవ్వి పండరి వంటింట్లోకి వెళ్ళింది.

మహేష్‌కి ఆమెతోబాటు వంటింట్లోకి

వెళ్లాలని ఉన్నా, భయంకొద్దీ ధైర్యం చేయలేకపోయాడు. పండరి కేవలం ఒంటరి ఆడదైతే అసలు ఇన్నాళ్ళు గుంజాటన పడేవాడు కాదు, వెనకాడేవాడు కాదు. కానీ రామ్మోహన్ సామాన్యుడు కాదాయె. చాలా పెద్ద వ్యాపారి. పేరు ప్రతిష్టలు ఉన్నవాడు. ఈ పండరి ఆయన మనిషి కావడం మహేష్‌ని భయపెడ్తోంది.

పండరి రెండు నిమిషాల్లో టీ తెచ్చింది. కప్పు అందుకుని టీపాయ్ మీద పెట్టి "కొంచెం మంచినీళ్ళు" అన్నాడు.

ఆమె లోనికి వెళ్తోంటే, వస్తోంటే ఆమెనే చూడసాగాడు.

పండరి మంచినీళ్ళ గ్లాసు అందించి 'ఏమిటన్నట్టు' కళ్ళెగరేసింది.

"ఒక్కదానికీ బోర్ కొట్టదా? " అన్నాడు.

పండరి జవాబు చెప్పలేదు.

"పెళ్ళెందుకు చేసుకోలేదు? " అన్నాడు.

పండరి దానికీ బదులు చెప్పలేదు.

మహేష్‌కి ఇంకాసేపు పండరి దగ్గరే ఉండాలని, దగ్గరితనం పెంచుకోవాలని ఉన్నా... రామ్మోహన్ మీదున్న భయంతో 'థ్యాంక్స్' చెప్పి వెళ్ళిపోయాడు.

కానీ అవకాశం దొరికినప్పుడల్లా ఆమెని తినేసేట్టు చూసేవాడు.

ఆవేళ మహేష్ హాల్లో కూర్చుని పండరి ఆఫీసు నుండి ఎప్పుడొస్తుందా అని ఎదురు చూస్తున్నాడు. ఓ పావుగంటకి ఆమె వర్షంలో తడిసి ముద్దయిపోయి వచ్చింది.

"అరే... బాగా తడిసిపోయావే... ఆటో దొరకలేదా? " అన్నాడు మహేష్.

"ఆ.. చాలా దూరం దొరకలేదు" అంది.

తడిబట్టల్లో ఆమెని చూస్తోంటే మహేష్‌కి పిచ్చెక్కిపోయినట్లుగా ఉంది.

పండరి తాళం తీసి లోపలికి వెళ్ళి తల తుడుచుకోసాగింది.

మహేష్ వెళ్ళి తలుపు కొట్టాడు.

పండరి తలుపు తీసి, ఏమీ మాట్లాడకుండా హాల్లోనే సోఫాలో కూర్చుంది.

## ఏప్రిల్ - 2013
## చతుర ప్రవేశిక విజేతలు వీరే!

డ్రాలో ఎంపికైన ఈ ఐదుగురికీ త్వరలో బహుమతులు అందుతాయి.



1. **గుర్రాల దివ్యతేజ** - మారుతీనగర్, గుంటూరు
2. **డి. రాధిక** - షేక్ పేట, హైదరాబాద్
3. **బి. నేహారెడ్డి** - అక్కాయపల్లి, కడప జిల్లా
4. **పక్కి శ్రీదేవి** - మెట్టపల్లి, విజయనగరం జిల్లా
5. **బి. శివనారాయణ శ్రీనివాసరావు** - చందానగర్, హైదరాబాద్

### సరైన జవాబులు

| | |
|---|---|
| 1. నరసింహారావు | 6. భానుమతి |
| 2. లాలిత్య | 7. నారాయణరావు |
| 3. కనిమెట్ట | 8. చార్లీచాప్లిన్ |
| 4. నరసయ్య | 9. కన్నడభాష |
| 5. చంద్రం | 10. మేథ్యూరికార్డ్ |

"లోపలికి రమ్మనవా? " అన్నాడు మహేష్.

"పిలిస్తే వచ్చావా? "

"నీలో అంత చమత్కారముంది... పిలవకుండానే పిలుస్తావు..."

మహేష్ తలుపు బోల్టు పెట్టాడు. పండరి 'అదేంటి' అనలేదు. ఆమె అడ్డుకునేదైతే ముందే చేసేదాపని. కానీ... చాలా రోజులుగా అతను కళ్ళతో తినేసేలా చూస్తున్నా... వక్రార్థం వచ్చేలా వంకరగా

మాట్లాడినా ఒక్కసారీ వ్యతిరేకించలేదు. చాలారోజులుగా మహేష్ శ్రుతి మించుతూనే ఉన్నాడు. రాగాన పడ్తున్నాడని ఆమెకి తెలుస్తూనే ఉంది. అతని ప్రవర్తనను నిందించకపోగా పరోక్షంగా ప్రోత్సహిస్తున్నట్లుగా ఉంది. ఇక ఆవేళ పండరిని తడిబట్టల్లో చూడగానే అతగాడికి మతిపోయింది. రామ్మోహన్ గురించిన భయాలు లెక్కచేయకుండా తెగించి వచ్చాడు.

"పండూ..." అన్నాడు.

పండరి మౌనంగా చూసింది.

"ఒక్కమాట చెప్పు..."

"ఏంటి?"

**కొత్తగాలి...**

**కడలిని చూసి**
**కల్లోలం అనుకోకు!**
**పడిలేచే కెరటాలే**
**ప్రబోధాలనుకో!!**

– వెల్మల రాంరెడ్డి,
పూడూరు, కరీంనగర్ జిల్లా

"ఇప్పుడు ఆ రామ్మోహన్ వస్తాడా?" ఆమె సోఫాలో కూర్చోగా, కింద మోకాళ్ళ మీద కూర్చుని ఆమె ఒళ్ళో వాలిపోయి అడిగాడు.

"ఏం... ఎందుకు?"

"చెప్పు... ప్లీజ్..."

"వస్తాడు... వెళ్ళిపోతావా?"

"ఇవాళ... నిన్ను వదిలి వెళ్ళే సమస్యే లేదు... తాళం పెట్టేసి నా ఫ్లాట్‌లోకి రా... రాడంటే... ఇక్కడే..."

"ఏంటీ?"

"ప్లీజ్... నన్ను చంపకు... ఎన్ని రోజుల్నించి నీకోసం తపిస్తున్నానో తెల్సా? వస్తాడా రాడా త్వరగా చెప్పు"

"రాడు... ఊళ్ళో లేడు..."

అతడు ఎగిరి గంతేసినంత పనిచేశాడు.

"నువ్వంటే పిచ్చిప్రేమ. ప్యార్.. మొహబ్బత్.. ఇష్క్.. లవ్.. ఇష్టం.. ప్రేమ.."

"ఈ కబుర్లకేమొచ్చెలే... వైఫ్ లేదు కనుక టెంప్ట్ అయి వచ్చావు. రేపు ఆవిడొచ్చాక?"

"అలా అనకు. నీకోసం పడిచస్తున్నానంటే నమ్ము. ఇంతకుముందు ఏనాడన్నా ఇంట్లో ఉండేవాణ్ణా... ఇప్పుడు నీకోసం పడిగాపులు కాస్తున్నా... నువ్వెక్కడ కాదంటావో అని భయపడి చచ్చాను... నీకూ నేనిష్టమని అర్థమైంది.. కానీ.. ఆ రామ్మోహన్ బ్రహ్మరాక్షసుడిలా బెంబేలెత్తిస్తున్నాడు" అంటూనే పండరిని చేరాడు.

పండరి మహేష్‌ను విడిపించుకుని దూరంగా జరిగి "వద్దు వెళ్ళిపో" అంది.

"ఇది చాలా అన్యాయం... ఇక్కడిదాకా తీసుకొచ్చి... ఇప్పుడొద్దంటే..."

"నేనేం తీసుకురాలేదు"

"నేనే వచ్చాన్లే... నీకు నిజంగా ఇష్టం లేకపోతే... ఇంతదూరం రానిస్తావా?" అంటూ చేయందుకున్నాడు.

పండరి చేయి విడిపించుకుని దూరం జరిగింది.

"ఏమైంది... నేనంటే నీకూ ఇష్టమని నాకెప్పుడో అర్థమైంది. ఇప్పుడు ఎందుకు వద్దంటున్నావో చెప్పు"

"చెప్పాలా... సిగ్గు విడిచి చెప్పాలా?" కోపంగా అడిగింది పండరి.

మహేష్ ఆశ్చర్యంగా చూశాడు. ఉన్నట్టుండి ఆమె మూడ్ అంతలా ఎందుకు మారిందో అర్థం కాలేదు.

"ఇవాళ నీకు అవసరం కలిగింది. కోరిక పుట్టింది కాబట్టి నాకోసం వచ్చావు. రేపు నీ వైఫ్ వచ్చాక ఇటువైపు తొంగి కూడా చూడవు. అప్పుడు నాకు నీమీద మన

# దాతృత్వ ప్రోత్సాహకాలు!




దానమంటే ఎలాంటి ప్రతిఫలం ఆశించకుండా చేసేది. కాని చూస్తూ చూస్తూ వేరొకరికి ఉచితంగా ఏదీ ఇవ్వబుద్ధి కాదు. అందుకే దానాన్ని కోరే కొన్ని సంస్థలు ఏదైనా తిరిగి ఇస్తుంటాయి. అలా ప్రతిగా ఇచ్చేవి విచిత్రమైనవి అయితే ఎక్కువ మంది దానం చేయడానికి ముందుకు వస్తారనేది ఓ కాన్సెప్ట్. జపాన్ దేశంలో సెప్టెంబరు 2011 ఆఖరివారంలో బ్రెస్ట్‌కేన్సర్ నివారణకు బీదలకు ఉచితంగా వైద్యం చేయించే ఓ సంస్థ దాతలకు వక్షోజాలతో ఆడుకునే అవకాశాన్ని బదులుగా ఇచ్చింది. టోక్యోలోని షింజోకు అనే చోట దానం చేసిన వారి చేతుల మీద ద్రవం చల్లి స్టెరిలైజ్ చేస్తారు. తర్వాత అక్కడ ఉన్న పదిమంది యువతుల్లోని ఒకరి వక్షోజాలను ఓసారి పట్టుకోవచ్చు! ఈ మహిళలంతా అడల్ట్ వీడియో చిత్రాల్లో నటించే నటీమణులు. వీరిని జపనీస్ భాషలో 'ఒపాయ్ మోమి' అంటారు. బ్రెస్ట్ కేన్సర్ నివారణ సంస్థకు ఈ ఆలోచనను ఇచ్చింది ఓ స్థానిక బార్ యజమాని. ఇందువల్ల వారి లక్ష్యాన్ని మించిన దానాలు ఆ వారం రోజుల్లో అందాయి.

చతుర ప్రపంచం

మరికొన్ని సంస్థలు దాతలకు ఇచ్చే వస్తువులు నవ్వు పుట్టించేవిగా ఉంటాయి. జర్మనీలోని బ్లడ్ కేన్సర్ రీసెర్చ్ సంస్థ దాతలకు ఓ అందమైన పాపులర్ నటి చేత ఓ కిలో ఉప్పు పాకెట్‌ను ఇప్పించింది. అమెరికాలోని ఓ విద్యాసంస్థ ఏర్పాటు చేసిన చారిటీ షోకు దానాలు ఇచ్చి వచ్చినవారికి తలా ఒక టమోటో ఇచ్చారు. వారు స్టేజి మీద నటించే ఏ నటుల మీదకైనా దాన్ని విసరవచ్చు. ఫ్రాన్స్‌లోని ఓ అనాధాశ్రమానికి ఎవరు దానం చేసినా అక్కడి ముద్దులొలికే ముగ్గురు చిన్నారుల చేత దాతలకు ముద్దు పెట్టిస్తారు. ఇలాగే కొవ్వొత్తులు, లేడీస్ అండర్‌వేర్, సబ్బులులాంటి వస్తువులను కూడా దాతలకు బహుమతిగా ఇస్తుంటారు. వారు దానం చేసినట్లుగా సర్టిఫికెట్‌ను చాలా సంస్థలు ఇస్తుంటాయి. అయితే ఎలాంటి ప్రతిఫలం ఆశించకుండా చేసే దానమే మంచిదనేది మన సంప్రదాయం.

సైతే.. నువ్వు కావాలనిపిస్తే దొరకవు. నేను బాధపడినా, ఏడ్చినా, డిప్రెసయినా.. ఆఖరికి ప్రాణం పోయినా నువ్వు రావు. ఎందుకంటే నువ్వు ఆమె భర్తవి. నాకేమవుతావు? ఏమీ కావు... పిచ్చిదానిలా ఒళ్ళప్పగించి... తర్వాత నువ్వెవరో తెలియనట్లే ఉండాలి..." అంది పండరి. ఆమె ప్రతి పదాన్నీ నొక్కి కటువుగా మాట్లాడుతున్నాను అనుకుంది... కానీ... పైపై డాంబికం తప్పిస్తే లోపల పేరుకున్నదంతా డొల్లతనమే అని స్పష్టమౌతోంది.

"లేదు పండూ... నిన్నెప్పటికీ వదల్ను, నమ్ము"

"ఈ మాటలకేమొచ్చె... మగవాళ్ళంతా ఒకటే... ఇక నువ్వెళ్ళు"

"ఊహూ... ఆగినన్ని రోజులు ఆగాను... ఇక నావల్ల కాదు..."

"చాల్లే ఫో... రామ్మోహన్ సార్ని నమ్మాను... ఏమైంది... ఆయనకిష్టమైతే రావడం... లేదంటే లేదు... అంతా ఆయనిష్టం... వస్తే ఖుషీ జేయాలి... లేకుంటే గమ్మునుండాలి..."

"అందరూ ఒక్కలానే ఉంటారని ఎందుకనుకుంటున్నావు? హనుమంతుడిలా

గుండె చీల్చి చూపే శక్తి ఉంటే చూపించే వాణ్ణి..."

"ఇవన్నీ మాయమాటలు..." అంటూ కన్నీళ్ళు పెట్టుకుంది పండరి.

"అరే, ఎందుకేడుస్తున్నావు?" అన్నాడు మహేష్ కంగారుగా.

"చెప్పనా.. సిగ్గువిడిచి చెప్పనా? ! మీకు కోరిక కలిగితే నాలాంటిదానికి వల వేస్తారు... లేదంటే డబ్బులిచ్చి కొనుక్కుంటారు... మేమలా చేయగలమా?" అని పండరి అడుగుతుంటే మహేష్‌కి బుర్ర తిరిగినంత పనయింది.

"జీర్ణించుకోలేకపోతున్నావు కదూ... నిజాలెప్పుడూ కటువుగానే ఉంటాయి... ఒక్కోరోజు... ఒంటరితనంతో చచ్చిపోతాను... అలాంటప్పుడు రామ్మోహన్ సార్ రానే రాడు... ఫోన్లు చేసినా రాడు... ఆయన్నాకోసం ఎందుకొస్తాడు... తనకు అవసరమైతే వస్తాడు..."

ఈసారి మహేష్ హృదయం ద్రవించింది. తాను స్త్రీననే వెరపు లేకుండా... ఏ ముసుగులూ లేకుండా చెప్పడంతో పండరి నిజాయితీ నచ్చింది. ఆమె ఆవేదన అర్థమైంది. వీళ్ళకీ కోరికలున్నా... ఎవరితో చెప్పుకుంటారు? చెప్తే సిగ్గులేని మనిషని నిందిస్తారే కానీ, అర్థం చేసుకునేంత సహృదయం ఉంటుందా? కోరిక అనేది స్త్రీకైనా, పురుషుడికైనా ఒకటే కదా! మరి.... అంత తీక్షణమైన కోరికని వీళ్ళు భయంతో అణచేసుకుంటున్నారు. ఇలా పండరిలా బయటకు చెప్పగలిగే సాహసం ఎందరికుంటుందని అనుకున్నాడు.

"నిన్ను నమ్మించడంకోసం పెళ్ళి చేసుకోనా?" అన్నాడు.

"గుట్టుచప్పుడు కాకుండా దండలు మార్చుకోడమా? దొంగ పెళ్ళా?"

"అలా వక్ర భాష్యాలివ్వొద్దు... రెండో పెళ్ళి చట్టరీత్యా నేరం కనుక మా ఆవిడకి విడాకులివ్వాలి... కానీ... పాపం... తన తప్పేం లేకుండా విడాకులివ్వడం అన్యాయం... అందునా ఇప్పుడు ప్రెగ్నెంట్‌గా కూడా ఉంది. కనుక గుళ్ళోపెళ్ళి చేసుకుందాం"

"దానికేం వ్యాల్యూ ఉంది? !"

"చట్ట ప్రకారం కాకున్నా... సమాజంలో ఉంటుందిగా... రామ్మోహన్ నీతో కేవలం చాటుమాటుగానే ఉంటాడు. నేనలా కాదు, పెళ్ళామని చెప్తాను"

"నలుగురిలో తలెత్తుకు తిరిగే జీవితం నాకిస్తానన్నావు. రామ్మోహన్ సార్ డబ్బు ఇస్తాడేగానీ అంతా రహస్యమే, దొంగబతుకే... పైగా పిల్లల్ని కనకూడదట..." అలా కబుర్లు కలబోసుకుని ఇద్దరూ దగ్గరయ్యారు. అలా మొదలైన మహేష్ పండరిల సంబంధం దినదిన ప్రవర్ధమానం కాసాగింది. క్రమంగా మహేష్‌కి రామ్మోహన్‌పట్ల కోపం, ద్వేషం పెరగసాగాయి. వచ్చి పండరితో గడిపి వెళ్ళాడని తల్చుకుంటే చాలు హృదయం భగ్గుమంటోంది. తాను సొంతం చేసుకున్న ఆస్తిని అతడు కాజేస్తున్నట్లుగా ఉంది.

ఆవేళ తీక్షణంగా "వాణ్ణిక రావొద్దని చెప్పెయ్" అన్నాడు.

"ఈ ఫ్లాట్ ఆయనిచ్చిందే... కొంచెం తెలివిగా చెప్పినట్లు చెప్తాను"

★ ★ ★

ఆ ఆదివారం రామ్మోహన్ రాడని చెప్పడంతో పండరి ఫ్లాట్‌లోకి వెళ్ళాడు మహేష్. అనుకోకుండా రామ్మోహన్ రావడంతో ఇద్దరూ కంగారుపడ్డారు. ఎంత నటించినా అతను విషయం బాగానే గ్రహించాడు. కొన్నాళ్ళు కోల్డ్‌వార్ సాగింది. ఆపైన 'నువ్వింత నీతిలేనిదానివనుకోలేదు' అని అతను నిందించడం, పండరి తాను గొప్ప సత్యమంతురాలినని రెట్టించి చెప్పుకోవడం, ఎడమొహం, నిందోక్తులు, బెదిరిం

పులులాంటివెన్నో జరిగాయి. ఆవేళ మహేష్ రాగానే "నన్ను పెళ్ళి చేస్కుంటావా లేదా? రామ్మోహన్ సార్లాగే వచ్చెళ్తుంటావా? నిజం చెప్పు" అంది.

"నీకెన్నోసార్లు చెప్పా... మా ఆవిణ్ణి ఒప్పించి, నాదాన్ని చేసుకుంటానని. నువ్వు నా పెళ్ళాంలా చెలామణీ అవుతావు"

"అదే నే కోరుకునేది... ఈ సీక్రెట్ రిలేషన్‌షిప్ అసహ్యంగా ఉంది. పైగా నాకు పిల్లల్ని కనాలని ఆశ... పెళ్ళి లేకుండా ప్రెగ్నెంటైతే... లోకం ఊరుకుంటుందా? తండ్రి ఎవరంటే ఏం చెప్పాలి? నన్నెక్కడికైనా తీసికెళ్ళిపో... నాకీ ఫ్లాటు., ఉద్యోగం ఏమీ అక్కర్లేదు... వెళ్ళిపోదాం..." అంటూ ఏడ్చింది.

"డిగ్రీ కూడా పాసవని నీ ఫేసుకి ఇంత జీతం వస్తుందా? పీజీలు చేసినవాళ్ళకే గతి లేదు. అసలు ఫ్లాటెందుకు వదులుకోవాలి? తెలివితక్కువ నిర్ణయాలొద్దు నాకో బ్రహ్మాండమైన ఆలోచనొచ్చింది.. ఎర్రన్న.. అదే.. భరద్వాజ ఉన్నాడుగా.."

పండరి మాట్లాడబోతే అడ్డొచ్చి "అరె... అండర్ గ్రాడ్యుయేటూ, నువ్వు మాట్లాడకు... ఇవతల మాస్టర్స్ డిగ్రీ అని మర్చిపోకు... నిన్ననే ఫ్లాష్‌లైట్ వెలిగింది. స్క్రీన్‌ప్లే అంతా సిద్ధమైంది... ఎంటైర్ స్టోరీ, డైరెక్షన్ నాదే.. లేటెస్ట్... అండ్ హాటెస్ట్ న్యూస్.. డోంట్ గో అవే... టీవీ త్రీ..." అన్నాడు మహేష్ యాంకర్లా పోజుపెట్టి.

ఆమెకి అర్థం కాకపోవడంతో "భరద్వాజకి చెందాల్సిన గ్రనైట్ భూమిని రామోహ్మాన్ కొట్టేశాడుగా... ఆ ముక్క భరద్వాజ చెవిన వేశాను... తన్ని తగలేస్తాడో, ఏకంగా చంపేస్తాడో చూద్దాం..." అన్నాడు.

పండరి కుతూహలం పట్టలేక అడగ్గా "మీ ఆడవాళ్ళు దిక్కుమాలిన సీరియల్స్‌లో 'తలుపు కొట్టిందెవరు?', 'నీళ్ళలో దూకిన ఆమె చస్తుందా, బతుకుతుందా?' లాంటి బోడి ట్విస్టులకోసం సంవత్సరాల తరబడి చూస్తారుగానీ జీవితంలో మాత్రం కాస్తంత సస్పెన్స్‌ను కూడా భరించలేరు. ఏం లేదుగానీ, భరద్వాజ మాదిరిగా రామోహ్మాన్ చేతిలో మోసపోయినవాళ్ళు ఇంకో ఇద్దరు తగిలారు. వాళ్ళందర్నీ రెచ్చ

## ప్రతీకారమంటే కల్యాణమా?

తన డెబ్బైమూడో ఏట ఫ్రాన్స్‌లో ఉన్నప్పుడు బెంజమిన్ ఫ్రాంక్లిన్ పొరుగునే ఉన్న ఆన్‌కాథరిన్‌ను చూసి ఆకర్షితుడయ్యాడు. ఫ్రెంచ్ దేశపు ప్రముఖ ఆలోచనాపరుడైన భర్త హెల్వేషియస్‌ను కోల్పోయి ఆవిడ ఒంట



రిగా జీవిస్తోంది. తనను పెళ్లి చేసుకోవాల్సిందిగా బెంజమిన్ ఆమెను కోరాడు. చనిపోయిన భర్తపట్ల ఆమెకు ప్రగాఢమైన ప్రేమ, గౌరవం ఉండటంతో ఆమె బెంజమిన్ విజ్ఞప్తిని తిరస్కరించింది.

ఆమె గత స్మృతులే తమ ప్రేమకు ఇబ్బందికరంగా పరిణమించాయని భావించిన బెంజమిన్ ఆమెతో 'నిన్నరాత్రి నాకో అద్భుతమైన కల వచ్చింది. అందులో నేను స్వర్గానికి వెళ్లాను. అక్కడ మీ భర్త హెల్వేషియస్ మరో దేవకన్యను వివాహమాడి సంతోషంగా గడుపుతున్నాడు. అందువల్ల దానికి ప్రతీకారం తీర్చుకునేందుకు మనం కూడా ఇక్కడ వివాహం చేసుకుని సంతోషంగా గడుపుదాం. అందుకే మన పెళ్లి గురించి మరోసారి ఆలోచించాల్సిందిగా మిమ్మల్ని అభ్యర్థిస్తున్నాను' అన్నాడు.

ఆయన మాటల చాతుర్యానికి ఆన్ కాథరిన్ ఫక్కున నవ్వింది.

గొట్టి వచ్చాను. అంతా కలిసి రామ్మోహన్ని చంపడానికి ప్లానేస్తున్నారు... మనకిక వాడి నస ఉండదు. సరేగానీ, ఈ సంగతి ఎక్కడా లీక్ చేయకు. చేశావంటే మనిద్దర మూ ఊచలు లెక్కపెట్టాల్సి వస్తుంది"

"నిజంగా చంపేస్తారా? పాపం కదా. ఆయనొకలా నాకు చాలా మేలు చేశాడు"

"ఓసినీ... నువ్వు తక్కువదానివి కాదే.. ఏంటీ, ఆ ముసలాడితోనే ఉంటావా... సరే, ఇంకెప్పుడూ నీవంక తొంగి చూడను"

"ఒద్దొద్దు... ఆయన్తో ఉండాలని అస్స ల్లేదు... నీతో చాలాసార్లు చెప్పాను... అంతా చాటుమాటు వ్యవహారమే... ఎక్కడా నా మనిషని చెప్పుకోడానికి లేదు... పిల్లల్ని కనడానికి వీల్లేదు... ఇంతోటి భాగ్యానికి సొంత పెళ్ళాంకంటే ఎక్కువ నిజాయితీ ఒలకపోయాలి... నీకు చెప్తే లోకువౌతానని చెప్పడంలేదు కానీ, నీతో ఉంటున్నానని అనుమానం వచ్చాక చావగొడుతున్నాడు" అంది పండరి కన్నీళ్ళు పెట్టుకుని.

"అంతోటి దుష్టుడిమీద దయ కురిపిస్తు న్నావా? " వెక్కిరింతగా అన్నాడు.

"ఏమైనా, నాకు చాలా ఇచ్చాడు. ఆ కృతజ్ఞత... అంతే..."

"సర్లే... నువ్వు కొన్నాళ్ళు ఓపికపట్టు... ఆ ముసలాడితో జాగ్రత్తగా మసలుకో... కర్ర విరక్కుండా పాము చచ్చే ఏర్పాట్లేవో నేను చేస్తాను"

★ ★ ★

మహేష్ చకచకా పావులు కదిపాడు. పాండు గురించి తెలిసి కలిశాడు. పాండు మహేష్‌ను నమ్మలేదు. తన కూపీ లాగ డానికి ఇదో మిష అనుకుని "చాల్లే సారూ... నాకేం తెలుస్తయ్... రౌడీ గూండాలను పోయి కలువు..." అన్నాడు.

మహేష్ ఓపిగ్గా మాట్లాడాడు. బాగా తాగించాడు. చివరికి సూరి, గిరిల గురించి పాండు చెప్పాడు. వాళ్ళయితే పకడ్బందీగా చేస్తారని, నరమానవులకు అంతుపట్టదని చెప్పి వాళ్ళ అడ్రెస్ ఇచ్చాడు. మహేష్ అతన్నే డీల్ కుదిర్చి పెట్టమని అడిగాడు.

'డబ్బు ఖర్చయినా ఫరవాలేదు. ఇకపై ముసలాడి బెడద ఉండదు. పండరి పూర్తిగా తన సొత్తవుతుంది. ఆ ముస లోడు బోల్డన్ని నగలిచ్చాడు. డబ్బూ బాగానే కమాయించింది. నలభైకి దగ్గరప డుతోంది. ఇంక దానికేం పిల్లలు పుడ్తారు? రేపా లగ్జరీ ఫ్లాట్ కూడా తనకే మిగుల్తుంది. పిల్లాపాపా లేనప్పుడు అది మాత్రం అవన్నీ ఏం చేసుకుంటుంది? ఇంత ఆస్తి కలిసొస్తుందని చెప్తే తన పెళ్ళాం కాదని పంతం పట్టి కూర్చోదు... ఎలాగోలా పెళ్ళి చేసుకునేందుకు ఒప్పిస్తే.. ఇటు దీనికీ పండగే... తాను ఇద్దరితోనూ కాలక్షేపం చేయవచ్చు' అనుకున్నాడు మహేష్.

ఆవేళ పాండుకు ఫోన్ చేసి 'బెస్ట్‌కేఫ్ దగ్గరికి వచ్చి డబ్బు తీసుకెళ్ళు' అని చెప్పాడు మహేష్. ఈ విషయం తెలిసే లోపు గిరి ఆశయా హోటల్ ల్యాండ్‌లైన్ నుండి పాండు మొబైల్‌కు ఫోన్ చేశాడు. రామ్మోహన్ అలకనంద జువెలరీ ల్యాండ్ లైనుకూ అతడు ఫోన్ చేశాడు. అంతకు ముందు అలకనంద షాపుకు వెళ్ళి తనను ఎన్నారైగా పరిచయం చేసుకుని, పదిహేనె కరాల ల్యాండ్ కొనాలనుకుంటున్నానని వివరాలు చెప్పాడు. రామ్మోహన్ జువెలరీ వ్యాపారం చేస్తూ కూడా పెద్దమొత్తంలో స్థలాలు కావలసినవారికి మీడియేటర్‌గా వ్యవహరిస్తుంటాడు. అది తెలిసే గిరి ఈ ప్లాన్ చేశాడు. రామ్మోహన్ లైన్లోకి రాగానే "హెలో మిస్టర్ రామ్మోహన్! అయామ్ గిరిజా శంకర్... నిన్న మాట్లాడాను కదా. శాన్‌ఫ్రాన్సిస్కో. ఐ లాస్ట్ మై మొబైల్...

అందుకే ల్యాండ్‌లైను నుంచి చేస్తున్నా... ఎనీ హౌ... మీకోసం ఎదురుచూస్తున్నా... త్వరగా వస్తే... వెళ్ళి సైట్ చూద్దాం.. ప్లీజ్ లేట్ చేయకండి..." అన్నాడు.

"ష్యూర్... హాఫెనవర్లో అక్కడుంటాను. మా డ్రైవర్ లేడు... కొంచెం బ్యాక్‌పెయిన్‌గా ఉంది. అంత దూరం డ్రైవ్ చేయగలనా అని కొంచెం...?"

"నేనెలాగూ ట్యాక్సీ మాట్లాడుకున్నాను. వచ్చి పికప్ చేసుకోమంటారా?"

"వద్దులెండి... ఆశయాదాకా మా మేనేజరైనా డ్రాప్ చేస్తాడు... అయితే మీ ట్యాక్సీలో వెళ్దాం... పనయ్యాక నన్నిక్కడ డ్రాప్ చేద్దురుగాని"

"డెఫినెట్‌గా... సరే... నేను వెయిట్ చేస్తుంటాను" అని గిరి.. ఉరఫ్ గిరిజా శంకర్ ఫోన్ పెట్టేశాడు.

★ ★ ★

అంతకుముందురోజు రాత్రి వైన్‌షాపు దగ్గర కాపు కాసి, విరాగి గెటప్‌లో రామ్మోహన్ కారుడ్రైవర్ వీర్రాజును కలిశాడు పాండు. వీర్రాజే పెద్ద తాగుబోతంటే తాగడంలో ఇంకో ఏడాకులు ఎక్కువ చదివినట్లు నటించాడు పాండు. "అన్నా... లోకంలో ఇన్ని కష్టాలున్నాయి కదా.. వాటన్నిటినీ మర్చిపోవడానికి దివ్యౌషధం లాంటి ఈ మందు ఉండబట్టి సరిపోయింది గానీ లేకపోతే ఏమైపోయేవాళ్ళం?" అన్నాడు. తాను తాగుతున్నానని పెళ్ళాం వదిలేసి పోయిందని, వైఫ్ అన్నాక ఆమాత్రం ఓపిక లేకపోతే ఇక అలాంటిది ఉండేం లాభమని, తన జీవితం చెల్లాచెదురైపోయిందని నానా జాలి కబుర్లు చెప్పాడు. మొత్తానికి తాను మధ్యమధ్యలో రెండు గుటకలేస్తూ వీర్రాజును తెగ తాగించాడు. మర్నాడు మత్తులోంచి ఎంతమాత్రం లేవకుండా జోగేట్లు

పీకలదాకా తాగించాడు. దాంతో అతడు డ్యూటీకి వెళ్లలేకపోయాడు.

★ ★ ★

ఆ సాయంత్రం పండరి కాంప్లెక్స్‌లో అడుగుపెట్టగానే "కూరగాయలు కావాలన్నావుగా... పద" అన్నాడు మహేష్. దారిలో గొంతు బాగా తగ్గించి "రేపటితో ఆ రామ్మోహన్ గాడికి నూకలు చెల్లిపోతాయి... ఇవాళ నీ దగ్గరికి నేను రాను... నువ్వూ నాకోసం తొంగిచూడొద్దు. ఒకవేళ ఆ ముసలోడొస్తే... వాడంటే ఇష్టమున్నట్టు మాట్లాడు.. చచ్చేముందు వాడికెందుకు అశాంతి. ఆఖ్రరోజని తెల్సి నువ్వు మాత్రం ఇంకా గొడవపడటం ఎందుకు? ఎక్కడా ఏ అనుమానం రాకుండా మాట్లాడు... ఎలాగూ ఛస్తున్నాడు కదాని ఏమైనా నగలూ నట్రా అడిగేవు. డబ్బులు కూడా అడక్కు... ఎవ్వరికీ ఏ అనుమానం రాకూడదు... చాలాజాగ్రత్త... పొరపాటున కూడా ఎవరికీ ఫోన్ చేయకు... మామూలు పనికిమాలిన కబుర్లు తప్ప ఈ విషయానికి సంబంధించి ఏమీ మాట్లాడకు..."

"అబ్బా... రీవైండ్ అండ్ ప్లే అన్నట్లు ఎన్నిసార్లు చెప్తావు? కానీ, ఎన్నయినా చెప్పు చచ్చిపోతాడంటే బాధేస్తోంది..."

"పోనీ కాన్సిల్ చేయించనా? రోజూ వాడితో చావుదెబ్బలు తిందువుగాని..."

"వద్దుగానీ... నీతో పరిచయం కాక ముందు సార్ ఒక్కసారి కూడా తిట్టలేదు, కొట్టలేదు"

"పోనీ, నేనొదిలేస్తా.. ఆ ముసలోడితోనే ఉంటావా.." కసిగా అన్నాడు మహేష్.

"అయ్యోపాపం అంటే కూడా నేరమా?"

"నువ్విలాంటి సానుభూతులు కురిపించి నన్ను విలన్ని చేయకు... నీకోసం కాదా, నేనింత రిస్కు తీసుకుంది? రేపు పోలీసులొచ్చి ఏమైనా అడిగితే ఏమాత్రం డౌటు రాకుండా మాట్లాడు.. ఏమాత్రం అనుమానం వచ్చినా పోలీసోళ్ళు కీళ్ళిరగ్గొట్టి జైల్లో పడేస్తారు..."

"అసలు నువ్వీ మర్డర్ ప్లాన్ చేసినప్పుడే ఉద్యోగం మానేస్తానంటే వద్దన్నావు... ఇప్పుడు పోలీసులు అడిగితే భయం కాక తమాషాగా ఉంటుందా?"

"అదే తెలివితక్కువతనం అంటే... ఉద్యోగం మానడం, సెలవు పెట్టడం లాంటివి చేస్తే డౌటొస్తుంది. ఎప్పట్లాగే ఉంటే ఎవరికీ సందేహం రాదు..."

"ఇంతకీ పోలీసోళ్ళు ఏమడుగుతారు?"

"సామాన్యంగా మర్డర్ జరిగితే ఇంట్లో, ఆఫీసులో అందర్నీ అడుగుతారు. అక్కడ జాబ్ చేస్తున్నావు కనుక.. నిన్ను కూడా అడుగుతారు. జాగ్రత్తగా మాట్లాడు. ఎవరికీ అనుమానం రాకూడదు. దొరికావంటే జీవితాంతం చువ్వలు లెక్కబెడుతూ, నీళ్ళ చారు తాగుతూ బతకాల్సిందే"

"నాకు భయమేస్తోంది"

"జాగ్రత్త అని చెప్పానంతే. ఈ హత్య చేస్తోంది అల్లాటప్పాగాళ్ళు కాదు... వాళ్ళని బ్రహ్మదేవుడు కూడా పట్టుకోలేడు... కానీ, నీ గురించే భయంగా ఉంది. ఏం మాట్లాడ్తావో... ఎక్కడ దొరికిపోతామోనని..."

"లేదు... అనుమానం రానివ్వను..."

## కొత్తగాలి...

**వివేకి**
**ఆలోచించి దూకుతాడు!**
**అవివేకి దూకేసి**
**యోచిస్తాడు!**

– కృష్ణ మాదవరపు,
కాకినాడ

# బాల మేధావులు!

చతుర ప్రపంచం

కొందరు పిల్లల్లో తెలివితేటలు చాలా ఎక్కువ. అలాంటి వారిని చైల్డ్ ప్రాడిజీలని అంటారు. చిన్న వయసులోనే వారు యూనివర్సిటీ విద్యను అభ్యసించడం విశేషం. గ్రెగరీ ఆర్ స్మిత్ తన పదోఏటనే కాలేజీలో చేరాడు. 'రేండోల్స్ మేక్సన్' కాలేజి అతనికి నాలుగేళ్ల స్కాలర్‌షిప్పును కూడా ఇచ్చింది. తన పన్నెండో ఏట, ఆ తర్వాత మరో రెండుసార్లు గ్రెగరీ పేరును నోబెల్ పీస్ ప్రైజ్‌కు సూచించటం విశేషం. కెన్యా, సావొపోలో, రువాండా లాంటి పేద ఆఫ్రికన్ దేశాల్లో అతను చేసిన మానవత్వపు సేవల వల్ల ఈ నామినేషన్ లభించింది.



జాకోబ్ బార్నెట్ అనే మరో అమెరికన్ బాలుడికి పన్నెండో ఏట ప్రజ్ఞాలబ్ధి 170. అతడు పన్నెండో ఏటనే యూనివర్సిటీలో చదువుతూ కొన్ని మేథమేటికల్ సమస్యల్ని పరిష్కరించడం చూసి ప్రొఫెసర్లే ఆశ్చర్యపోయారు. ఆల్జీబ్రా, కాలిక్యులస్, ట్రిగ్నోమెట్రీలను ఇతను ఎవరి సహాయం లేకుండా పుస్తకాలను చదివి నేర్చుకోవడం విశేషం.

సేఫ్రాన్ ప్లెడ్జర్ వయసు మూడేళ్లే. ఐక్యూ 140. మెన్సా క్లబ్‌లో అతి తక్కువ వయసు గల సభ్యురాలైన ఈ పాప 98 శాతం అమెరికన్ల కంటే మేధావి. మూడో ఏటనే రాయగలదు, చదువగలదు. యాభై దాకా అంకెలు లెక్క పెట్టగలదు. మనదేశానికి చెందిన ఆకృత్ జస్వాల్ ఐక్యూ 146. తక్కువ వయసులోనే ఈ పిల్లవాడు సర్జన్ కావడం విశేషం. 1993లో జస్వాల్ జన్మించాడు. కొలిన్‌కార్సన్ పదకొండో ఏట స్టేన్‌ఫోర్డ్ యూనివర్సిటీ ఆన్‌లైన్ హైస్కూల్‌లో చేరి గ్రాడ్యుయేట్ అయ్యాడు. తొమ్మిదో ఏటే యూనివర్సిటీ ఆఫ్ కనెక్టికట్‌లో చదివాడు. కిమ్ ఉంగ్ యాంగ్ అనే పిల్లవాడు తన మూడో ఏటే ఫిజిక్స్ విద్యార్థి. దక్షిణ కొరియాకి చెందిన ఈ పిల్లఘటం హాన్‌యాంగ్ యూనివర్సిటీలో మూడో ఏటనే చేరి అతి తక్కువ వయసుగల విద్యార్థి అయ్యాడు. ఎనిమిదో ఏట నాసా తన సొంత ఖర్చుతో వాడిని అమెరికాకు రప్పించి చదివించింది. నాలుగో నెలలోనే మాట్లాడిన ఆ పిల్లవాడు రెండో ఏడాదికల్లా కొరియన్, జర్మన్, ఇంగ్లిష్, జపనీస్ భాషలను మాట్లాడగలిగాడు!

విలియం జేమ్స్ సిడిస్ ఎనిమిదో ఏటనే లెక్కల్లో మేధావి. పన్నెండో ఏట కొత్తరకం లాగరిథమ్స్‌ని రూపొందించాడు. అంతేకాక హార్వార్డ్ యూనివర్సిటీలో ఉపన్యాసాలు ఇచ్చాడు. వీడి ప్రజ్ఞాలబ్ధి 300! ప్రపంచంలోనే అత్యంత మేధావి ఇతనే. మనదేశంలో వయసు చాలదని పై పరీక్షలకు పిల్లల్ని కూర్చోనివ్వని పద్ధతిని అనుసరిస్తారు. ఇక్కడ వయస్సుకు తప్ప ప్రతిభకు తొందరగా విలువ ఇవ్వరు. అభివృద్ధి చెందిన పాశ్చాత్య దేశాల్లో ప్రతిభని తప్ప మరిదేన్నీ పరిగణనలోకి తీసుకోరు.

"కూరగాయలు తీసుకోవా? "

"ఆ... తీసుకున్నట్లే ఉంది. ఇవాళ వంట కూడానా? "

"ఇదిగో ఇలాంటి తలతిక్క పనులు చేస్తే అనుమానం వస్తుంది... ఏదో ఒకటి వండి ఎంతో కొంత తిను... ఇంక నువ్వెళ్ళు... ఎవ్వరికీ పొరపాటున కూడా ఫోన్ చేయకు..." అని పండరిని పంపేసి మహేష్ మరో దారిలో వెళ్ళిపోయాడు.

★ ★ ★

అనుకోకుండా మిత్రుడు షాపుకు రావడంతో ఆశయా హోటల్ దగ్గర దింప

మని అడిగాడు రామ్మోహన్.

రిసెప్షన్ నుంచి కాల్ చేయగానే గిరి వచ్చి షేక్‌హ్యాండిచ్చి, "పదండి... ట్యాక్సీ రెడీగా ఉంది" అన్నాడు.

గిరి తన నేర భాగస్వామి సూరిని ప్లాన్ ప్రకారం ట్యాక్సీ డ్రైవర్‌గానే పరిచయం చేశాడు.

గిరి రామ్మోహన్ వెనుక సీట్లో కూర్చోగానే కారు రివ్వున దూసుకుపోయింది. కోటూ సూటూ వేసుకున్న గిరి చాలా హుందాగా మాట్లాడాడు. "రిషీవ్యాలీ, శాంతినికేతన్ లాంటి స్కూలు తెరవాలనే ఆశయంతో వచ్చానని, అందుకోసమే స్థలం చూస్తున్నానని, కుటుంబం ఇంకా శాన్‌ఫ్రాన్సిస్కో నగరంలోనే ఉందని, కూతురు సైకియాట్రీ చేస్తోందని, కొడుకు తనలాగే సాఫ్ట్‌వేర్ ఇంజనీరని, తన భార్య కొన్నాళ్లలో ఇండియా వస్తుంది" అని ధారాళంగా చెప్పుకొచ్చాడు.

రామ్మోహన్ దాదాపు శ్రోతగానే ఉన్నాడు. ఈలోపు విజయవాడ హైవే మీదికి చేరింది కారు.

సూరి కారును ఓ పక్కకు ఆపి, ఫ్రంట్ డోర్ వేసేసి రామ్మోహన్ కూర్చున్నవైపు డోర్ లాక్ తీసి "సార్... ప్లీజ్ కొంచెం అవతలికి జరగండి... వెనుక నాప్‌కిన్ పెట్టాను" అంటూ వచ్చి ఆయన పక్కన కూర్చుని నాప్‌కిన్లు తీశాడు. రామ్మోహన్ అతనేం చేస్తున్నాడని ఆశ్చర్యంగా చూసేలోగా గిరి రామ్మోహన్ని ఒడిసి పట్టుకున్నాడు. సూరి అందుకు సాయం చేస్తూ పెనుగులాడకుండా నోట్లో ఒక నాప్‌కిన్ కూరాడు. మరో మందపాటి టవలును గొంతుకు చుట్టేసి నైలాన్ తాడుతో బిగించేశాడు. కారు సౌండ్ ప్రూఫ్ కావటాన రామ్మోహన్ మొదట చేసిన చిన్న శబ్దాలు కూడా బయటకు రాలేదు. ప్రాణం పోగానే రామ్మోహన్ జేబుల్లో ఉన్న డబ్బు, క్రెడిట్, డెబిట్ కార్డులు, రిస్టువాచి, మెడలో గొలుసు అన్నీ తీసుకున్నారు. కనుచూపు మేరలో ఎవరూ వస్తున్న జాడ లేకుండా చూసి రామ్మోహన్ని మెల్లగా నడిపించుకుంటూ యూరినల్స్‌కి తీసికెళ్తున్నట్లు రోడ్డువారనున్న పొదల్లోకి తీసికెళ్ళి అక్కడ శవాన్ని వదిలేసి ఎంతమాత్రం అనుమానం రాకుండా వెనుతిరిగారు.

★ ★ ★

భరద్వాజ కంపెనీలో పి.ఆర్.ఒ. బెనర్జీని స్టేషన్‌కి పిలిపించాడు ఇన్‌స్పెక్టర్.

"ఎందుకు సార్... నన్నెందుకు స్టేషన్‌కి తీసుకొచ్చారు? " అన్నాడు బెనర్జీ

"రామ్మోహన్ హత్య కేసులో విచారించడానికి. అతని చావు వెనక మీ హస్తముందని సమాచారం అందింది..."

"ఇది చాలా అన్యాయం... అతనికీ, మాకూ ఏమిటి సంబంధం? "

"చూడూ, ఇది పోలీస్‌స్టేషన్... ఇక్కడ డ్రామాలొద్దు..." అన్నాడు బోసు.

"మీరెంత పోలీసైనా కావొచ్చు. చేయని నేరాలు ఆరోపించేస్తారా? చట్టాలూ, కోర్టులూ లేవనుకున్నారా? మా ఎండీగారికీ తెలిసిందంటే..." అన్నాడు బెనర్జీ కోపాన్ని తమాయించుకుంటూ.

"ఏం... మీ యండీ పేరు చెప్పగానే ఉచ్చ పోసుకుంటాననుకున్నావా సాలే? నేనెవ్వరికీ భయపడను... న్యాయంకోసం, ధర్మంకోసం పనిచేస్తాను..."

"అయితే, తప్పు చేయనివాళ్ళని ఇలా భయపెడ్తారా? "

"నా దగ్గర ఆధారం ఉందిరా సాలే. పాండు అనేవాడికి పదిలక్షలు ఇవ్వలేదా? "

"ఇచ్చాను... అందులో తప్పేముంది... డొనేషన్ ఇవ్వడం కూడా నేరమేనా..."

"మీ ఎండీకి డబ్బు చెట్లకాస్తోందా? లక్షల్లో డొనేషన్లు ఇచ్చేస్తారా? "

"సార్, భరద్వాజగారు ఎప్పుడూ ఎవరో

ఒకరికి విరాళాలు ఇస్తూనే ఉంటారు... ఇదే మొదటిది, చివరిది కాదు..."

"ఓహో... అలానా... ఆయనంత త్యాగ మూర్తి అన్నమాట... ఇంతకూ పాండుగా డికి డొనేషన్ ఎందుకిచ్చినట్లు? "

"అనాథ శరణాలయం కోసం" చెప్పాడు బెనర్జీ.

ఈలోపు భరద్వాజ నుండి స్టేషన్‌కు కాల్ వచ్చింది. అతను చాలా సీరియస్‌గా "మీకేమైనా సందేహం ఉంటే మా కంపె నీకి వచ్చి విచారించండి... అంతేగాని ఏ ఆధారంతో బెనర్జీని కస్టడీలోకి తీసుకు న్నారు? ఆర్ఫనేజ్‌కి డొనేషన్ ఇవ్వడం కూడా నేరం కింద పరిగణిస్తారా.. మా రికార్డులన్నీ చెక్ చేసుకోండి. పదిలక్షలు ఎవరికి, ఎందుకిచ్చామో స్పష్టంగా రాశాం. అది బ్లాక్‌మనీ కాదు, లెక్కాప్రతం లేకుం డా ఇచ్చింది కాదు.." అన్నాడు.

కొద్దిసేపటికే హోం మినిస్టర్ పేషీ నుండి ఫోనొచ్చింది. "ఆధారాలు లేకుండా కేవలం అనుమానాలతో పెద్ద మనుష లతో పెట్టుకోవద్దు" అనేది సారాంశం.

బెనర్జీని రిలీజ్ చేసిన బోసు భరద్వాజ ఫ్యాక్టరీకి వెళ్ళాడు. రికార్డులు పరిశీలించిన తర్వాత "మహేష్ అనేవాడు. అదే టీవీ త్రీలో కెమెరామన్... మిమ్మల్ని కలిసి ఏం మాట్లాడాడు? " అనడిగాడు.

భరద్వాజ ఓ నిమిషం ఆలోచించి ఆవేళ జరిగిన సన్నివేశాన్ని యథాతథంగా వివ రించాడు.

"సార్... నేనో అమ్మాయిని పెళ్ళి చేసు కోవాలనుకుంటున్నాను. అయితే మధ్యలో ఒక వ్యక్తి అడ్డు తగుల్తున్నాడు... ఆమెని భయపెట్టి తనదాన్ని చేసుకోవాలనుకుంటు న్నాను" అన్నాడు మహేష్.

"ఇదంతా నాకెందుకు చెప్తున్నావు? వెళ్ళి పోలీసులతో మాట్లాడు"

"కాదు సార్... చేయదల్చుకుంటే మీరే చేస్తారు..."

"ఆ అడ్డుకుంటున్నవాడు మా ఆఫీసులో పని చేస్తున్నాడా? "

"ఛఛ.. కాదు సార్"

"మరి నాకెందుకు చెప్తున్నావు? నా టైం వేస్ట్ చేయకుండా వెళ్ళు"

"ప్లీజ్ వినండి సార్... అతనిప్పుడు నన్ను మోసం చేస్తున్నట్లే ఒకప్పుడు మిమ్మల్ని కూడా మోసం చేశాడు"

"ఎవరది? "

"రామ్మోహన్... ప్లాట్స్ అండ్ కన్‌స్ట్ర క్షన్ బిజినెస్‌లు..."

"ఇప్పుడు జువెలరీ షాపులు పెట్టా డుగా..." అన్నాడు భరద్వాజ.

"అతడు మిమ్మల్ని మోసం చేసిన సంగతి మీకు తెల్సా? మీకు రిజిస్ట్రేషన్ చేయించాల్సిన స్థలాన్ని గెలాక్సీ గ్రనైట్లు ఉన్నాయని తెల్సి, తన పేరుతో చేయించు కున్నాడు...ఇది తెల్సినా మీకు కోపం రాదా రామ్మోహన్‌మీద? మోసమని తెలి సినా ఊరుకుంటారా? "

"ఊరుకోక ఫైట్లు చేయమంటావా? "

"మీ చేతికి దుమ్ము అంటకుండా మీ కోపం తీరే మాటొకటి చెప్తాను... దయ చేసి కొంచెం శాంతంగా వినండి. రామ్మో హన్ సామాన్యుడు కాదు సార్... మెత్తటి కత్తి... శాంతంగా కనిపిస్తాడు... కానీ,

## కొత్తగాలి...

**వేరు పుట్టుక చెట్టుమేలుకు**
**చెట్టు పుట్టుక మనిషి మేలుకు**
**మనిషి పుట్టుక సొంతమేలుకు**
**ఎంత స్వార్థం సోదరా!**

– అయినాల కనకరత్నాచారి,
కొరిశపాడు, ప్రకాశం జిల్లా

జిత్తులమారి నక్క.. ఎందర్ని వంచించి ఆ వరసన సంపాదించాడో తెల్సా? లేకపోతే మీలాగ పెద్ద చదువులు చదివి ఫారిన్‌లో అంత డబ్బు సంపాదించాడేంటి? "

రామ్మోహన్ని తిట్టడంతో సరిపెట్టక తనను పొగిడేసరికి భరద్వాజకు సంతోషం కలిగింది. "ఇంతకీ నీ ఉద్దేశమేంటి? ఏం చేయాలనుకుంటున్నావో చెప్పు"

"ముల్లుని ముల్లుతోనే తీయాలి... వజ్రాన్ని వజ్రంతోనే కోయాలి..."

"సాగదీయకుండా విషయం చెప్పు"

"మీరు కోప్పడక అర్థం చేసుకోవాలి..."

"ముందు ఏమిటో చెప్పు"

"ఆ రామ్మోహన్‌కి... తగిన శాస్తి చేస్తే గానీ బుద్ధిరాదు..."

"నూతిలో తోయమంటావా? "

"అయ్యో, సార్.. మీలాంటి పెద్దవాళ్ళని అలా అంటానా? "

"నువ్వు చేసుకోవాలనుకున్న పిల్లని అతడు దక్కించుకోవాలని చూస్తోంటే నీక్కోపం వస్తుంది, కాదన్ను. కానీ... ఇదంతా నాకెందుకు చెప్తున్నావు? "

"నిజమే సార్! చల్లకొచ్చి ముంత దాచి ప్రయోజనం లేదు. చెప్పేస్తాను. మీరు తిట్టినా, రెండు దెబ్బలు వేసినా ఫర్వాలేదు"

భరద్వాజ బ్లాంక్‌గా చూశాడు.

"రామ్మోహన్ నాకోవిధంగా అన్యాయం చేస్తే మీకు ఇంకోరకంగా చేశాడు. ఎక్కువ తక్కువలుంటే ఉండొచ్చు. కానీ మోసం మోసమే. మీకు చెందాల్సిన కోట్లు కొట్టే శాడు. కనుక మీకూ అతను శత్రువే. అత న్నిలా వదిలేస్తే లాభంలేదు, బుద్ధి చెప్పాలి... నా దగ్గర కనుక డబ్బుంటే మీదాకా వచ్చేవాణ్ణి కాను... మీరు కొంచెం సాయంచేస్తే రౌడీలతో కాలో చేయో తీయి ద్దామని.." అన్నాడు మహేష్.

"నోర్మూసుకుని ఇక్కణ్ణించి నడువ్..." అసహనంగా అన్నాడు భరద్వాజ.

"ప్లీజ్ సార్... అర్థం చేసుకోండి... ఇలాంటి నీచుల్ని వదిలేస్తే ఇంకా ఇంకా వంచిస్తూనే ఉంటారు"

"షటప్! నన్నాట్టే విసిగించకు. రామ్మో హన్ ప్లేస్‌లో నువ్వున్నా అదే పని చేస్తావ్. అతడు మీడియేటర్‌గా ఉన్నాడు. డీలింగ్స్ జరిగాక అందులో గ్రనేట్స్ ఉన్నా యని తెలిశాక తనే సొంతం చేసుకు న్నాడు. ఒకవేళ ఓనర్‌కే తెలిస్తే మాత్రం కారుచవగ్గా ఇచ్చేస్తాడా? ఒప్పందం కుదు ర్చుకున్నాక కదా తెలిసింది. నిజాయితీగా ఇచ్చేద్దాం అనుకునేంతటి సత్యవంతుడు ఈ కాలంలో ఉంటాడా? రామ్మోహన్ చేసింది చాలా అల్పం. అంతకంటే మోసాలు, దుర్మార్గాలు, దౌర్జన్యాలు, ఆఖరికి హత్యలు చేసేవాళ్ళు కూడా ఉన్నారు. వాళ్ళకి బుద్ధి చెప్పే మిషతో కాళ్ళూ చేతులు తీయాలను కుంటే రౌడీషీటర్లుగా మారాల్సిందే"

"అది కాదండీ..."

"ఇక నువ్వెళ్ళొచ్చు" అనేసి భరద్వాజ టేబుల్ మీదున్న ఫైల్లో తల దూర్చేశాడు.

మహేష్ మౌనంగా నిష్క్రమించాడు.

భరద్వాజతో చేతులు కలిపి రామ్మో హన్ని హత్య చేయించాలనుకున్న పన్నా గం బెడిసికొట్టడంతో తానే స్వయంగా రంగంలోకి దిగాడు మహేష్. ఆ సంగతి స్పష్టంగా తెలిస్తే పండరి ఎక్కడ తొట్రుప డుతుందో, విషయం బయటపెడుతుందే మోనన్న భయంతో ఆమెకి భరద్వాజ, ఇంకో ఇద్దరు కూడా ఈ కుట్రలో భాగస్వా ములన్నట్లు అనుమానం కల్పించాడు.

రామ్మోహన్ని చంపించడానికి ఖర్చుపె ట్టిన సొమ్ముని తెలివిగా పాండు ద్వారా విరాళంగా తెప్పించుకున్నది మహేషేనని రుజువైంది.

మహేష్, సూరి,గిరి, పాండు, పండరిల ను పోలీసులు కస్టడీకి తీసుకున్నారు. ©

# కాలాతీతం



సెల్మా లాగార్లాఫ్

# గోస్టాబెర్లింగ్ గాథ

స్వీడన్‌లో నైరుతి దిశగా, వానర్ సరోవరానికీ, నార్వే సరిహద్దుకీ మధ్యన ఉంటుంది వార్మ్‌లాండ్. ఒకప్పుడిది వెనకబడిన, నిర్జన ప్రదేశమే అయినా, పద్దెనిమిదో శతాబ్దంలో అనూహ్యంగా అభివృద్ధి చెందింది. ఆర్థికంగా కూడా దీని ప్రాధాన్యం పెరిగింది. దీనిక్కారణం అక్కడ ఇనుప ఖనిజం నిక్షేపాలున్నాయని తెలియటమే. అతి త్వరలో చిన్నా పెద్దా కొలుములు, తత్సంబంధిత పరిశ్రమలు వెలిశాయి. సంపద పెరగటంతో, ప్రజల్లో వ్యసనాలూ పెరిగాయి. జూదం వాళ్లకిష్టమైన క్రీడ. కొందరు ఉన్నదంతా పోగొట్టుకున్నారు. కొందరు కుబేరులైనారు. పెద్ద పరిశ్రమల యజమానులు తమ మె



నార్‌లలో విలాసజీవితం గడిపారు. రోజూ అతిథుల కోలాహలమే, విందు వినోదాలే. నెపోలియన్ దండయాత్రల తర్వాత ఈ నడిమంత్రపుసిరితో సుఖలాలసత మరింత పెరిగింది. మాజీ సైనికాధికారులకు వార్మ్ లాండ్ విడిదిగా మారింది. లోకానుభవమూ, యుద్ధాల గురించి వాళ్లు చెప్పే కబుర్లూ, తాగుడు పార్టీలలో ఎంత తాగినా నిలదొక్కుకోగల సామర్థ్యమూ.. ఇవే వాళ్ల ప్రత్యేకార్హతలు. విందులిచ్చినవాళ్లు, వీరిని అతిథులుగా రమ్మని మరీమరీ అభ్యర్థించేవాళ్లు. వార్మ్‌లాండ్‌కిది స్వర్ణ యుగం. ఈ కాలాన్ని అక్షరబద్ధం చేసింది గోస్టాబెర్లింగ్ గాథ.

గ్రామీణ ప్రాంతాల్లో పనిచేస్తున్న ఒక క్లెర్జిమాన్(చర్చి పాద్రి) గోస్టా బెర్లింగ్. తాగుబోతుగా ముద్ర పడటంతో అతణ్ణి ఉద్యోగం నుండి తొలగించారు చర్చి అధికారులు. ఊళ్లలోని రైతులు, కూలీలకతడు 'మతి భ్రమించిన ప్రీస్టు'. పతితుడై, రోడ్డునపడ్డ గోస్టాబెర్లింగ్‌ను ఇనుప గనుల యజమాని భార్య మార్గారెటా సాంజెలియస్ చేరదీస్తుంది. ఆ ప్రాంతంలో ఆమె మాటకు తిరుగులేదు. ఎకెబీ ఎస్టేట్‌కు యజమానురాలు మార్గారెటా. అప్పటికే సుమారు డజను మంది వృద్ధులకు, నిరాశ్రయులకు ఆమె తన ఎస్టేట్‌లో వసతి కల్పించి, పోషిస్తున్నది. ఇప్పుడు గోస్టాబెర్లింగ్ కూడా వాళ్లలో ఒకడు. ఆమె పోషణలో బతుకుతున్న వీళ్లందరూ జీవితంలో పరాజితులే, కాని ఏదో ఒక పనిచెయ్యగల సమర్థులు. ఒక్కొక్కరూ ఒక్కొక్క విద్యలో ప్రవీణులు. వేట, జూదం, సంగీతం, వాక్చాతురత, సాహసకార్యాలు వాళ్ల ప్రత్యేకతలు. ఈ డజను మందీ అక్కడ హాయిగా కాలం గడిపేస్తున్నారు.




అందరూ ఇలా సంతోషంగా బతకటం చూసి సైతానుకు కన్ను కుట్టింది. యజమానురాలికీ, వీళ్లకూ మధ్య చిచ్చుపెట్టాలనుకున్నాడు. కొంతకాలం క్రితం మార్గారెటా, తల్లిదండ్రుల బలవంతంతో తన యిష్టానికి వ్యతిరేకంగా మేజర్ సాంజెలియస్‌ను పెళ్లాడింది. నిజానికి ఆమె మరొకర్ని యిష్టపడింది. అందువల్ల ఇలా చెయ్యవలసి వచ్చినందుకు తనను తాను అసహ్యించుకున్న మార్గారెటాలో తల్లిపట్ల ద్వేషం పెరిగింది. ఒకసారి తల్లి ఇంటికి వస్తే, అతిథి మర్యాదలు చేసింది గాని, అపరిచితురాలిగానే ఆమెను దూరంగా ఉంచింది. కోపగించిన తల్లి "త్వరలో ఎకెబీకి నువ్వు దూరమవుతావు!" అంటూ శపించింది. ఈ శాపాన్ని నిజం చెయ్యాలనుకున్నాడు సైతాను.

ఒకనాడు రహస్యంగా ఆమె ఎస్టేట్‌లో ఉన్న ఆశ్రితులతో బేరసారాలు ప్రారంభించి వాళ్లను భయభ్రాంతులకు గురిచేస్తాడు. 'మార్గారెటా తన ఆత్మను సైతానుకు అమ్ముకుంది. అంటే, ఇక ప్రతి ఏడాది ఒక ఆశ్రితుడు మరణించక తప్పదు. కేవలం తనకు బలి ఇవ్వటానికే ఆమె వీళ్లకు మంచి ఆహారం పెట్టి బలిపిస్తున్నది. ఇప్పుడు వీళ్లంతా ప్రాణాలతో బతికి బయటపడాలంటే ఆమెను ఎకెబీ నుండి తరిమేసి తామే ఎస్టేట్‌ను ఆక్రమించుకోవాలి' అని చెబుతాడు.

వ్యాపారస్తుల్లా లాభాపేక్షతో కాక, ధర్మకర్తల్లా ఎకెబీ వ్యవహారాలు చూస్తామన్నారు ఆశ్రితులు. ఈ నియమాన్ని ఎవరు అతిక్రమిస్తే వాళ్లకు ఆత్మనాశనం తప్పదు. అలా కుదిరిన ఒప్పందాన్ని నల్లకాగితం మీద రాసి నెత్తుటితో సంతకాలు చేస్తారు.

# సెల్మా లాగర్లాఫ్ (1858 - 1940)

స్వీడన్‌లోని వార్మ్‌లాండ్ ప్రాంతంలో పుట్టింది సెల్మా లాగార్లాఫ్. ఆమె రాసిన కథలన్నీ తన ఊరి గురించే. అక్కడే వారసత్వంగా సంక్రమించిన ఎస్టేట్ మార్బకాలో పెరిగింది. శైశవం నుండీ ఆమెను అనారోగ్యం వెన్నాడింది. మూడేళ్లప్పుడే పక్షవాతంలాంటి వ్యాధి సోకింది. ఫలితంగా జీవితాంతం కుంటుతూ నడిచింది. తోటి పిల్లలందరూ ఆడుతూ, గెంతుతూ అల్లరి చేస్తే, చిన్నారి సెల్మా ఆస్పత్రుల్లో, సానిటేరియంలో గడిపింది. ఇరవయ్యేళ్లప్పుడు తండ్రి మరణించాడు. ఆర్థిక పరిస్థితి దిగజారి ఎస్టేట్ అమ్ముకోక తప్పలేదు. కొన్నాళ్లు ప్రైవేటుగా చదువుకుని, ఉత్తర స్వీడన్‌లోని లాండ్స్‌క్రోనాలో స్కూలు టీచర్ ఉద్యోగంలో చేరింది. అక్కడే ఆమె రైతుల జీవితాల్ని, వాళ్ళ స్థితిగతుల్ని అధ్యయనం చేసింది.

లాగర్లాఫ్ రచనలన్నింటిలోకీ, ఆమె తొలి పుస్తకం 'గోస్టాబెర్లింగ్ గాథ'నే ఉత్తమమైందంటారు విమర్శకులు. అర్థశతాబ్దం క్రితం తన అమ్మమ్మ తమ ప్రాంతమైన వార్మ్‌లాండ్ గురించి చెప్పిన కథలవి. ఇందులోని తొలి అయిదు అధ్యాయాలూ ఒక పత్రికలో సీరియల్‌గా ప్రచురితమై బహుమతి కూడా గెల్చుకున్నాయి. మొత్తం పుస్తకం 1891లో అచ్చయింది. ఫెయిరీ టేల్స్ రచయిత హాన్స్ క్రిస్టియన్ ఆండర్సన్ తర్వాత, రచనారంగంలో స్కాండినేవియాలో పుట్టిన గొప్ప వ్యక్తిగా కీర్తి గడించింది లాగర్లాఫ్. ఆ తర్వాత రెండు దశాబ్దాలు ఆమె అందుకోని సత్కారం లేదు. 1895లో దక్షిణ యూరోప్‌లో పర్యటించటానికి ఫెలోషిప్ లభించింది. 1904లో స్వీడన్ అకాడమీ ఆమెను ప్రతిష్ఠాత్మకమైన 'మెడల్'తో సన్మానించింది. 1909లో గౌరవ డాక్టరేట్ లభించింది. అదే సంవత్సరం నోబెల్ బహుమతి కూడా వరించింది. 1914లో స్వీడన్ అకాడమీ సభ్యత్వం లభించింది.

నోబెల్ బహుమతివల్ల వచ్చిన డబ్బుతో ఆమె తన కల సాకారం చేసుకుంది. మార్బకాను తిరిగి కొనుక్కుని మార్పులు చేర్పులు చేసి అక్కడే 'లేడీ ఆఫ్ ది మెనార్'గా శేషజీ

సైతాను అంతర్ధానమైపోతాడు.

ఇక ఆ ఒప్పందాన్ని ఆచరణలో పెట్టడమే మిగిలింది. క్రిస్మస్ రోజున వీళ్లలో ఒకడు తప్పతాగి, ఎప్పుడో జరిగిన మార్గారెటా ప్రేమ వ్యవహారాన్ని బయటపెడతాడు. అప్పటిదాకా ఈ విషయం తెలియని, ఆమెభర్త, మార్గారెటాను ఇంట్లోంచి గెంటేస్తాడు. బయట మంచులో ఒంటరిగా గడుపుతుందామె. ఏదో ఒక ఆధారం వెదుక్కోక తప్పదు. ఇష్టం లేకపోయినా, గత్యంతరం లేక, పుట్టింటికే తిరిగి పయనమవుతుంది. తల్లికి వృద్ధాప్యం మీదపడింది. కనీసం ఇప్పుడైనా తన శాపం వెనక్కు తీసుకొమ్మని వేడుకుంటుంది. ఎకెబీ మార్గారెటా తన స్త్రీ ధనంగా తెచ్చిన ఆస్తి. ఆమెభర్త దాన్ని మేనేజ్ చెయ్యలేడు. అమ్మకానికి పెట్టాలంటే, చట్టబద్ధంగా అతనికి వీలుపడదు. చివరికి అనాథలైన ఆశ్రితులకే దాన్నప్పగించి వెళ్లిపోతాడు.

ఏడాదిపాటు ఆశ్రితులు అక్కడ జల్సాలు చేసుకుంటారు. ఇన్నాళ్లూ తీరని సరదాలన్నీ తీర్చుకుంటారు. కాని వాళ్లకు వ్యవహార దక్షత లేదు. వ్యాపారం చెయ్యలేరు. గనుల్లో ఉత్పత్తి తగ్గిపోతుంది. తిని కూర్చోవటంతో ఉన్నదంతా కరిగిపోతుంది. జల్సారాయుళ్లే కావచ్చు గాని, ఈ పన్నెండు మందీ దుర్మార్గులు కారు. సైతానుతో ఒప్పందం చేసుకున్నప్పటికీ, వాళ్లలో మంచితనం చచ్చిపోలేదు. కష్టాలను ఎదుర్కొగల శక్తి ఇంకా మిగిలే ఉంది.

ఈ పన్నెండు మంది గురించీ విస్తారంగా రాసినా, కథానాయకుడు గోస్టాబె

వితం గడిపింది. అక్కడ పనిచేసే ఉద్యోగులు, కౌలుదార్లే ఆమె పరివారం. పొలంలో పంటలు బాగా పండాయి. వ్యాపారపరంగా కూడా లాభించింది. అక్కడి ధాన్యంతో ఒక పాపులర్ బ్రేక్‌ఫాస్ట్ ఫుడ్ తయారు చేసి అమ్మారు. లాగర్లాఫ్ అవివాహిత. బలమైన మతభావనలు ఉన్న ఆ ప్రాంతంలో ఆమె మతం గురించి, రాజకీయాల గురించి ఎలాంటి వివాదాస్పద వ్యాఖ్యలూ చేయకుండా జాగ్రత్తపడింది. చివరి రోజుల్లో నార్వేను జర్మనీ ఆక్రమించుకోవటంతో తీవ్ర మనస్తాపానికి గురై, 1940లో 'సెరిటానిటిస్' వ్యాధితో మరణించింది.

1880ల నాటికి యూరోప్‌లో వాస్తవిక సాహిత్యయుగం ప్రారంభమైంది. ఫ్రాన్స్‌లో ఫ్లాబర్ట్, ఎమైల్‌జోలా, గాన్‌కోర్ట్ సోదరులు 'నాచురలిజం' ధోరణిలో ఉత్కృష్ట రచనలు చేస్తున్నారు. జోలాలాంటి వాళ్లైతే సమాజ వికృత స్వభావాన్ని పాఠకులకు ఏవగింపు కలిగేటంత 'వికృతంగా' చిత్రించారు. గత తరం రచయితల ఊహాలోక విహారానికి కాలం చెల్లింది. కాని సెల్మా తన మూలాలను జానపద గాథల్లో వెదుక్కుంది. అన్ని నవీన వాస్తవిక ధోరణులూ పైపై మెరుగులే. పూర్వీకుల జీవన చిత్రాల్లో దాగుంది సత్యం. ఇవన్నీ మరెక్కడో కాదు, తను అమ్మమ్మ ఒళ్లో విన్న వార్మ్‌లాండ్ కథలే. ఆ రోజుల్లో ప్రీస్టు పేదవాడే. కాని అందరూ అతడే తమకు మార్గదర్శకుడనుకున్నారు. అలాంటి ఒక ప్రీస్టు ఓ మహిళతో స్నేహం చేస్తాడు. ఆమె ఆధారంగా 'మార్గారెటా సాంజెలియస్' పాత్రను సృష్టించింది లాగర్లాఫ్. రైతుల్లో ఉన్న మూఢనమ్మకాలు, వాళ్లు చెప్పుకున్న కథలన్నీ తన రచనలో విస్తారంగా వాడుకుంది. ఇలాంటి ఉబుసుపోని కథల్లో మూర్ఖత్వంతో పాటు ఓ అమాయకత్వం కూడా ఉంటుంది. అదే రచనలోని అదనపు ఆకర్షణ, అర్థం కాకపోయినా మనల్ని మైమరిపించే పసిపిల్లల వచ్చీరాని మాటాల్లా.

'గోస్టాబెర్లింగ్ గాథ' రాసే క్రమంలో తన బాల్యాన్ని పునర్జీవించింది లాగర్లాఫ్. 'కథ నేను రాయలేదు. అదే నా చేత రాయించింది' అంటుందామె. తొలుత ఇదే ఇతివృత్తాన్ని పద్యకావ్యంగా రాయాలనుకుంది. ఆ ప్రక్రియతో తృప్తి చెందక, నాటకంగా మలచటానికి ప్రయత్నించింది. అలా రెండుసార్లు విఫలమైన తర్వాతే నవలకు శ్రీకారం చుట్టింది.

మంచికీ, చెడుకూ మధ్య జరిగిన సంఘర్షణ కాదు ఈ నవల. 'మంచి' కూడా రెండు రకాలుగా ఉండవచ్చునన్న దానికి దృష్టాంతమిది.

ర్లింగ్ 'సాహసకార్యాలు' కథను ముందుకు నడిపిస్తాయి. అందరిలోకీ చిన్నవాడూ, ఆ బృందానికి నాయకుడూ అతడే. ఎబ్బాడోనా అనే యువతి అతణ్ణి ప్రేమిస్తుంది గాని, అతడు ఉద్యోగం నుండి తొలగించబడిన ప్రీస్టు అని తెలిసి నిరాశ చెందుతుంది. ఆమెకు మతాచారాలంటే అపారమైన భక్తీ, గౌరవం. ప్రేమ విఫలమైనా ఫరవాలేదుగాని, సాంప్రదాయాలను ఉల్లంఘించిన ప్రీస్టును ఎలా ఇష్టపడుతుంది? త్వరలో ఆ బెంగతోనే మరణిస్తుందామె. అన్నా స్టార్న్‌హాక్ అనే యువతి ఫెర్డినాండ్ అగ్లా అనే కుర్రాణ్ణి ప్రేమిస్తుంది. ఇద్దరి మధ్యా పొరపొచ్చాలొస్తాయి. తన మిత్రుడైన ఫెర్డినాండ్ తరఫున రాయబారం నడపబోయిన గోస్టాబెర్లింగ్ స్వయంగా ఆమె ప్రేమలో పడతాడు. ఇద్దరూ కలిసి లేచిపోవటానికి ప్రయత్నిస్తారు. కాని మంచుమీద వాళ్లు ప్రయాణిస్తున్న స్లెడ్జి బండిపైన తోడేళ్లు దాడి చెయ్యటంతో ప్రేమికులు ఓ ఇంట్లో తలదాచుకుంటారు. దురదృష్టవశాత్తూ అది ఫెర్డినాండ్ అగ్లా నివాసమే. వీళ్ల వ్యవహారం తెలియని అతను, తన ప్రేయసి అన్నా కోసం విరహవేదన అనుభవిస్తున్నాడు. ఇలా జరగటం దైవనిర్ణయమని భావించిన గోస్టా, అన్నాను వదులుకోవటానికే నిర్ణయించుకుంటాడు. ఆమె, తన పాత ప్రేమికుడు ఫెర్డినాండ్‌తో రాజీపడుతుంది. కథలో ప్రవేశించిన మూడో ప్రేమికురాలు మారియాన్ సింక్లేర్ అనే ఆమె ఎకేబీలో నిర్వహించిన ఒక బాల్(విందునాట్యం)లో

గోస్టాకు పరిచయమవుతుంది. ఈవిడ తండ్రి వ్యసనపరుడైన మెల్కియర్ సింక్లేర్. భార్యను బానిసకన్నా హీనంగా చూస్తాడు. చీటికీ మాటికీ చావబాదుతాడు. మారియాన్‌కు ఆత్మగౌరవమెక్కువ. సంయమనంతో నిర్ణయాలు తీసుకుంటుంది. తన కూతురు గోస్టాలాంటి బికారిగాణ్ణి ప్రేమించటం చూసి ఆగ్రహంతో ఊగిపోతాడు మెల్కియర్. ఆమెను ఇంట్లోంచి గెంటేస్తాడు. అవమానభారంతో, మంచులో నిల్చుని గడ్డకట్టి చచ్చిపోవాలనుకుంటుంది మారియాన్. కాని గోస్టా, అతని మిత్రులూ ఆమెను రక్షిస్తారు. అయితే త్వరలోనే ఆమెకు మశూచి సోకి, మొహంమీద మచ్చలతో కురూపిగా మారిపోతుంది. తనలాంటి అనాకారితో ప్రియుడు సుఖపడలేడని, తండ్రిపెట్టిన షరతులకు అంగీకరించి పుట్టింటికి తిరిగి వస్తుంది. నాలుగో నాయిక కౌంటెస్ ఎలిజబెత్ డోనా. ఆమె పెళ్లైన కొత్తలో కాపురం సజావుగానే సాగుతుంది గాని, ఆమె అత్తగారు, కోడలి గురించి తన కొడుకులో అనుమానాలు రేకెత్తిస్తుంది. కేవలం హోదా, డబ్బు కోసమే తనను పెళ్లి చేసుకుందనీ, కానీ వాస్తవానికి ఆమె గోస్టానే ఇంకా ప్రేమిస్తుందనీ కొడుక్కునూరిపోస్తుంది. ఫలితంగా ఆమెభర్త కౌంట్ హెన్రిక్ ఆ వివాహం రద్దు చేసుకుంటాడు. అప్పటికామె గర్భవతి. కొడుకు పుట్టిందాకా ఒంటరిగా గడిపినా, సంతానానికి ఒక తండ్రి ఉండాలి గనక, తనను వివాహం చేసుకొమ్మని గోస్టాను అర్థిస్తుంది. అతడంగీకరిస్తాడు గాని త్వరలో శిశువు మరణిస్తాడు. అప్పటికే చాలా ప్రేమలు విఫలమైనందున, ఇక ఆమెతోనే గడిపేందుకు నిశ్చయించుకుంటాడు గోస్టా.

ఏడాది గడుస్తుంది. అంటే, సైతానుతో చేసుకున్న ఒప్పందం ముగిసింది. మార్గారెటా సాంజెలియస్, ఎకేబీకి తిరిగి వస్తుంది. ఆమె శాపం తొలగిపోతుంది. తల్లితో సయోధ్య కుదురుతుంది. పన్నెండు మందీ ఆమెకు హృదయపూర్వకంగా స్వాగతం పలుకుతారు. తమ యజమానురాలికి ఆరోగ్యం క్షీణించినప్పుడు సేవలు చేస్తారు. ఇన్నాళ్లూ తమ విశృంఖల జీవితంతో, జల్సాలతో, చిన్ని చిన్ని పోట్లాటలతో ధ్వంసం చేసిన ఆ ఎస్టేట్‌ను పునర్నిర్మిస్తారు. వాళ్ల ఆరాధనా భావానికి పొంగిపోయిన మార్గారెటా ఆస్తిని వాళ్లకే ధారాదత్తం చేస్తానంటుంది. కాని గోస్టా అంగీకరించడు. ఆస్తి వ్యవహారాలూ, బాధ్యతలూ నెత్తిన వేసుకోవటం అతడి స్వభావానికి పడదు. 'డబ్బు పాప హేతువు' అంటాడు. ఆమె ఎస్టేట్‌లోనే ఒక చిన్నపాకలో, తన కౌంటెస్ భార్యతో ప్రశాంతంగా గడపటానికి ఇష్టపడతాడు.

'పొలం పనులు చేసుకుంటూ, పంటలు పండిస్తూ, అమాయకమైన గ్రామీణ వినోదాల్లో మునిగి తేలుతూ, ఆడుతూ పాడుతూ గడిపితే, ఈ జీవితం గడిచిపోదా? తను సంతోషంగా ఉండాలి. చుట్టూ ఉన్నవాళ్లను సంతోషపెట్టాలి. అదే దైవనిర్ణయం' అంటాడు గోస్టా.

'గోస్టాబెర్లింగ్' చాలా పెద్ద నవల. మొదట ఎకేబీలో క్రిస్మస్ సంబరాల గురించి మాత్రమే రచయిత్రి రాయాలనుకుంది. క్రైస్తవుల్లో నవజీవితానికి సంకేతం ఆ పండగ. అది మొదటి అధ్యాయంగా, బాల్య స్మృతులన్నీ కథగా మలిచింది.

ప్రపంచ సినీ చరిత్రలో, అద్భుత సౌందర్యవతిగా రెండుతరాల ప్రేక్షకులను మైమరిపించిన స్వీడిష్ నటి గ్రేటాగార్బో (1905-1990), 'గోస్టాబెర్లింగ్స్ సాగా'లో నటించడం ద్వారా 1924లో తన వెండితెర ప్రస్థానాన్ని ప్రారంభించింది.

– ఎం. వసంత

# మానవీయ విలువలకు పట్టం

**కులవర్గాది పరిధులకు అతీతంగా భాసిల్లే వైష్ణవ సంప్రదాయంలోని సమున్నత ఆదర్శాలను, గాంధీ సిద్ధాంతాలలోని ప్రధాన సూత్రాలను, సర్వసమ భావనను, మానవీయ మూల్యాల సారాన్ని తనలో జీర్ణించుకున్నారు డా. ప్రతిభా రాయ్. సమాజహితం కోసం కలాన్ని ఆయుధంగా స్వీకరించి శాంతి పూర్వక సమరశీల భావనతో ఒడిశా సాహితీరంగంలో అగ్రశ్రేణి కథకురాలిగా, నవలాకారిణిగా ప్రస్థానిస్తోందామె. తాను చేసిన సాహిత్యకృషికి గాను 2011 జ్ఞానపీఠ పురస్కారాన్ని అందుకున్నారామె.**



డా॥ ప్రతిభారాయ్

ప్రతిభారాయ్ ఒడిశా రాష్ట్రం జగత్సింగ్‌పూర్ జిల్లా (లోగడ కటక్ జిల్లాలో భాగం) బలికుడ ప్రాంతంలోని మారుమూల గ్రామం అలబోల్‌లో 1943 జనవరి 21న జన్మించారు. తండ్రి పరశురామ్‌దాస్ ఆదర్శ ఉపాధ్యాయులు. పైగా ఆయన గాంధేయవాది. వారు వైష్ణవ మతానుయాయులు. పరశురామ్‌దాస్ గొప్ప దేశభక్తుడు, స్వాతంత్ర్య సమరయోధుడు. అనేక దేశభక్తి గీతాలు రచించి పాఠశాలలో విద్యార్థులకు నేర్పేవారు.

ప్రతిభారాయ్‌పై తండ్రి ప్రభావం ఎంతగానో పడింది. తల్లి మనోరమాదేవి ఉత్తమ సంస్కారం గల గృహిణి. ప్రతిభారాయ్ ప్రాథమిక విద్యను, ఆ తర్వాత ఉన్నత పాఠశాల విద్యను బలికుడలో అభ్యసించారు. కటక్‌లోని రావెన్షా కళాశాలలో ఆమె డిగ్రీ చదివి, భువనేశ్వర్‌లోని ఉత్కళ్ విశ్వవిద్యాలయంలో ఉన్నతవిద్యను పూర్తిచేశారు. ఎం.ఇడి. చేశారు. 'ఎడ్యుకేషనల్ సైకాలజీలో పి. హెచ్‌డి పట్టా అందుకున్నారు. ఒడిశా ఆదివాసీలపై ఆమె ప్రామాణిక పరిశోధన గ్రంథం 'ట్రైబలిజమ్ అండ్ క్రిమినాలజీ అఫ్ బోండో హైలాండర్' మేధావుల ప్రశంసలను అందుకుంది. విద్యార్థిదశలోనే ఆమెలో సామాజిక చింతన, సాహిత్యాభిలాష వర్ధిల్లాయి. పాశ్చాత్య సాహిత్యం అధ్యయనం చేశారు. గోపినాథ్ మొహంతి, సీతాకాంత్ మహాపాత్రా, గోబ్రివ్ మార్క్వెజ్ తదితర ప్రముఖుల రచనల పట్ల ఆమెకు ప్రత్యేకాభిమానం. దెంకహాల్‌లో కపిల కన్యాశ్రమ్ విద్యాలయ ప్రధానోపాధ్యాయినిగా ఉద్యోగ జీవితానికి శ్రీకారం చుట్టారు. తర్వాత కటక్‌లోని రావెన్షా కళాశాలలో అధ్యాపక పదవి చేపట్టారు. పిమ్మట భువనేశ్వర్‌లోని బి.జె.బి. కళాశాలలో రీడర్‌గా చేరారు. 1998లో ఒరిస్సా పబ్లిక్ సర్వీస్ కమీషన్ సభ్యులుగా నియమితులై 2004 వరకు ఆ పదవిని అత్యంత సమర్థంగా నిర్వహించారు. ఆమె భర్త అక్షయ చంద్రరాయ్ ఒడిశా ప్రభుత్వ జలవనరుల శాఖలో చీఫ్ ఇంజనీర్‌గా ఉన్నత పదవిని అలంకరించారు. ప్రతిభా రాయ్ నేషనల్ బుక్‌ట్రస్ట్, ఇండియన్ రెడ్ క్రాస్ సొసైటి, ఇండియా ఇంటర్నేషనల్ సెంటర్, ఫిలిం సెన్సార్ ఇండియన్ కౌన్సిల్ ఫర్ కల్చరల్ రిలేషన్స్ వంటి ప్రముఖ సంస్థలకు విశేష సేవలం





దిస్తున్నారు.

ప్రతిభారాయ్‌లో రచనా సామర్థ్యం సహజాతం. దీనికితోడు తల్లిదండ్రుల ప్రోత్సాహం మరింత దోహదకారిగా నిలిచింది. తొమ్మిది సంవత్సరాల ప్రాయంలోనే ఆమె కవిత ఒకటి పిల్లల పత్రిక 'ఝుంకార్'లో ప్రచురితమయింది. అందులోని నిశిత సామాజిక స్పృహ భావదృఢి అప్పట్లోనే పాఠకుల్ని ఆశ్చర్యపరచింది. సర్వజన శ్రేయస్సు, సర్వులపట్ల ప్రేమాదరాలు ఆమె రచనలకు భూమిక. సమాజంలోని ఎన్నో అక్రమాలు, అన్యాయలు, అవినీతిపై ఆమె కొరడా ఝుళిపిస్తారు. మూఢాచారాలను, పితృస్వామ్య వ్యవస్థలోని అవాంఛనీయ ధోరణులను తీవ్రంగా నిరసించారు. సమానత్వం చాలా అవసరమని ఆమె గట్టివిశ్వాసం. వర్గ, కుల, మత, లింగాది కారణాలపై వివక్షను ప్రతిభారాయ్ దుయ్యబట్టారు. ఆమె రచనల్లోని భావజాలాన్ని బట్టి ఆమెను కమ్యూనిస్ట్ అని కొందరంటే, మరికొందరు స్త్రీవాది అన్నారు. కాని అమె మాత్రం తాను మానవతావాదినని స్పష్టపరిచారు.

ఆమె సంఘ సంస్కరణాభిలాషి. పూరీ జగన్నాథ్‌స్వామి ఆలయంలో చోటుచేసుకున్న వివక్షపై తీవ్రంగా స్పందించినందుకు ఒక సందర్భంలో ఆమెపై పరువునష్టం వ్యాజ్యం కూడా నడిచింది. ఒడిశా వరద బాధితులకు ఆమె ఎంతో తోడ్పాటునందించారు. అనాథ బాలబాలికలకు, వితంతువులకు ప్రతిభారాయ్ విశేష సహాయం సమకూర్చారు. ఆమె రచనల స్వరూప స్వభావాలను అవగాహన చేసుకునేందుకు ఈ నేపథ్యం ఉపకరిస్తుంది. 'బర్షా బసంత బైశాఖ' ఆమె తొలి నవల. బాల్యం, గృహిణి జీవితం, వృద్ధాప్యం ఈ మూడుదశలలో భారతీయ స్త్రీ స్థితిగతుల్ని విశ్లేషణాత్మకంగా ఈ నవల చూపుతుంది.

మనుష్యుల మనస్తత్వంలోను, ప్రవర్తనలోను దాగివున్న విచిత్ర కోణాలను ఆవిష్కరిస్తూ అద్భుత శిల్పనైపుణ్యంతో రూపుదిద్దుకున్న నవల 'మేఘమేదుర'. ఇక 'శిలాపద్మ' నవలకు విశ్వవిఖ్యాతిగాంచిన కోణార్క సూర్య దేవాలయమే స్ఫూర్తి. ఆ ఆలయ నిర్మాణం వెనుకవున్న ఎన్నో చారిత్రక విశేషాలను, పురాణగాథలను ఈ నవలలో ప్రామాణికంగా, రసబంధురంగా చిత్రించారు. ఇప్పటివరకు ఆమె అరణ్య, నిశీథపృథ్వి, పరిచయా, అపరిచిత, పుణ్యతోయ, నీలతృష్ణ, సముద్రార స్వర, దేహాతీత్, మహామోహ్, మగ్నమతి, యాజ్ఞసేని మొదలైన ఇరవైకి పైగా నవలలను రచించారు. వీటిలో 'యాజ్ఞసేని' తలమానికంగా నిలుస్తుంది. ఇది ద్రౌపది ఆత్మకథ. ఆమె మరోపేరు 'కృష్ణ'. ఈ నవలలో ఆ పేరే ఎక్కువసార్లు ఉపయోగించారు. రచయిత్రి నవల గురించి ఇలా అన్నారు- కర్మ, జ్ఞానం, శక్తి మూర్తీభవించిన యాజ్ఞసేని స్త్రీత్వానికే పర్యాయపదం. ఆమె మాదిరి బాధ, అవమానం, మనోవే

దన, సంఘర్షణ అనుభవించిన స్త్రీ ఇప్పటివరకు ధరణిలో జన్మించలేదు. భారతం పూర్తిగా చదవకుండా మిడిమిడి జ్ఞానంతో, సంకుచితంగా, మన మహోన్నత సంస్కృతి అని కొందరు ఏవేవో చెబుతున్నారు. ఈ నవలకు వ్యాసభారతం ఆధారం. సరళభారతం ప్రభావం కూడా కొంత వుంది. నవలా రచనకు అవసరమైన సందర్భాల్లో కొన్ని మార్పులు చేశాను. ఒక సాధారణ స్త్రీగా ద్రౌపది మనోగతాన్ని చూపించే ప్రయత్నం చేశాను. కృష్ణుడు, కృష్ణ పేర్లు జోడించి వారి మధ్య అలౌకిక ప్రేమను చిత్రించాను. వారి మధ్య సఖా సఖి బాంధవ్యం లోగడ కొందరు చూపారు. కృష్ణుని మహత్తర వ్యక్తిత్వం ఎరిగిన తర్వాత ఏ స్త్రీ అయినా, ఏ యుగంలోనైనా అతన్ని ప్రేమించక వుండగలరా?

ఈ నవల ద్రౌపది కృష్ణునికి రాసిన లేఖ రూపంలో వుంది. భర్తలతో స్వర్గారోహణ సమయంలో హిమపర్వతంపైన పాదాలు జారి ద్రౌపది పడుతుంది. పతులు వెనక్కి తిరిగి చూడరు. హృదయం గాయపడుతుంది. అప్పుడు తన జీవిత చరిత్ర కృష్ణునికి నివేదిస్తుంది. అదే ఇతివృత్తం. ద్రౌపది జీవితంతోపాటు భారత కథ చోటుచేసుకుంది. నవల ఉద్విగ్నతతో, కవితాత్మకంగా సాగుతుంది. వాచలిగా: "మోరా సారాజీవన్ దర్కార్ నహీ. ముహూర్తద్ తైపైహ్యా పచ్చాకె కర్మిరాహత, జ్ఞానిర ఆభీ ఏబం భక్తార హృదయ దెతుమారి పై జన్మదితు- తుమారిపై మరనాదియా- సఖా" అంటే - "నాకు పరుల జీవితం అక్కరలేదు. కర్మిష్ఠిచేతులు, జ్ఞాననేత్రాలు, భక్తుని హృదయం ఇచ్చి ఒక్కక్షణమైనా నాకోసం జన్మనెత్తనివ్వు, నీకోసం మరణించనివ్వు, సఖా" 'సమాప్తం' అనే పదంతో ఆరంభమైన ఈ నవల, 'ఇది లేఖకాదు, ఇది నా జీవితం. జీవిత పునరావృత్తికి నా ఆకాంక్ష' అనే వాక్యంతో ముగుస్తుంది. సమ్మోహనంగా గొప్పశిల్ప వైరుధ్యంతో నడిచి ఆలోచింపచేసే, అద్భుత నవల ఇది. ప్రతిభారాయ్ ఇప్పటికే ఇరవై నాలుగు కథా సంపుటాలు వెలువరించారు. అర్ధరాత్రి శుద్ధోధనుడు రాజప్రాసాదం విడిచి వెళ్లిపోవడంతో యశోధర శోకం ఆధారంగా రచించిన ఇతిబత్ కథ చాల ప్రసిద్ధి గాంచింది. మోక్ష, చంద్రభాగా ఓ చంద్రకళా, అసమాప్త, హరిపత్ర, మనుష్యస్వర, నివేదనం ఇదం, ఉల్లంఘన, భగవనర దేస, అబ్యుక్త మొదలైన కథాసంపుటాలు ఆమె కథా నిర్మాణ కౌశలానికి దర్పణాలు. ఆమె ఇంకా మూడు యాత్రా గ్రంథాలను, పది బాల సాహిత్య

**ప్రతిభారాయ్ రచనలలో 'యాజ్ఞసేని' తలమానికంగా నిలుస్తుంది. ఇది ద్రౌపది ఆత్మకథ. ద్రౌపది మరోపేరు 'కృష్ణ'. ఈ నవలలో ఆ పేరే ఎక్కువసార్లు ఉపయోగించారు. రచయిత్రి నవల గురించి ఇలా అన్నారు-**

**కర్మ, జ్ఞానం, శక్తి మూర్తీభవించిన యాజ్ఞసేని స్త్రీత్వానికే పర్యాయపదం. ఆమె మాదిరి బాధ, అవమానం, మనోవేదన, సంఘర్షణ అనుభవించిన స్త్రీ ఇప్పటివరకు ధరణిలో జన్మించలేదు. భారతం పూర్తిగా చదవకుండా మిడిమిడి జ్ఞానంతో, సంకుచితంగా, మన మహోన్నత సంస్కృతి అని కొందరు ఏవేవో చెబుతున్నారు.**

గ్రంథాలను రచించారు. ఆమె రచనలు పెక్కు భారతీయ భాషల్లోకి, విదేశీభాషలలోకి అనువాదమయ్యాయి.

ప్రతిభారాయ్ రష్యా, అమెరికా, ఇంగ్లండ్, ఆస్ట్రేలియా, స్విట్జర్లాండ్, డెన్మార్క్, ఫిన్లాండ్, స్వీడన్, ఫ్రాన్స్, నార్వే మొదలైన ముప్ఫై దేశాలు పర్యటించారు. అనేక విశ్వవిద్యాలయాలలో ప్రసంగించారు. ఒడిశా సాహిత్య అకాడమీ, కేంద్ర సాహిత్య అకాడమీ, మూర్తిదేవీ, అమృతకీర్తి, సరళ తదితర అవార్డులను ఆమె అందుకున్నారు. ఒరియాలో జ్ఞానపీఠ్ పురస్కారం అందుకున్న తొలి మహిళ ప్రతిభారాయ్ కావడం గమనార్హం. కేంద్ర ప్రభుత్వం 'పద్మశ్రీ' గౌరవం ప్రదానం చేసింది. 'రచనే నాశక్తి, నా బలహీనత. రాయకుండా జీవించలేను. అన్యాయాలను చూస్తూ సహించలేను. ప్రాణం ఉన్నంతవరకు ఇదే నా వైఖరి' అని ప్రకటించిన విదుషీమణి. భువనేశ్వర్‌లో నివసిస్తూ బహుముఖ కార్యక్రమాలతోపాటు రచనావ్యాసంగాన్ని కొనసాగిస్తున్న గొప్ప సాహితీ తపస్విని ప్రతిభారాయ్.

*- గోవిందరాజు రామకృష్ణారావు*



# చతుర ప్ర.జ.

**పాఠకుల ప్రశ్నలకు అవధాన సరస్వతి డా. మేడసాని మోహన్ సమాధానాలు**

ప్ర. 'వారిజాక్షులందు... బొంక వచ్చునధిపా' అని భాగవతంలో చెప్పారు. మరి బొంకకూడని సందర్భాలేవి?

– **డా. శివభూషణం**, కర్నూలు

జ.. వారిజాక్షులందు, వైవాహికములందు, ప్రాణ విత్తమాన భంగమందు, చకిత గోకులాగ్ర జన్మరక్షణమందు - బొంకవచ్చును- అని భాగవతంలో పేర్కొనడం శుక్రనీతి. ఇక్కడ మనం ఒక అంశం గమనించాలి. శుక్రుడు రాక్షస కుల గురువైనందు వల్ల రాక్షసులకు ఆచరణీయమైన నీతిని బోధించినాడు. సత్య ధర్మనిష్ఠ గలిగిన దైవీసంస్కార సంపన్నులకు ఇది వర్తించదు. అటువంటి వారు ఎట్టి సందర్భాలలోను బొంకరు. బలి చక్రవర్తి కూడా అప్పటికే దైవీసంస్కారం పెంపొందించుకొని విష్ణుదేవుని అనుగ్రహానికి పాత్రుడు కావాలని తపిస్తున్నందువల్ల బొంకలేదు.

ప్ర. అపార్ట్‌మెంటులో పూజకు తూర్పుదిక్కుకు చూసేలా పడమటి గోడకు ఆన్చి దేవుని విగ్రహాలు అమర్చవచ్చా? పూజ చేసేవారు పడమటి ముఖంగా కూర్చోవచ్చా?

– **గుండిమెడ శ్రీదేవి**, అహమ్మదాబాద్, గుజరాత్

జ. అపార్టుమెంటులో పడమటి గోడకు ఆన్చి దేవుని విగ్రహాలు అమర్చవచ్చు. పూజ చేసేవారు పడమటి ముఖంగా కూర్చోవచ్చు. మేము మా స్వగృహంలో కూడా సరస్వతీదేవిని ఇలాగే పూజిస్తూ ఉన్నాం.

ప్ర. సాధారణంగా దుర్గాదేవి పూజ సమాప్తమయిన తరువాత సాంబ్రాణి ధూపం వేస్తారు. మిగతా దేవతల పూజలో వినియోగించరు. కారణం ఏమిటి?

– **కన్నేపల్లి నారాయణమూర్తి**, శ్రీకాకుళం

జ. జీవులకు దుర్గమమైన మార్గాలన్నీ సుగమం చేసే శక్తిస్వరూపిణి దుర్గాదేవి. 'విద్వేషి వర్గ హననేచ తమాల నీలాం' అని ఆ శక్తి స్వరూపిణి తత్త్వాన్ని ఉపాసకులు భావిస్తారు. ఇది సంకేతాత్మకమైన భావన. దుర్గాదేవికి ప్రీతి పాత్రమయిన తమాల నీలవర్ణాత్మకమైన సాంబ్రాణి ధూపం సమర్పించడంలోని ఆంతర్యమిదే.

ప్ర. శ్మశానానికి స్త్రీలను ఎందుకు నిషేధించారు? ప్రస్తుత కాలంలో స్త్రీలు తలకొరివి పెడుతున్నారు, ఇది శాస్త్ర సమ్మతమేనా?

– **మొహమ్మద్ ఖాసిం**, కల్లూరుగూడెం, ఖమ్మం జిల్లా

జ. ప్రాచీన భారతీయ సంస్కృతిలో స్త్రీల సౌభాగ్యానికి సౌందర్యానికి, సౌకుమార్యానికి అత్యంత ప్రాధాన్యం, ఆరాధనా తాత్పర్యం ఉన్నట్లు తెలుస్తూ ఉంది. వారి సౌకుమార్యాదు

## రూ.116/- బహుమతి పొందిన ఉత్తమ ప్రశ్న

ప్ర. ఉంగరం ధరించేప్పుడు దేవుని ముఖం గోళ్లవైపు ఉండాలా? లేక అందుకు భిన్నంగా ఉండాలా?

– **పక్క సుందరీకృష్ణ**, గరివిడి, విజయనగరం జిల్లా

జ. సహజంగా దేవుని ముఖం గోళ్లవైపు ఉండేట్టుగా ఉంగరం ధరించడమే సముచితం. నిద్రలేచిన వెంటనే ఉంగరంలోని దైవస్వరూపాన్ని మన చేతిలో దర్శించడం శుభదాయకంగా పెద్దలు పేర్కొంటారు. అలా దర్శించాలంటే గోళ్లవైపు దేవుని ముఖం ఉన్నప్పుడే సౌకర్యంగా కూడా ఉంటుంది.

లను దృష్టిలో ఉంచుకొని కొన్ని నిషేధాలు విధించినారు. శ్మశాన ప్రవేశ నిషేధం కూడా అలాంటిదే. ప్రస్తుతకాలంలో స్త్రీలు తలకొరివి పెట్టడం శాస్త్రసమ్మతం కాదు. అధునాతన నాగరికతా దృక్పథాలలో వచ్చిన మార్పు ఇది.

ప్ర. ఏ దిక్కుకూ లేని అత్యంత ప్రాధాన్యం తూర్పు దిక్కుకే ఎందుకిస్తారు?

**– యు. చిట్టిబాబు,** కొత్తపాల్వంచ, ఖమ్మం జిల్లా

జ. తూర్పు దిక్కునకు ప్రాధాన్యం పంచభూతాత్మకమైన ప్రకృతిసిద్ధంగానే లభించింది. సూర్యోదయం, సంపూర్ణచంద్రోదయం తూర్పుననే కదా సంభవిస్తాయి. అష్టదిక్పాలకులకు నాయకుడైన దేవేంద్రుడు తూర్పు దిక్కునకు అధిపతి.

ప్ర. కృష్ణుడి వద్ద మాయలున్నట్లు రాముడి వద్ద లేవు కదా! అలాంటప్పుడు రాముడి పాదం తగిలి రాయి అహల్యగా ఎలా మారింది?

**– విక్కునూరి రాజేశ్వర్,** నిర్మల్, ఆదిలాబాద్ జిల్లా

జ. శ్రీకృష్ణుడు లీలామానుష విగ్రహుడిగా, శ్రీరాముడు మర్యాదా పురుషోత్తముడిగా యోగులచే కీర్తింపబడినారు. శ్రీకృష్ణునిలో మాయలు, లీలలు రెండూ ఉన్నాయి. శ్రీరామునిలో లీలావిభూతి ఉన్నది. అటువంటి లీలావిభూతిలో ఒక లీల రాతిని నాతి చేయడం.

ప్ర. 'హిందువులు' అన్న పదం ఎలా వచ్చింది? అర్థం ఏమిటి?

**– ఎన్. విజయలక్ష్మి,** ఒంగోలు

జ. 'సింధు' శబ్దం నుండి 'హిందు' శబ్దం ఏర్పడిందని భాషాశాస్త్రజ్ఞులు పేర్కొంటారు. సింధు శబ్దానికి సింధూనది అని, సముద్రం అని కూడ అర్థాలు ఉన్నాయి. అంటే సింధూనదీ తీరంలో నివసించే ప్రజలను (ఉత్తరభారత దేశస్థులు) మూడు సముద్రాల మధ్య ఉన్న భూమిపై నివసించే ప్రజలను (దక్షిణ భారతదేశస్థులు) 'హిందువులు'గా వ్యవహరిస్తున్నారు.

ప్ర. తల్లిదండ్రులున్నవారు శవాన్ని మోయకూడదంటారు. శ్మశానికి వెళ్లకూడదంటారు.. కారణమేమిటి? సేవాధర్మంతో చేస్తే అనర్థమా?

**– ఎ.ఎస్.ఎన్. మూర్తి,** హైదరాబాద్

జ. తల్లిదండ్రులు ఉన్నవారు శవాన్ని మోయకూడదనటం ఎక్కడో ఒక ప్రాంతానికి చెందిన విశ్వాసం కావచ్చు. శ్మశానానికి వెళ్ళకూడదనటం కూడ అటువంటిదే. ఇటువంటి పనులు సేవాధర్మంగా చేయడంలో ఎటువంటి అనర్థం రాదు.

ప్ర. శ్రీకృష్ణభగవానుడు మురళీగాన సమయంలో త్రిభంగిగా ఎందుకు నిల్చుంటాడు? నెమలి పింఛం ధరించడంలో అంతరార్థం?

– పూడి పెద్ది నీలవేణీ,

శృంగవరపుకోట, విజయనగరం జిల్లా

జ. శ్రీకృష్ణభగవానుడు సంపూర్ణావతారుడు. త్రికాలాబాధ్యమైన త్రిమూర్త్యాత్మక తత్త్వంతో ప్రకాశించేవాడు. అందులోనూ మురళీగాన సమయంలో నాద, బిందు, కళాత్మకమైన నిశ్చల యోగస్థితిని ఆ గానాన్ని ఆలకించే యోగులకు ప్రసాదిస్తాడు. ఆవిధంగా నాద, బిందు, కళలకు శ్రీకృష్ణుని త్రిభంగిరూపం ప్రతీకాత్మకం. ఇక నెమలి పింఛం సృష్టి ఉన్మేషణ స్థితికి ప్రతీకాత్మకం. అవ్యక్తస్థితిలో ఉండే సృష్టి వ్యక్తస్థితికి వికసించాలంటే సముచిత సమున్మేషణం అవసరం. ఈ సమస్త సృష్టిని వికసింపచేయడానికి, నాదబిందు కళాత్మకంగా లయింపజేయడానికి శ్రీకృష్ణ భగవానుడే కారకుడు అని త్రిభంగిలోను, మురళీగానంలోను ఉన్న అంతరార్థం.

ప్ర. కన్నప్ప శివలింగాన్ని ఎంగిలి నీటితో అభిషేకించి మాంసాన్ని నైవేద్యంగా సమర్పించాడు. భక్తులకిది తగునా?

– గజ్జెల కనకరాజు, సిద్ధిపేట, మెదక్ జిల్లా

జ. కన్నప్ప శివలింగాన్ని ఎంగిలి నీటితో అభిషేకించడం, మాంస నివేదనం చేయడం అతని నిష్కల్మషమైన మూఢభక్తికి నిదర్శనం. దీనినే ధూర్జటి మహాకవి 'శ్రుతి వ్యవహారేతరమతం' అని వర్ణించినాడు. అంటే భగవదారాధనా పద్ధతులు తెలియజెప్పే శ్రుతిస్మృతుల పట్ల కన్నప్ప ప్రాథమిక అవగాహన కూడ లేనివాడు. కానీ భగవంతుని పట్ల అచంచల భక్తి ప్రగాఢంగా ఉంది. ఈ అంశాన్నే పరమశివుడు స్వీకరించినాడు. శ్రీకృష్ణుని ఉపాసించిన భక్తులలో ఘంటాకర్ణుని వృత్తాంతం కూడ ఇటువంటిదే.

ప్ర. పితృశాపం వల్ల పిల్లలు అవిటివాళ్లుగా మనో రుగ్మతలతోను పుడతారనడం సత్యమేనా? పెద్దలు పిల్లల్నిలా శపిస్తారా?

– లక్ష్మీరంగరాజన్, ఎగ్మూర్, చెన్నై

జ. పితృదేవతల పట్ల కృతజ్ఞతతో కూడిన భక్తిభావం కలిగి ఉండాలి. సముచితంగా శ్రాద్ధా

# చతుర ప్ర.జ. 8

ఉత్తమ ప్రశ్నకు రూ.116/-

ప్రశ్న: ..........................................................

..........................................................

..........................................................

..........................................................

పంపినవారి పేరు: ----------------------------------------

వయసు (     ) చిరునామా: ----------------------------------

----------------------------------------------------------

------------------పిన్ : ------------- ఫోన్ : ---------------

**సూచనలు**

* ఉత్తమ ప్రశ్నను అవధాని డా. మేడసాని మోహన్ ఎంపిక చేస్తారు * మీ ప్రశ్న ద్వారా రాబట్టే సమాధానం పదుగురికీ ఉపయోగపడేలా ఉంటే మేలు * ఏ నెల ప్రశ్నలు ఆ నెల కూపన్‌లోనే నింపి పంపాలి * ప్రశ్న స్పష్టంగా, సంక్షిప్తంగా ఉండాలి * ఒకరు ఎన్ని ప్రశ్నలయినా పంపవచ్చు. ఒక కూపన్‌పై ఒక్క ప్రశ్న మాత్రమే రాయాలి * తుడుపులు, కొట్టివేతలొద్దు * ప్రశ్నల ఎంపికలో సంపాదక వర్గానిదే తుది నిర్ణయం * ఉత్తర ప్రత్యుత్తరాలకు తావులేదు * ఈ కూపన్లు కూడా తక్కిన వాటితో కలిపి ఒకే కవరులో పంపవచ్చు

చిరునామా : **చతుర ప్ర.జ.**

చతుర, ఈనాడు కాంపౌండ్, సోమాజిగూడ, హైదరాబాద్ - 082

దులు, నివేదనలు చేయడం మంచిది. అవి చేయనంత మాత్రాన వారేమీ శపించరు. అయితే వారిపట్ల కృతఘ్నతాభావం వల్ల తత్పర్యవసానంగా పిల్లలు అవిటివాళ్ళు, మనోరుగ్మతలు కలిగినవారు కావచ్చు.

ప్ర. శౌచానికి, అశౌచానికీ గోవింద నామస్మరణమే చేస్తారెందుకు?

**– నోరి శివప్రకాశం,** నెల్లూరు

జ. గోవింద నామాన్ని సంకీర్తనం చేయడం వల్ల జీవుని ఆవరించిన భయాలన్నీ తొలగిపోతాయని బ్రహ్మసంహిత, భాగవతం వంటి అనేక గ్రంథాలు పేర్కొంటున్నాయి. అందుకే సర్వకాల సర్వావస్థలలో గోవింద నామస్మరణం ఎంతో శ్రేష్ఠంగా సంప్రదాయజ్ఞులు పేర్కొంటారు.

ప్ర. తల్లి లేక తండ్రి మరణించినప్పుడు విదేశాల నుంచి పిల్లలు వచ్చేదాకా అంత్యక్రియలు జరుపకుండా పార్థివ దేహాన్ని ఉంచడం శాస్త్రసమ్మతమేనా?

**– టి. ప్రసాద్,** టి. నగర్, చెన్నై

జ. తల్లి లేక తండ్రి మరణించినప్పుడు విదేశాల నుంచి పిల్లలో, దగ్గరి బంధువులో వచ్చేదాకా అంత్యక్రియలు జరపకుండా పార్థివదేహాన్ని ఉంచడం శాస్త్రసమ్మతంగానే భావింపవచ్చు. సత్యభామ మృతుడైన తన తండ్రి పార్థివదేహాన్ని నూనెపెట్టెలో భద్రపరిచి, ఆ సమయంలో ఇంద్రప్రస్థపురంలో ఉన్న శ్రీకృష్ణుడు వచ్చేవరకు అలాగే ఉంచి తరువాత ఉత్తరక్రియలు నిర్వహించినట్లుగా ఉంది. భాగవతంలోని దశమస్కంధంలో వర్ణింపబడిన ఈ సన్నివేశం ఇటువంటి సందర్భాలలో ప్రామాణికంగానే భావింపవచ్చు.

ప్ర. గోత్రాలంటే ఏమిటి? వధూవరుల మేనమామ గోత్రాలు ఒక్కటైతే పెళ్లి చేయకూడదనడం శాస్త్ర సమ్మతమేనా?

**– మామిడి మహేంద్ర,** పుణె, మహారాష్ట్ర

జ. మానవసృష్టి వికసించడానికి ప్రకృతి శక్తులెన్నో దోహదం చేస్తుంటాయి. ఈ ప్రకృతి శక్తుల సమాహారభూతమైన సమిష్టితత్త్వాన్నే ప్రాచీనులు గోత్రం అని పేర్కొన్నారు. అందుకే ఈ గోత్రనామాలలో మహర్షుల పేర్లు, నదుల పేర్లు, కొండల పేర్లు ఉంటాయి. వధూవరుల ఇంటిపేర్ల గోత్రాలు ఒకటైతే వివాహం చేయకూడదు. మేనమామల గోత్రాలతో నిమిత్తం లేదు.

ప్ర. ఆడవారు పూజ చేసేప్పుడు హారతిచ్చి, గంట కొట్టవచ్చా?

**– ఎం. వసంత,** గాయత్రీనగర్, హైదరాబాద్

జ. ఆడవారు పూజ చేసేటప్పుడు హారతి ఇచ్చి, గంటకొట్టడం శాస్త్రవిరుద్ధం కాదు. గోదాదేవి వంటి స్త్రీభక్తశిఖామణులు ఈ కైంకర్యాలన్నీ నిర్వహించినట్లు ప్రాచీనగ్రంథాలు పేర్కొంటున్నాయి.

ప్ర. భార్యను అడవికి పంపి రాజ్యమేలిన రాముడు ప్రతిగుడిలో సతీసమేతంగా కనిపిస్తాడు. సతికి దేహంలో సగమిచ్చిన శివుడి గుడిలో అమ్మవారిని విడిగా ఉంచుతారు. ఏమిటీ వైచిత్ర్యం?

**– లింగాల సాంబశివరావు,**
మందపాడు, కృష్ణా జిల్లా

జ. రామాలయాలలో రామునిమూర్తినైనా, శివాలయాలలో శివునిమూర్తినైనా 'అర్చామూర్తి'గా భావించాలి. అర్చామూర్తులకు నిర్వహించే పూజాదికాలు ఎలా ఉండాలో ఆగమశాస్త్రాలు నిర్ణయిస్తాయి. ఈ ఆగమశాస్త్రాలను మంత్రద్రష్టలైన మహర్షులు నిర్ణయిస్తారు. శివాలయాలలోని లింగాకారానికి సంబంధించిన పానవట్టం అమ్మవారి స్వరూపం. కాబట్టి శివలింగాన్ని సేవిస్తే పార్వతీపరమేశ్వరులను సేవించినట్లే.

ప్ర. గత జన్మలో పాపపుణ్యాలు సమంగా ఉంటేనే మనిషి జన్మ ఎత్తుతారంటారు.. మరి ధనవంతుడు.. నిరుపేద, సత్పురుషుడు.. దుష్టుడు ఇలా తేడాలేమిటి?

**– తటవర్తి ఇందిరా నాగమణి,** బెంగళూరు

జ. ధనవంతుడు, నిరుపేద, సజ్జనుడు, దుష్టుడు- వంటి తేడాలకు ఆయా జీవుల పాపపుణ్యాల కర్మబంధాలు, హృదయసంస్కారాదులే కారణం. వీటన్నిటికీ ప్రధాన కారణాలైన భవబంధాలను తొలగించడానికే అందరూ భగవంతుని ఆశ్రయించాలి.

ప్ర. ఆంజనేయస్వామి చిరంజీవి కదా! బతికి ఉండగానే విగ్రహాలు పెట్టడం సబబేనా?

**– బమ్మిడి సుబ్బారావు,**
కాశీబుగ్గ, శ్రీకాకుళం జిల్లా

జ. ఆంజనేయస్వామి సామాన్యజీవుల కోవకు చెందిన చిరంజీవి కాదు. రామానుగ్రహం చేత భగవల్లక్షణాలైన సర్వజ్ఞత్వ, సర్వవ్యాపకాది లక్షణాలన్నీ యోగబలంతో ఆయనకు సంక్రమించాయి. అందుకే ఆయన మూర్తులను మనం పూజిస్తాం. అశ్వత్థామ వంటి చిరంజీవులు కూడా ఉన్నారు. కానీ వారికి సర్వజ్ఞత్వం, సర్వవ్యాపకత్వం- వంటి భగవల్లక్షణాలు లేవు ©

# ఆఫ్రికన్ సాహిత్య వైతాళికుడు చినువా అచెబె

బాల్యంలో అచెబెను బాగా ప్రభావితం చేసిన పుస్తకం, అమెరికన్ బానిస బుకర్ టి వాషింగ్టన్ రాసిన 'అప్ ఫ్రం స్లేవరీ' (1901). చిరకాలం వలసపాలనలో మగ్గిన నైజీరియాకు, ఆ పుస్తకంలో చదివిన బానిస విధానానికీ సారూప్యం కనిపించింది. కేవలం చర్మం రంగు ఆధారంగా, తెల్లవాళ్లు తమను అనాగరికులుగా, తక్కువ రకం మనుషులుగా చూడటం ఈ లోకంలోని విషాద వాస్తవం. అయితే ఈ అన్యాయానికి స్పందించటం ఎలా? క్లాసిక్ నవలలు 'గలివర్ సాహసయాత్రలు', 'డేవిడ్ కాపర్ ఫీల్డ్', 'ట్రెజర్ ఐలండ్' వగైరాలు చదివి చినువా అచెబె సాహిత్యం పట్ల అభిరుచి పెంచుకున్నాడు. ఏదో వెలుగురేక కనిపించింది.

పశ్చిమదేశాల వలస నాగరికతకూ, సాంప్రదాయిక ఆఫ్రికన్ విలువలకూ జరిగిన సంఘర్షణే అచెబె నవలల్లో ఇతివృత్తం. ముఖ్యంగా క్రైస్తవ మత ప్రభావంతో తమ విశ్వాసాలు, సంస్కృతి అంతరించి పోతున్నాయి. తను పుట్టి పెరిగిన ఇగ్బో సమాజం గురించి రాశాడు అచెబె. తరతరాలుగా వస్తున్న తమ ఆచార వ్యవహారాలు, జానపద కథలు, మౌఖిక కథన సంప్రదాయం మేళవించిన 'అత్యాధునిక, అతిప్రాచీన' శైలి ఆయన ప్రత్యేకత. అచెబె తొలి నవల 'థింగ్స్ ఫాల్ అపార్ట్'. అత్యంత ప్రాచుర్యం పొందిన ఆఫ్రికన్ నవల కూడా ఇదే. ఇప్పటికీ ఆయన పేరు చెప్పగానే అందరికీ గుర్తొచ్చే పుస్తకం ఇదే. డబ్ల్యు.బి. ఏట్స్ రాసిన 'ది సెకండ్ కమింగ్' కవితలోని ఒక చరణమే ఈ పేరు.

యాం(పెండలం) దుంపలు సాగుచేసే రైతు ఒకొంక్వో కథ ఇది. నైజీరియా, బ్రిటిష్ వాళ్ల వలస దేశంగా ఉన్నప్పుడు ఈ కథ జరుగుతుంది. 1958లో అచ్చయిన ఈ నవల, ఆఫ్రికన్ల జీవన సంఘర్షణను తొలిసారిగా పాశ్చాత్య పాఠకులకు పరిచయం చేసింది. ఇప్పటికి 80 లక్షల ప్రతులకు పైగా అమ్ముడు పోయింది. 50 భాషల్లోకి అనువాదమైంది.

మే, 1967లో నైజీరియా ఆగ్నేయ ప్రాంతం, విడిపోయి 'రిపబ్లిక్ ఆఫ్ బయాఫ్రా'గా ప్రకటించుకున్నప్పుడు ప్రభుత్వం దాన్ని ఉక్కుపాదంతో అణచివేయటానికి ప్రయత్నించింది. అచెబె అనుంగు మిత్రుడొకడు ఈ వేర్పాటు వాదాన్ని సమర్థించాడు. బయాఫ్రా విముక్తి సైన్యంలో కూడా చేరాడు. ఫలితంగా అచెబె ఇంటి మీద బాంబులు వేసింది సైన్యం. భార్యా పిల్లలూ ఇంట్లో లేకపోవటంతో ప్రాణనష్టం జరగలేదు. ఆ తర్వాత కూడ అనేకసార్లు దాడులు జరిగాయి. ప్రతిసారీ త్రుటిలో తప్పించుకున్నారు.

యుద్ధం తీవ్రతరం కావటంతో కుటుంబంతో సహా, బయాఫ్రా రాజధాని 'అబా'కు తరలిపోక

తప్పలేదు. ఆ సంక్షోభంలో నవలలు రాసే తీరిక లేదు. కవితలు రాసి 'బివేర్, సోల్ బ్రదర్' పేరుతో ప్రచురించాడు.

యుద్ధం, సామాన్య ప్రజల్నే కాదు. రచయితల్ని, కళాకారుల్ని కూడా విడదీసింది. నైజీరియా, బయాఫ్రా రచయితల మధ్య విభేదాలు పెరిగాయి. బ్రిటిష్ ప్రభుత్వ సహాయంతో నైజీరియా సైనికపాలకుడు జనరల్ యాకుబూ గోవన్, అణచివేత కార్యక్రమం ప్రారంభించాడు. బయాఫ్రాలో పరిస్థితులు దయనీయంగా మారాయి. సెప్టెంబర్ 1968లో అబాను ఆక్రమించుకుంది నైజీరియన్ సైన్యం.

అంతకు రెండేళ్లముందు 1966లో ఒక వ్యంగ్య నవల 'ఎ మాన్ఆఫ్ ది పీపుల్' ప్రచురించాడు అచెబె. కొత్తగా స్వాతంత్ర్యం సంపాదించుకున్న ఒక ఆఫ్రికాదేశం అవినీతిమయం కావటం అందులోని కథాంశం. యాదృచ్ఛికంగా నవల అచ్చయిన కొద్ది కాలానికే ఒక సైనిక మేజర్ దేశంలోని ఉత్తర ప్రాంతంలో తిరుగుబాటు చేశాడు. ఇతర దేశాల్లో అనేక మంది కమాండర్లు అతణ్ణి అనుకరించారు. ప్రభుత్వం అందర్నీ నిర్దాక్షిణ్యంగా అణచివేసింది. మూడువేల మందికిపైగా హతులయ్యారు.

సైన్యం తిరుగుబాటు చెయ్యటం అచెబె నవలలోని ముగింపు. అది కేవలం ఊహ. కాని ప్రభుత్వంలోని పెద్దలకు అనుమానం పెరిగింది. ఈ తిరుగుబాట్ల గురించి రచయితకు ముందే సమాచారం వుండివుంటుందని వాళ్ల అంచనా. అచెబె మళ్లీ ఇగ్బో స్థావరం పోర్ట్‌హార్‌కోర్టులో తలదాచుకోక తప్పలేదు.

ఈయన ఇతర నవలలు 'నో లాంగర్ ఎట్ ఈజ్' (1960), 'ఆరో ఆఫ్ గాడ్' (1964), 'యాంట్‌హిల్స్ ఆఫ్ సవానా'(1987)లు కూడా విశేష ప్రాచుర్యం పొందాయి. ఈ చివరి నవల, ఆ సంవత్సరానికి మాన్ బుకర్ ప్రైజ్ పోటీలో ఫైనలిస్టుగా నిలిచింది. 2007లో అచెబెను మాన్ బుకర్ ప్రైజ్ అంతర్జాతీయ పురస్కారం వరించింది.

1975లో జోసెఫ్ కోన్రాడ్ ప్రసిద్ధ నవలిక 'హార్ట్‌ఆఫ్ డార్క్‌నెస్' (1902)లో రచయిత ప్రదర్శించిన జాత్యహంకార వైఖరిని ఎండగట్టిన అచెబె ఉపన్యాసం సాహిత్యలోకంలో దుమారం సృష్టించింది.

ఇరవయ్యో శతాబ్ది తొలి సంవత్సరాల్లో అచ్చయింది ఈ నవలిక. 'అప్పటికి లోకంలో జాతుల వివక్ష ఒక సమస్య కాలేదు' అన్నాడొక విమర్శకుడు. 'ఎవరి లోకంలో?' అని అచెబె ఎదురు ప్రశ్నించాడు.

1990లో నైజీరియాలో జరిగిన ఒక కారు ప్రమాదంలో అచెబె నడుము కిందిభాగం చచ్చుబడిపోయింది. మెరుగైన చికిత్స కోసం అమెరికాకు వెళ్ళక తప్పలేదు.

నైజీరియా ప్రభుత్వ జాతీయ పురస్కారం 'కమాండర్ ఆఫ్ ది ఫెడరల్ రిపబ్లిక్'ను రెండుసార్లు తిరస్కరించాడు అచెబె.

'మాసిక విశ్లేషణ, చైతన్య స్రవంతి, కథను నేరుగా చెప్పకుండా, సంఘటనలను కలగలపి ఒక విధ్వంస దృశ్యాన్ని సృష్టించటం పోస్ట్‌మాడర్నిజంలోని విలక్షణత. అచెబె ప్రతిభకు తార్కాణం ఈ విలక్షణతే. 'చదివిన ప్రతిసారీ



అతని రచనల్లో కొత్త అందాలను ఆస్వాదించవచ్చు' అంటుంది నోబెల్ గ్రహీత, దక్షిణాఫ్రికా రచయిత్రి నాడైన్ గార్డిమర్.

"సుదీర్ఘ కారాగార జీవితంలో నాకు స్ఫూర్తినీ, ధైర్యాన్నీ ఇచ్చాయి అచెబె నవలలు" అంటూ తన కృతజ్ఞతను ప్రకటించాడు నల్లసూరీడు నెల్సన్ మండేలా.

ఆల్బర్ట్ చినువా లుమోగు అచెబె పేరుతో 1930, నవంబరు 16న జన్మించిన చినువా అచెబె, అమెరికాలోని బాస్టన్ ఆస్పత్రిలో, తన ఎనభైరెండో ఏట 2013, మార్చి 21న తుదిశ్వాస విడిచారు.

(చినువా అచెబెకు 'చతుర' అక్షర నివాళి)

**– ముక్తవరం పార్థసారథి**

అన్నీ సరైన సమాధానాలు రాసిన
వారిలో డ్రా ద్వారా ఎంపికైన
ఈ విజేతకు రూ.150/-
త్వరలోనే అందుతాయి.

**యు. నాంచారమ్మ**
మచిలీపట్నం,
కృష్ణా జిల్లా
పిన్: 521 001

## చతురంగం - 25 జవాబులు

| | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| 1 ద | ధీ | 2 చి | | 3 ఈ | గ | | 4 అ | ప్రా | 5 జీ |
| ధి | | 6 రం | జి | త | | 7 జా | డ | | మూ |
| | 8 మా | జీ | | 9 రం | 10 గం | | 11 ఏ | 12 కృ | తం |
| 13 పాం | డ | వు | లు | | 14 గో | వు | | త | |
| చ | | లు | | 15 మం | త్రి | | 16 కు | వ | వే |
| 17 జ | మ | | 18 షిం | డే | | 19 సు | శ | ర్మ | |
| న్యం | | 20 రా | | 21 లా | 22 లా | జ | లం | | 23 అ |
| | 24 ప | రా | 25 కు | | 26 జ | నం | | 27 ఆ | మె |
| 28 ల | య | | 29 జ | 30 య | హో | | 31 స | వా | రి |
| 32 అ | నం | తం | | 33 సు | మం | త్ | | 34 లు | కా |

## సరైన సమాధానాలు రాసిన వారు

1. కన్నేపల్లి నారాయణమూర్తి, మంగువారితోట, శ్రీకాకుళం, 2. బచ్చు సత్యనారాయణ, కొత్తగూడెం, 3. ఇ.యల్. నరసింహారావు, మధిర, ఖమ్మం జిల్లా, 4. యల్లాప్రగడ కృష్ణమూర్తి, అలకాపురి, హైదరాబాద్, 5. వి.వి. సత్యనారాయణశెట్టి, బైరాగిపట్టెడ, తిరుపతి, 6. అత్తిలి కస్తూరిబాయి, బైరాగిపట్టెడ, తిరుపతి, 7. పాలకుర్తి సుధీర్‌కుమార్, మాదాపూర్, హైదరాబాద్, 8. పి. దేవసేనమ్మ, సిద్ధార్థనగర్, హైదరాబాద్, 9. ఆలూరి పార్థసారథి, వెలచేరి, చెన్నై, 10. జె.ఎస్. ఉమాదేవి, చోడవరం, విశాఖ జిల్లా, 11. కణుగుల గ్రీష్మ, కాలేజీరోడ్డు, శ్రీకాకుళం, 12. సిహెచ్. ఉమాబాల, దోమలగూడ, హైదరాబాద్, 13. ఎ. అరుంధతి, పుణె, మహారాష్ట్ర, 14. మానస యజ్ఞమూర్తి, మాసబ్‌ట్యాంక్, హైదరాబాద్, 15. చెరుకువాడ హర్ష, కేతినేనివారివీధి, విజయవాడ, 16. పి.ఆర్. నాయుడు, రైల్వేకాలని, తిరుపతి, 17. శ్రీదేవి, రావులపాలెం, 18. పెద్ది రాజేశ్వర్, సంగారెడ్డి, మెదక్ జిల్లా, 19. టి. ఉషశ్రీ, దగదర్తి, నెల్లూరు జిల్లా, 20. ఉపద్రష్ట నరసింహమూర్తి, లాలాపేట, సికింద్రాబాద్, 21. గుర్రాల దివ్య తేజ, మారుతీనగర్, గుంటూరు, 22. జె. వసంత, ట్రూప్‌బజార్, హైదరాబాద్, 23. టి.వి. నారాయణ, మల్కాజ్‌గిరి, హైదరాబాద్, 24. యం.వి.యన్. ధనలక్ష్మి, నరసాపురం, ప.గో. జిల్లా, 25. తటవర్తి రామలక్ష్మి, తాళ్లగడ్డ, హైదరాబాద్, 26. ఇందన మల్లిఖార్జున్‌రావు, తంగెళ్లమూడి, ఏలూరు, 27. పి.వి. రమణరావు, మల్కాజిగిరి, హైదరాబాద్, 28. గేదెల రామారావు, వినాయకనగర్, ఏలూరు, 29. యు. విజయశేఖరరెడ్డి, కూకట్‌పల్లి, హైదరాబాద్, 30. యు. జాన్సీలక్ష్మి, సాయిరామ్‌నగర్, హైదరాబాద్, 31. గరికిపాటి రాజాదత్తాత్రేయ, ప్రతాప్‌నగర్, కాకినాడ, 32. యు. చిట్టిబాబు, కొత్త పాల్వంచ, ఖమ్మం జిల్లా, 33. సి. విజయభాస్కర్‌రెడ్డి, ప్రకాశ్‌నగర్, ప్రొద్దుటూరు, 34. పక్కి శ్రీదేవి, గరివిడి, విజయనగరం జిల్లా, 35. పి. సుజాత, గుంటూరు, 36. జయశేషసాయి, అగ్రహారం, సామర్లకోట, 37. సిహెచ్. పరాత్పరరావు, ఏలూరు, ప.గో. జిల్లా, 38. ఆదుర్తి విజయమూర్తి, సి.బి.ఎమ్. కాంపౌండ్, విశాఖపట్నం, 39. బోడపాటి కృష్ణవేణి, టి. నగర్, చెన్నై, 40. ఎమ్.వి.ఎస్. రామశేషు, బ్రాడీపేట, గుంటూరు, 41. సి. అల్వాల్‌రెడ్డి, సరూర్‌నగర్, హైదరాబాద్, 42. పి.వి. రవికుమార్, కె.టి. రోడ్డు, తిరుపతి, 43. కె. పండరిపాదాలు, బాలాజీనగర్, నెల్లూరు, 44. గరికిపాటి కృష్ణమూర్తి, సాయిపేట, కడప, 45. సాధనాల పద్మావతి, భవానీపురం విజయవాడ, 46. ఎమ్.వి. శాయన్నపంతులు, అణుశక్తినగర్, ముంబయి, 47. టి. శ్రావణీ రాఘవేందర్, సంగారెడ్డి, మెదక్ జిల్లా, 48. శివలంకె భ్రమర, మెహదీపట్నం, హైదరాబాద్, 49. ఉడాల భాస్కరయ్య, అడయార్, చెన్నై, 50. ఎ. నరసింహావతారమ్, తపోవనమ్, అనంతపూర్, 51. కరణం శివానందరావు, హన్మంతనగర్, బెంగళూరు, 52. పి. సునంద, కవిరాజనగర్, ఖమ్మం, 53. రామకూరు లక్ష్మి, గుజరాతీపేట, శ్రీకాకుళం, 54. భారతం విజయలక్ష్మి, రమణయ్యపేట, కాకినాడ, 55. అనంతుల సుబ్బారావు, బ్రాడీపేట, గుంటూరు, 56. బందా శివనారాయణ శ్రీనివాసరావు, చందానగర్, హైదరాబాద్, 57. నండూరి నాగేశ్వరరావు, బేగంపేట, హైదరాబాద్, 58. సుంకర కళ్యాణి, తుని, తూ.గో. జిల్లా, 59. యేగేటి శంకరరావు, గరుగుబిల్లి, విజయనగరం, 60. సి.హెచ్. సాలమన్, కొండాపురం, కడప జిల్లా, 61. ప్రమోద్‌కుమార్ సింగరాజు, రామంతాపూర్, హైదరాబాద్, 62. ఆర్. పద్మావతి, పరిగి, అనంతపురం జిల్లా, 63. గండ్లూరి బలరామశాస్త్రి, నాచారం, రంగారెడ్డి జిల్లా, 64. పి. సూర్యకిరణ్, కొత్తపేట, హైదరాబాద్, 65. కన్నేపల్లి విజయలక్ష్మి, మంగువారితోట, శ్రీకాకుళం, 66. మద్దూరి లక్ష్మీరాజ్యం, హైదరాబాద్, 67. కె. గ్రీష్మారెడ్డి, మంచిర్యాల, ఆదిలాబాద్ జిల్లా, 68. పంతం శ్రీనివాసరావు, గెద్దనాపల్లి, తూ.గో. జిల్లా, 69. పంతులు ఆర్.ఎస్.ఎస్., కాట్రేనికోన, తూ.గో. జిల్లా, 70. పి.బి. సీతాదేవి, నరసాపురం, ప.గో. జిల్లా, 71. వాస కృష్ణప్రసాద్, తగరపువలస, విశాఖ జిల్లా, 72. ఇవటూరి శారదాదేవి, మినిమించిరిపాడు, ప.గో. జిల్లా, 73. ఎస్.కె. ఆరవెల్లి, సిరోంచ, మహారాష్ట్ర, 74. రాంసోదర్‌రెడ్డి, సుర్బిర్యాల్, నిజామాబాద్ జిల్లా, 75. టి.ఆర్. బాలకృష్ణారావు, ప్రకాశం నగర్, రాజమండ్రి. 76. శ్రీపెరంబదూరు నారాయణరావు, గాయత్రీహోమ్స్, హైదరాబాద్, 77. అద్దంకి శ్రీరామచంద్రమూర్తి, నాగోల్, హైదరాబాద్.

# చతురంగం - 26 ఆధారాలు

## అడ్డం

1. ప్రేమ (3)
3. పెళ్లి పిలుపులో కీలకపాత్ర దీనిదే, చిరంజీవి సినిమా (4)
6. మొదలు (3)
8. స్వప్నం (2)
9. నూరు (2
11. దుష్యంతుడు శకుంతలను చూసిన చోటు, మునులు నివసించేవాడ (5)
13. తెలుగులో క్యాన్సిల్ (2)
15. చలికాలంలో ఇది తప్పనిసరి (2)
16. హారము కాని హారము.. వేడుకగా తిరగడము (4)
18. సుగ్రీవుని భార్య (2)
21. నవ్వు (2)
22. రామ్‌గోపాలవర్మ సినిమా, పగలుకు వ్యతిరేకం (2)
23. 'ఆనంద్' సినిమాలో నాయిక (4)
25. ఏనుగు (2)
26. మన ప్రధాన పంట (2)
27. హద్దు (2)
28. 'రాసిస్తా రాయలసీమ...' అంటూ బాలయ్యను కవ్వించిన నటి (3)
30. ధర (2)
32. ఏది బాగోకపోతే మన అదృష్టం బాగోదో... అది గందరగోళం (4)
34. కలవస్తే ఫరవాలేదు, కానీ, ఈ వ్యాధి సోకితే గోవిందా (3)
36. 'కృష్ణం వందే జగద్గురుం' హీరో (2)
37. పుత్రులే తడపడ్డారు (3)
38. గమ్మత్తులాంటిదే (3)

## నిలువు

1. ఓంకారం (3)
2. వయస్సు.. కిందనుంచి (2)
3. మంచి, సినిమా ముగింపులో తెరమీద కనిపించేది (2)
4. కలమే, రాసేది (3)
5. సంచలనం లాంటిదే (4)
7. దేవనర్తకి.అందానికి మారుపేరు (2)
8. నడుము (2)
10. చిరునవ్వు (4)
11. త్రిమూర్తులు ఎందరు? (3)
12. ఎడమ (2)
14. అద్దం పదమూడే.. కిందినుంచి (2)
16. ఆకాశం (4)
17. మహేష్‌బాబు కుటుంబకథా చిత్రం (3)
19. మొసలి (3)
20. సంపద (3)
24. 'ఇష్క్' కథానాయకుడు (3)
25. కేసీఆర్ కుమార్తె (3)
26. చేపలు పట్టే సాధనం (2)
29. చిరంజీవి, నగ్మాలు నటించిన ఓ మొగుడు (3)
30. కష్టాలు (3)
31. ఏప్రిల్ 'చతుర' నవల 'సస్యశ్యామలం' రచయిత్రి (3)
33. తిరగబడిన త్రాసు (2)
35. ఇలా పిలుస్తూనే దశరథుడు ప్రాణాలు వదిలాడు (2)

**నిబంధనలు**

✦ చతురంగాన్ని అదే పేజీలో పూర్తిచేసి పంపాలి. ✦ తుడుపులు, కొట్టివేతలు ఉండరాదు. ✦ మా 'కీ'తో సరిపోలిన పూరణలనే పరిగణనలోకి తీసుకుంటాం. ✦ గడువు తర్వాత అందిన పూరణలు పరిశీలింపబడవు. ✦ ఎక్కువ మంది సరైన జవాబులు రాస్తే డ్రా తీసి విజేతను ఎంపిక చేస్తాం. ✦ ఒక్కొక్కరు ఎన్ని కూపన్‌లైనా పంపవచ్చు. ✦ ఉత్తర ప్రత్యుత్తరాలకు తావులేదు.

చతురంగం పంపాల్సిన చిరునామా :

**చతురంగం** చతుర, ఈనాడు కాంపౌండ్, సోమాజిగూడ, హైదరాబాద్ -082

★ ఒకే కవరులో చతురంగం కూపన్లు ఎన్నయినా పంపవచ్చు ★ చతురంగం, చతురప్రవేశిక, కాప్షన్ మీదే, విపుల వినోదిని ఒకే కవరులో పంపినా పరిశీలిస్తాం

# చతురంగం - 26

రూ.150/- బహుమతి

గడువు తేది: మే 17

| | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| 1 | | 2 | ■ | 3 | | 4 లే | | ■ | 5 |
| | ■ | 6 | 7 | | ■ | | ■ | 8 | |
| 9 | 10 | ■ | | ■ | 11 | | 12 | టి | |
| ■ | 13 | 14 | ■ | 15 | | ■ | | ■ | |
| 16 | | | 17 | ■ | 18 | 19 | ■ | 20 | ■ |
| 21 | | ■ | 22 | | ■ | 23 | | | 24 |
| | ■ | 25 | | ■ | 26 | | ■ | 27 | |
| 28 సం | 29 | | ■ | 30 | | ■ | 31 | ■ | |
| ■ | 32 | | 33 | | ■ | 34 | | 35 | ■ |
| 36 | | ■ | 37 | | | ■ | 38 | మా | |

పంపినవారి పేరు: ------------------------------------

వయసు (      ) చిరునామా : ------------------------------

------------------------------------------------------

---------------- పిన్ : ---------- ఫోన్ : --------------

ఆధారాలు, నిబంధనలు 129 పేజీలో...

Printed, Published, Edited & Owned, by Ramoji Rao for Vasundhara Publications, D.No. 6-3-569/3, Eenadu Complex, Somajiguda, Hyderabad-500 082 and Printed at Eenadu Press, No. 7-134 / 1& 2, Moosapet Village, Balanagar Mandal, Kukatpally - 500 072, R.R District, Office Address: CHATURA, Telugu Monthly, D.No. 6-3-569/3, Eenadu Complex, Somajiguda, Hyderabad-500 082, Tel: 23318181, Visakhapatnam: 2552211; Vijayawada: 2494900; Tirupati: 2275757; Anantapur: 273444; Karimnagar: 2223216; Rajahmundry: 2468991; Suryapet: 221146; Guntur: 2512142; Nellore: 2338734; Srikakulam: 240101; Kurnool: 252813; Kadapa: 270011; Tadepalligudem: 228881; Warangal: 2559901; Khammam: 255661; Nizamabad: 245661; Mahabubnagar: 276376; Ongole: 256777; New Delhi: 23753440; Mumbai: 24982818; Chennai: 28232390; Bangalore: 25583804. www.eenadu.net.